# రహస్య గోపనము

శ్రీ పాంచకడిదేవ్
గ్రంధ రచన

కవిరాజహంస-కవికులాలంకార
శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు
గ్రంధ అనువాదకులు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్
గ్రంధప్రకాశకులు ::: రాజమహేంద్రవరం

# ఉపోద్ఘాతము

ఈ నవలను వంగభాషయందు ప్రఖ్యాతనవలా రచయితలగు శ్రీ పాంచకడీ దేవ్ మహాశయులు "సహధర్మిణి" యనునామముతో రచియించి యున్నారు. ఈ నవలయందు సహధర్మిణీధర్మమే కాక రహస్య గోపనము కూడఁ బ్రధానవిషయమగుటచే నాంధ్రీకరణము నందు దీనికి మేము "రహస్యగోపనము" అను పేరుంచితిమి. ఒక స్వల్పసంఘటనమువలన బయలుదేఱిన ఝంఝామారుతావేగముచే సంసారసాగరమంతయు నెట్లు సంక్షుభితంబై పోయెనో యతికరుణముగా నిందుఁ బొందుపఱుపఁబడినది. నీతిదాయకమును రసమయంబును, అద్భుతకల్పనా విలసితంబునగు నీనవలను మా ఆంధ్రసోదరులు చదివి యిందలి విశేషమును గ్రహించి యానందింపఁగలిగినచో మా యాంధ్రీకరణపరిశ్రమ ధన్యము గాఁగలదు.

తాము వంగభాషయందు రచించిన నవలలన్నిటి నాంధ్రీకరించు కొనుటకు మాకనుజ్ఞ నొసంగిన శ్రీ శ్రీ పాంచకడీ దేవ్ మహాశయులకు మేము మా కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నారము.

ఇట్లు
వేంకటపార్వతీశ్వరకవులు.

# రహస్య గోపనము

## మొదటి ప్రకరణము

హారకుమారబాబు పశ్చిమదేశమున వకీలుపని చేసెను. ఆపనిలో నాతఁడు విశేషధనమును సంపాదించెను. ఇప్పు డాతఁడు కేవలము ముసలివాఁడు కాకపోయినను రెండు కారణములచే వకీలుపనిని మానివైచి కలకత్తా లోయరుసర్క్యులరురోడ్డునం దొక సుందరభవనమును గొని యందు నివసించుచుండెను. అతనిభార్య దీర్ఘ జాడ్యముచేఁ జాలదినములనుండి మంచముపట్టి యుండెను. పశ్చిమదేశ మధికోష్ణ ప్రదేశ మగుటచే నామెకుఁ దఱచుగా బాధకలుగుచుండెను. ఆ ప్రదేశమునందుండుట యామె యారోగ్యమునకు భంగకరమని వైద్యులు చెప్పుటచే హారకుమారబాబు పని మానుకొని భార్యతోఁ గూడఁ గలకత్తాకు వచ్చియుండెను. ఇంతేకాక నాతనియేకపుత్త్రిక యగు హేమాంగికిఁ బెండ్లియీడు వచ్చెను. స్వదేశమునందే యామెకుఁ బెండ్లిచేయవలయు నని యాతని యుద్దేశము. ఈ రెండుకారణముల చేతనే యాతఁడు కలకత్తాలో నివసించి యుండెను.

హరికుమారుఁడు చిరకాలమునుండి బ్రాహ్మమతావలంబియై యుండెను. ఆతఁడు హిందూధర్మముల నంతగాఁ బాటించుటలేదు. పశ్చిమదేశముసం దున్నప్పు డాతఁడు కేవలము దొరవలెనే సంచరించెను. ఇచ్చటఁగూడ నట్లే మెలంగుచుండెను. ఆతనికి బాల్య వివాహములన్న నిష్టములేదు. కావుననే యాతఁడు తనతనయ కింత కాలమువఱకును బెండ్లిచేయలేదు. అనకాశమున్నంతవఱ కాతఁడు హేమాంగికి విద్య నేర్పించుచుండెను. హేమాంగి సుందరాంగి. అతి లోకసుందరీమణి. ఆమె దేహచ్ఛాయ యెంతటి మనోహరమైనదియో, కోమలాంగకములుగూడ నంతటి మనోజ్ఞము లైనవియే. ఆమె యెంతటిసుందరీమణియో యంతటి గుణవతియై యుండెను. చదువుట, వ్రాయుట, గానము చేయుట, వీణవాయించుట మొదలగువానియం దామె మిగుల నిపుణమతియై విలసిల్లుచుండెను. ఆసుందరీమణి ఇప్పుడు పదియాఱేండ్ల యీడుగలిగి యుండెను.

చిరకాలమునుండి రోగపీడితయై యున్న హరికుమారునిభార్య తన కెప్పు డేవిధముగా నుండునో యనుసంశయముతోఁ దాను జీవించి యుండఁగనే కొమార్తె కెట్లయినఁ బెండ్లిచేయవలయు నని ప్రతిదినమును భర్తను దొందర పెట్టుచుండెను. ఏకపుత్రిక యగు హేమాంగి పెండ్లి కన్నులారఁ జూచుభాగ్యము కలుగునో కలుగదో యని యామె [illegible] తల్లడిల్లిపోవుచుండెను.

కాళీపురపుజమీందారుఁడగు అనంతబాబు హరికుమారున [illegible] జాలదగ్గఱబంధువుఁడు. ఆ జమీందారునితనయుఁ డగుసతీశచంద్రుఁడు విమలచరిత్రుఁడును, విద్యావంతుఁడును, యువకుఁడునై యుండెను. ఆ సతీశచంద్రునకుఁ దనతనూజాత నొసంగి పెండ్లి చేయవలయు నని హరికుమారుఁడు చాలదినములనుండి యోచించుకొనుచుండెను.

సతీశచంద్రుండును తఱచుగా హరకుమారునింటికి వచ్చుచుండెను. ఇంటివారందఱు నాతని నతిప్రేమతో నాదరించుచుండిరి. హేమాంగితో గూడ నాతనికి విశేషపరిచయమును స్నేహమును గలిగెను. సుందరీమణి యగు హేమాంగి తాను సతీశుని ప్రేమించినను, ప్రేమింపకపోయినను దనతల్లిదండ్రులయుద్దేశములను బట్టి యెప్పటికైనఁ దాను సతీశుని గృహిణిగా యుండవలసివచ్చునని యెఱింగి యుండెను. హరకుమారుఁడుగాని, యాతనిభార్యగాని యింతవఱకును గొమార్తెయొద్ద నీవిషయముంగూర్చి ప్రస్తావించి యుండలేదు. అయినను హేమాంగి తన తల్లిదండ్రులనిశ్చితాభిప్రాయమును సంపూర్ణముగ గ్రహించియే యుండెను. సతీశునకుఁగూడ నీసంగతియంతయును దెలిసియుండెను. కాని యాతఁడైనను హేమాంగితో నీవిషయముంగూర్చి యెన్నఁడును మాటలాడియుండలేదు. ఎవ్వరు చెప్పకపోయినను హేమాంగి సర్వమును గ్రహించియుండెను. ఆ విషయమున నామె కెంతమాత్రము నసంతుష్టి గలుగలేదు.

సతీశచంద్రునకుఁ దండ్రి లేఁడు. అతఁడే యిప్పుడు జనకునిసర్వస్వమునకు నేకాధికారియై యుండెను. అతఁడు బంగాళమునందుఁ బెద్ద జమీందారుఁడు. హేమాంగి విద్యావతి యయ్యును గొప్పయింటికోడలగుటకై స్త్రీజనసహజంబగు కుతూహలముతో నెదురు చూచుచుండెను. అదృశ్యంబగుభవిష్యద్గర్భమునం దావరించుకొనియున్న ఘనంధకారమునం దేమిదాఁగియున్నదో యెవ్వ రెఱుంగఁగలరు! భవితవ్యత దేవతలకుఁగూడ నగోచరమైనది. మానవులు దాని నెట్లు తెలిసికొనఁగలుగుదురు! హేమాంగిగాని, యామె తల్లిదండ్రులుగాని యా విషయము నించుకంతయు నెఱుంగఁజాలకుండిరి.

[illegible] ప్రేమించబడుచుండెనో, అక్కఱ లేదో యనువిషయమునుగూర్చి హేమాంగి యెప్పుడును బాగుగ నాలోచించుకొనియుండలేదు. కాని హేమ మెప్పుడును సతీశునియెడల [illegible] భావమును జూపియుండలేదు. సతీశుండు మనఃపూర్వకముగాం దన్నుం బ్రేమించియున్నాండని హేమాంగికి సంపూర్ణముగాం దెలిసియుండెను.

## రెండవ ప్రకరణము

హారకుమారుండు వకీలుపని మానివైచినప్పటినుండియు నొక విధముగా సోమరితనమున కలవాటుపడిపోయెను. చేయవలసినపని యేదియును లేకపోవుటచేతనో, నిరంతరమును భార్య వ్యాధిపీడితురాలై పడియుండుటచేతనో, మఱి యేకారణముచేతనో, గాని యాతనికిం బ్రతి నిమిషమునను దన యారోగ్యవిషయమున సంశయము గలుగనారంభించెను. ఏసమయమున కెట్టి జబ్బుచేయుట తటస్థించునో యను భయముచే నాతండు రోగము లేకుండంగనే యకారణముగ వైద్యుని బిలిపించి యారోగ్యముకొఱకు మందులను సేవింప నారంభించెను. ఔషధములు సేవింపనివేళలలో టీ త్రాగుట కలవాటుపడియెను. ఈ యవివేకమువలన డాక్టరులకుం గావలసినంతడబ్బు దొరకుచుండెను.

టి మొదలగునవి త్రాగుటమూలమున నాతని సేవకులకుం గూడఁ గొలఁదిగనో గొప్పగనో లాభము గలుగకుండఁబోవుట లేదు.

వ్యాధిగ్రస్తురాలై యున్న హారకుమారునిభార్య యించుక నెమ్మదిగా నున్నప్పుడు మంచమునుండి లేచి యొకపడకకుర్చీపై దిండుఁ జానుకొని కూర్చుండి యుండును. నేఁటిదినమామె యట్లే కూర్చుండియుండెను. హేమాంగి యామె పార్శ్వమునందుఁ గూర్చుండి మేజోళ్లు నల్లుకొనుచుండెను. అప్పటికప్పుడే పశ్చిమాకాశమున సంధ్యారాగ మలముకొని యుండెను. భానుదేవుం డపర సముద్రమునఁ గ్రుంకుటకు సిద్ధముగా నుండెను.

అప్పు డాకస్మికముగాఁ దల్లి తనయవంకఁ గనుంగొని "అమ్మా! ఎవ్వరో వచ్చినట్లున్నది! చూడుము!" అనియెను.

ఏదియో యొకబండి వచ్చి తమ ద్వారముచెంత నాఁగినచప్పుడామెకు వినఁబడియెను. కాని లోపలి కెవ్వరైన వచ్చినయలికిడి మాత్రము వినఁబడలేదు.

హారకుమారబాబునకుఁ దేనీరు త్రాగువేళ యైనది. సేవకులు సర్వమును సిద్ధముగఁ జేసి యాతని గదియందొకచిన్న బల్లపై నుంచి యెదురు చూచుచుండిరి. కాని యాతఁ డింకను రాలేదు. ఇతఁడు ప్రతిదినమును సకాలమునకుఁ దేనీరు త్రాగుచుండును. ఎంతపని యున్నను దేనీటిపానమునకు సమయాతిక్రమణము చేయువాఁడు గాఁడు. నేఁటి యాలస్యముం గాంచి యాతనిభార్య మిగుల నాశ్చర్యపడియెను. ఆమె కొంతసేపటివఱకు నట్లే యెదురుచూచుచుండి హారకుమారుఁ డెంతకును రాకుండుటచేఁ జాలవికలహృదయముతోఁ గాంచి "అమ్మా! మీ నాయనగారు వెలుపలిగదిలోఁ గూర్చుండి నిద్రించుచున్నారు గాఁబోలును! ఇంకను లేవకుండుటకుఁ గారణమేమో తెలియుట లేదు. ఒకసారి పోయి చూచిరమ్ము!" అనియెను.

హేమాంగి యల్లుచు నల్లుచున్న మేజోళ్ల నచ్చటఁ బడవైచి చటాలున లేచి తండ్రికొఱకు వెలుపలనున్న గదిలోనికిఁ బోవుచు "బాబా! తేనీరు సిద్ధమై యున్నది. మీరింకను—" అనుచుండఁగనే యామె మాట యాఁగిపోయెను. ఆమె యాత్రముతో లోపలఁ బ్రవేశించునప్పటికి హారసుకుమారుని పార్శ్వమునందొక యువకుండగు పెద్దమనుష్యుఁడు కూర్చుండి యుండెను. అపరిచితుఁ డగు నా పురుషునిం గాంచినంతనే యాసుందరీమణి కంఠస్వరము రుద్ధమైపోయెను. ఆయువతీమణిం గాంచినంతనే యాపురుషుఁడు సంభ్రమముతో లేచినిలువఁబడియెను. అప్పుడు హారసుకుమారుఁ డాతనిఁ గాంచి "రమేంద్రబాబూ! కూర్చుండుము. ఈబాలిక నా తనయ" అనియెను.

హేమాంగి మఱియేమియును మాటలాడ లేదు. నల్లగలువల వలె నతిసుందరములై యతివిశాలములై యాకర్ణాంతములైన యామె తరళనయనము లించుక నిమీలితము లయ్యెను. ఆమె తత్క్షణమునందే యడుగులు తడఁబడుచుండ నటనుండి యతివేగముగ నవ్వలికిఁ బరుగెత్తుకొనిపోయెను.

రమేంద్రనాథుఁ డొకదరిద్రురాలి తనయుఁడు. ఆతనికిప్పుడు తండ్రి లేఁడు. తల్లిమాత్రమే జీవించి యుండెను. ఆతఁడు స్వప్రయత్నముచే నుపకారవేతనలాభముంగాంచి వైద్యకళాశాలలో డాక్టరుపరీక్షకుఁ జదువుచుండెను. ఇఁక నాతఁడు కొలఁదికాలములోనే డాక్టరుపదవి నలంకరించి యధికవేతనమును సంపాదింపఁగలఁడు.

హారసుకుమారబాబునకు డాక్టరు లనిన మిగుల గౌరవము. ఆతఁడు డాక్టరులను గాంచి యెప్పుడు నాదరించుచుండును. ఆతని కీనడుమనే రమేంద్రునితోఁ బరిచయము గలిగెను. రమేంద్రుని విస్రమ

భావమును, కుశాగ్రబుద్ధియు, వైద్యవిద్యయందలి నైపుణ్యమును, చికిత్సాపద్ధతులయందలి నేర్పునుగాంచి హారకుమారుఁ డాతనియెడల నతిప్రీతుండై యుండెను. రమేంద్రుఁ డిప్పుడు సెలవుదినములలోఁ గళాశాల మూయఁబడుటచే స్వదేశమునకుఁ బోవలయు నని వచ్చి యుండెను. కానిహారకుమారుఁడు కొలఁదిదినములుమాత్రము మాయింట నుండవలయు నని యాతని బలవంతపఱిచి యాఁపి యుండెను. ఆకారణముచేతనే రమేంద్రుఁ డిప్పుడు హారకుమారు నింటికి విచ్చేసెను.

రెండుమూఁడుదినములుమాత్ర మట నుండుటకు నిశ్చయించుకొని రమేంద్రుఁడు వచ్చెను. కాని యొకవారము, రెండువారములు, క్రమముగా నొకమాసముకూడఁ గడచిపోయెను. అతఁ డెప్పటికప్పుడే యింటికిఁ బోవలయు నని తలంచుచుండెను గాని ప్రయాణముమాత్రము సాగుటలేదు. ఇది చాల నాశ్చర్యకరమగువిషయమే. అందులకు సందేహము లేదు, కాని దీనికిఁ గారణము లేకపోలేదు. మొదటి నుండియు హారకుమారునకు రమేంద్రునియందు మిగుల నిష్టము జనియించి క్రమముగా వర్ధిల్లుచుండెను. ఆతనిచికిత్సయందు హారకుమారుని కొక విధమగువిశ్వాసము కుదిరెను. రమేంద్రుఁ డిప్పుడు డాక్టరుపదవియందు లేకపోయినను కొలఁదికాలములో డాక్టరగుటకు సిద్ధముగా నుండెను. హారకుమారుఁడు తనభార్యరోగమువిషయమై సవిస్తరముగా నాతనికిఁ దెలిపి యుండెను. రమేంద్రుఁడు తనబుద్ధికుశలతచే బాగుగ నాలోచించి యొకనూతనౌషధమును సిద్ధముచేసి ప్రతిదినము నామెచే సేవింపఁజేయుచుండెను. ఆ మందును సేవించుటవలన నొకనాఁటి కంటె నొకనాఁ డామెయారోగ్యవిషయమున సుగుణము గానవచ్చుచుండెను. అందుచేతనే హారకుమారుఁ డింకను గొలఁదిదినములుండి చూచిపోవలయునని రమేంద్రుని బలవంతపఱుచు చుండెను.

హేమాంగితల్లి కూడ రమేంద్రుని మఱికొన్నిదినము లాఁపవలయునని భర్తతోఁ జెప్పుచుండెను. రమేంద్రునకుమాత్ర మెప్పు డింటికిఁ బోవుదునా యని తొందర గలుగుచుండెను గాని కార్యావశ్యకముం బట్టి యామెతో మాఱుమాట చెప్పఁజాలక యట నాఁగిపోయెను.

ఒకనాఁటికంటె నొకనాఁడు హరకుమారుఁడును, అతని భార్యయుఁగూడ రమేంద్రుని సద్గుణగణంబులచే నాకర్షింపఁబడిపోవు చుండిరి. రమేంద్రుని హృదయమునుగూడ నాకర్షించుపదార్థ మచ్చట లేకపోలేదు. త్రిలోకసుందరీమణియగు హేమాంగిరూపగుణ నిత్య సందర్శనముచే నాతఁ డనునిమిషమును ముగ్ధుఁడై పోవుచుండెను.

ఇఁక హేమాంగియో—ఆమె సతీశునితో నిత్యపరిచయము గలిగియున్నను, తనతల్లిదండ్రు లాతనికిఁ దన్నిచ్చెదరని యెఱింగి యున్నను నింతవఱ కామె యాతని బ్రేమింపఁజాలకయే యుండెను. కాని యిప్పు డీసుందరుఁడును, యువకుఁడు నగురమేంద్రుఁ గాంచి నప్పటినుండియు వికసనోన్ముఖమై యున్న యా యువతీమణిహృదయ కమలము మధురసౌరభముల వెలువరించుచు నామెను ముగ్ధురాలిగాఁ జేసివైచు చుండెను. ఈ నేఁడిదినములునుగూడ రమేంద్రునితో నొక్కచోఁ గలసి యుండుటవలన నాతని లోకమోహనమూర్తి యా యంగనామణి నిర్మలహృదయఫలకమునం దంకితమైపోయెను.

అతని యూరేదియో, కులమేదియో కూడ నామె యెఱుంగదు. ఈ విషయమై యామె యెప్పుడు నాతని నడిగియుండలేదు. ఏమియు నెఱుంగకుండఁగనే హేమాంగి యాతనిఁ బ్రేమించుచుండెను. అట్లు ప్రేమించుట తనవంటిదాని కుచిత మగునా కాదా యనువిషయమును గూడ నామె యొకప్పుడు నాలోచించుకొని యుండలేదు. ఎల్లప్పుడు నాతనితోఁ గలసి యుండుటకే యామె కుతూహలపడుచుండెను;

అతనితో మాటలాడుచుండుటకే యామె యానందపడుచుండెను. ఆ కుతూహలము, ఆ యానందముకంటె నామె మఱియేమియు నెఱుంగదు. అంతకంటె నెక్కువగా నాలోచించుకొనుట కామె కావశ్యకముగాని, యవసరముగాని లేకపోయెను.

రమేంద్రునకీసంగతి యంతయును సంపూర్ణముగాఁ దెలిసి పోయెను. కుసుమకోమలంబగు హేమాంగిహృదయము మఱియొక హృదయముతో శాశ్వతముగా హత్తుకొనుటకై క్రమక్రమముగా నెదురు వచ్చుచున్న దనుసంగతి రమేంద్రునకవగతము గాకపోలేదు. అప్పుడాతని జీవితమంతయును గ్రొత్తయాశలచేఁ గ్రొత్తరీతుల నలంకరింపఁబడి క్రొత్తరూపముతోఁ గ్రొత్త తేజముం గాంచి విరాజిల్లు చున్నట్లాతని కనుభవగోచరం బగుచుండెను.

## మూఁడవ ప్రకరణము

సుఖస్వప్న మెంతయోసేపు నిలిచియుండునది గాదు. ఈవిధముగా నాలుగువారములు గడచిపోయెను. ఇఁక రమేంద్రున కింటికిఁ బోవలసినసమయ మాసన్న మగుచుండెను. ఆతఁడు హారకుమారునికడ సెలవుగైకొని పోవలయును. ఒకనాఁడు హేమాంగి తనయింటిలో

నొంటిగా నుండెను. రమేంద్రుఁ డాసమయమునం దామెకడకుఁ బోయి తనప్రయాణముం గూర్చి ప్రస్తావించెను. హేమాంగి తలవంచుకొని ఉపచారముతో నేదియో యల్లుచునల్లుచునే "ఏమి! ఇంతతొందరగా నేలపోవలయును? ఇంకను నొకటిరెండుదినము లుండఁగూడదా?" అనియెను.

రమేంద్రునికుండె లతితీవ్రముగఁ గొట్టుకొనఁ దొడంగెను. అప్పు డాతఁడు మృదుస్వరముతో "ఇంకను దొందరయే యనుచుంటివా? నేనిచ్చట రెండుమూఁడుదినములుమాత్ర ముండెద నని చెప్పి వచ్చియుంటిని. ఇప్పటికి నెలపదునేనుదినము లైనవి! ఇఁక నైనను బోవలదా?" అనియెను.

హేమా: మీరు దయచేయుచుండు మందువలన మాయమ్మకు జబ్బు చాలవఱకు గుణముగా నున్నది.

రమే: పరమేశ్వరునియనుగ్రహమువలన నామె యతిశీఘ్రకాలములోనే సంపూర్ణారోగ్యముం బడయఁగలదు.

హేమా: మాతల్లిగారిజబ్బు నెమ్మదిపడుట కింకను నెన్నిదినములు పట్టును?

ఈప్రశ్నకు రమేంద్రుఁ డేమని ప్రత్యుత్తర మీయఁగలఁడు? హేమాంగితల్లిజీవనము క్రమక్రమముగా సంకీర్ణమైపోవుచున్నదను సంగతి నాతఁడు బాగుగా నెఱింగి యుండెను. అందుచే నాతఁడు దాని కేమియు బదులు చెప్పక "నేనిఁక మరలఁ గాలేజికిఁ బోయి యెంతో కష్టపడి చదువవలసియున్నది. ఇచ్చట మీదయవలన నెంతయోసుఖముగాఁ గాలక్షేపము చేసితిని. నేను జీవించియున్నంతకాలమునుగూడ నీసుఖస్మృతి నాహృదయమున స్ఫురించుచుండును. మీయాదరమును నేనెన్నఁటికిని మఱవఁజాలను" అనియెను.

హేమాంగి పరాకుగా రెండుచేతులతోడను ఊలుదారమును దొందరగా నల్లుచు "అట్లయినచో మీరిచ్చటనుండియే తిన్నగాఁ గళాశాలకుఁ బోయెదరా ?" మీయింటికిఁ బోరా ?" అనియెను.

రమేం : పోయెదను. నాకింకను నొకవారముదినములవఱకును సెలవున్నది. ఒకసారి మాయూరు పోయి మాయమ్మను జూచి వచ్చెదను.

అప్పుడు హేమాంగి తనసుందరవదనమండలము నించుక పైకెత్తి "ఏమంటిరి ? మీయమ్మయా ? ఆమెసంగతి మీరెప్పుడును జెప్పనే లేదు ? మీదేయూరు ?" అనియెను.

రమే : మా గ్రామము యశోహరమండలమునందున్నది. మా స్థితిగతు లంతమంచివి గావు. మేము చాలపేదవారము.

హేమాంగి యిఁక నేమియును మాటాడలేదు. అట్లే చూచుచు నిలువఁబడి యుండెను.

రమేంద్రునిస్వరము మఱింతగంభీరమయ్యెను. అప్పుడాతఁడు "నాకు డాక్టరుపదవి లభించినచో మాతల్లిగారికష్టము లన్నియును దీఱి పోవును. అందుచేతనే నేనెంతయో శ్రమపడి చదువుకొనుచున్నాను. మాయమ్మగారు వకీలుపరీక్షకుఁ జదువవలయునని నాకు బోధించి యున్నారు" అనియెను.

హేమా : అట్లయినచో మీరాప్రయత్న మేలచేయలేదు మాతండ్రిగారు వకీలుపనియే చేసియున్నారు.

రమే : నేనే కుతూహలపడి డాక్టరుపరీక్షకుఁ జదువుచున్నాను. ఈదినములలో నకీళ్లయవస్థ చాలవఱకుఁ జెడిపోయియున్నది. వారికంత

గానమునుగూడ లేకుండఁబోయినది. డాక్టరయినచో నేదోవిధముగా గానమును డబ్బునుగూడ సంపాదించుకొనుట కవకాశ మున్నది.

హేమాంగి మాటాడుచునే ఊలు నల్లుకొనుచుండెను. ఆమె రమేంద్రునివంకఁ దెల్లపోయి చూచుచు "అయ్యో! ఊలంతయును జిక్కులుపడిపోయినది!" అనియెను.

అది ఊలుదోషము గాదు. హేమాంగి యపచారముచేతనే ఊలంతయుఁ జిక్కువడిపోయెనని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఆమె హృదయాంతరాళమునం దెన్నియోభావవిద్యుల్లత లీవిధముగనే చిక్కులు పడిపోవుచున్నవి.

రమేంద్రుఁడు హేమాంగిం గాంచి "ఆచిక్కు నేను వదలింపఁ గలనేమో యించుక ప్రయత్నించి చూచెదను" అనియెను.

హేమాంగి ముఖమండలమంతయు నెఱ్ఱవడిపోయెను. రమేంద్రుఁ డప్పు డామెచేతియందలి ఊలుదారము నొకకొసను బట్టుకొని చిక్కు వదలించుటకుఁ బ్రయత్నించుచుండెను. ఆ దారపు రెండవకొస యా రమణీమణి చేతియందే యుండెను. ఆ సమయమునందు రమేంద్రుని రమణీయవదన మనేకపర్యాయము లాయువతీమణి ముఖకమలమును సమీపించుచుండెను. ఆ కారణముచే నామె సుందరాననము మఱింత రాగరంజితమగుచుండెను. రమేంద్రుని ముఖముగూడఁ గంఠమువఱకు నెఱ్ఱనై యుండెను. తుదకాయిరువురును మెల్లఁగ విడుచుచున్న నిశ్వాసపవనము లేకమై వెలువడునంతటి సమీపముగా నయ్యిరువురి యుత్తమాంగములును జేరుకొని యుండెను. ఆ చిక్కు వదలించుటకై యా యువతీయువకు లిరువురిశరీరములును హృదయములతోఁగూడ నంత దగ్గఱగాఁ జేయవలసివచ్చెను.

ఆ సమయమునకు సరిగా నొకవ్యక్తి తిన్నగా లోపలికిఁ బోయి ప్రవేశించెను. ఆ యిరువురిలో నొక్కరునుగూడ నావ్యక్తిరాకను గనుపెట్టనేలేకపోయిరి. ఆ యుభయులునుగూడ నంతటియనన్య మనస్కులై యుండిరి.

ఆ వ్యక్తి యెవ్వరు? చాలదినములనుండి హేమాంగిని ప్రేమించుచు నామెను బెండ్లియాడి సుఖజీవనము నానందమయముగఁ జేసికొనవలయునని యువ్విళ్లూరుచున్న సతీశచంద్రుఁడే! సతీశచంద్రుఁ డారమణీరమేంద్రుల పరస్పరసమ్మేళనమును గన్నులారఁ గాంచి స్తంభితుఁడై పోయెను.

అప్పుడు హేమాంగియు, రమేంద్రుఁడునుగూడ నాకస్మికముగ నదరిపడి యతిసంభ్రమముతో నెమ్మొగమ్ములఁ బైకెత్తి చూచిరి. ఎఱ్ఱదామరవలె నారక్తమై యున్న హేమాంగిసుందరవదన మంతలోఁ దెల్లనై పోయెను. కాని యామె నిమిషములో మనసు నెమ్మదిపఱచుకొని యెప్పటివలె నిలువఁబడియెను. ఇంతలో సతీశుఁడు వారిచెంతకు వచ్చెను.

రమేంద్రుఁడును, సతీశుఁడు నొకరికొకరెదురుగా నిలువఁబడియుండిరి. సతీశుఁడు రమేంద్రునిం గాంచుట కిదియే మొదటి పర్యాయము. సతీశుఁ డీయాఱువారముల నుండియు గ్రామాంతరమునకుఁ బోయియుండెను. అందుచే నాతఁడీనడుమ హారకుమారుని యింటికి వచ్చుట తటస్థింపలేదు.

అప్పుడు హేమాంగి సతీశునిం గాంచి యస్పష్టస్వరముతో "సతీశబాబూ! ఈతఁడు రమేంద్రుఁడు" అని చెప్పెను.

సతీశరమేంద్రు లిరువురు నొకరినొకరు బాగుగఁ జూచుకొనిరి. ఒకరికొకరు ప్రతిపక్షుల మని యప్పుడా యిరువురునుగూడఁ దమహృదయములందు నిశ్చయించుకొనిరి. కాని యొకరితో నొక రేమియును

మాటాడలేదు. అప్పుడు హేమాంగి సతీశునిం గాంచి మెల్లఁగా "సతీశబాబూ! ఎప్పుడు వచ్చితిరి? తండ్రిగారిని జూచి వచ్చితిరా?" అని యడిగెను.

సతీ : లేదు. ఆయన యీ గృహమునం దున్నారని సేవకుఁడు చెప్పి యున్నాఁడు. అందుచే నేనిచ్చటికి వచ్చితిని.

రమేంద్రుఁ డప్పుడు తానేమియు మాటాడకుండుట గౌరవము గాదని భావించి "అయ్యా! ఆయన యిప్పుడే యావలకుఁ బోయి యున్నారు. ఇంకను రాలేదు" అనియెను.

సతీశుఁ డాతనిమాట కెట్టి ప్రత్యుత్తరమును జెప్పక హేమాంగి వంకఁ దిరిగి నిలువఁబడియెను. అందువలన రమేంద్రునిముఖనయనము లెఱ్ఱనై పోయెను. అప్పుడాతఁడు మెల్లమెల్లఁగా నాగృహమునుండి యవ్వలికి వెడలిపోయెను.

అప్పుడు సతీశుఁడు హేమాంగి మొగమువంకఁ బరిశీలించి చూచుచు "హేమా! ఈతఁడెవ్వరు? ఇచ్చటి కేల వచ్చినాఁడు?" అని ప్రశ్నించెను.

హేమాంగికి మనసులో నెంతయో కోపముగా నుండెను. వెంటనే యామె "ఇప్పుడేకాదా చెప్పితిని? ఈతఁడు రమేంద్రుఁడు!" అనియెను.

ఆ స్వరమునం దించుక ఝంకారమువలెఁగాఠిన్యము శ్రుతిగోచర మగుచుండెను. అట్టికఠినస్వరముతోఁ బ్రత్యుత్తర మిచ్చినందులకు హేమాంగి తనలోఁ దానే యులికిపడియెను. ఇంచుక వికలహృదయముతో నామె తెల్లపోయి నిలువఁబడియెను. అంతలోనే యామె తన మనసు పదిలపఱచుకొని సహజకంఠస్వరముతో "సతీశబాబూ! ఆయన డాక్టరుపరీక్షకుఁ జదువుచున్నారు. ఆయనకును నాయనగారికిని

బరిచయము గలిగినది. అందుచే నాయనగా రాయనను గొన్నాళ్లు మాయింటనుండవలయు నని ప్రార్థించిరి. ఆమాట త్రోసివైవఁజాలక యిచ్చట నున్నారు. ఆయనను దండ్రిగా రెంతయో ప్రేమించి యున్నారు. మేముగూడ—" అని చెప్పుచు నంతలోనే యులికిపడి యామాట మార్చివైచి "ఆయన చాలమంచివారు; గౌరవముగల వారు" అనియెను.

సతీశుఁ డోష్ఠాధరములను గుంచితములుగాఁ జేసి గాఢస్వర ముతో "అలాగా? సరే—హేమా! మీతల్లిగారి నొకసారి చూచి వత్తము రమ్ము! ఆమెకు బాగుగ నారోగ్యముగా నున్నదా ?" అనియెను.

ఇంతవఱ కెన్నఁడును హేమాంగి సతీశునిమాటను మన్నింపకుండ నుండలేదు. ఆమెహృదయమునం దాతనియెడల వ్యతిరేకాచరణముం గావింపవలయు నని తోఁచుటకుఁ గేవల మిదియే మొదటిసారి. ఆమె కిప్పుడు సతీశునితోఁ గలసి తల్లియొద్దకుఁ బోవుట యిష్టము లేకయుండెను. అందుల కామె హృదయ మెంతమాత్రము నంగీకరింపకుండెను. పోవుట కిష్టములేకపోయినను భావగోపనము గావించుకొని యెట్లో బయలుదేఱెను. ఏమియు మాటాడకుండఁగనే యామె సతీశునితోఁగూడఁ దల్లిచెంతకుఁ బోయెను.

* * * *

మఱునాఁటి యుదయముననే రమేంద్రుఁడు హరకుమారుని యొద్ద సెలవుగైకొని హేమాంగితోడను ఆమెతల్లితోడను జెప్పి తనయింటికి వెడలిపోయెను.

ఆనాఁడు మొదలుకొని హేమాంగి సతీశునితో నంతయిష్టముగా మాటలాడుటలేదు. ఒకనాఁ డయ్యిరువురకు నించుమించుగా వాక్కలహమే యయ్యెను. ఇంతవఱకును గలసియున్న యిరువురి హృదయములకును నడుమ నేదియో యొకవ్యవధాన మేర్పడి దూరము చేయుచుండె ననుసంగతి హేమాంగికిని, సతీశునకునుగూడ గోచర మగుచునే యుండెను. ఆ యిరువురిలో నెవ్వరునుగూడ నొకప్పుడును రమేంద్రునిమాట తలపెట్టుటయే లేదు. ఆమాట నిజమే—కాని రమేంద్రుఁ డిచ్చటికి రాకయే యుండినచోఁ దమహృదయములయం దిట్టియపూర్వ పరివర్తనము గలిగియుండదని యుభయులును గూడ గ్రహింపఁగలిగిరి.

## నాలుగవ ప్రకరణము.

అప్పుడే రెండుసంవత్సరముల కాలము గడచిపోయెను. ఈ రెం డేండ్లలోను హేమాంగి జీవితమునం దనేకపరివర్తనములు సంఘటిల్లెను.

చిరకాలమునుండి దీర్ఘవ్యాధిచేఁ బీడితురాలగుచున్న యామె తల్లి యింకను నట్టియవస్థలోనే జీవించి యున్నది. కాని యామె తండ్రియగు హారకుమారబాబీలోకమును విడిచి పరలోకగమనము గావించెను. ఆఱుమాసముల క్రిందట నాతఁడు దీర్ఘరోగబాధితుఁడగు తన పత్నిని, గల్యాణవయస్కయగు కుమారీరత్నమును శోకసాగర తరంగములయందుఁ దేల్చివైచి తాను మహాప్రస్థానముం గావించెను.

దీర్ఘరోగముచేతనే గాక పతిమరణదుఃఖముచేఁగూడఁ దల్లి కేవలము మంచము పట్టియుండుటచే సంసారసంబంధమగు సకలకార్య భారమును హేమాంగి నెత్తిమీఁదనే పడియెను. ఆమె బాలికయై యుండుటే కాక యెప్పుడును దల్లిదండ్రులచే నతిగారాబమునఁ బెంపఁ బడిన బిడ్డయై యుండెను. కష్టములును, విచారములు ననుమాట యా బాలికారత్న మెఱుంగనే యెఱుంగదు. అట్టి సుకుమారి యిప్పుడు సమస్త సంసారభారమును వహించి యనేకవిధములఁ గష్టపడవలసి వచ్చెను. ఆమె కిప్పుడు జీవితమునందు సుఖమును, శాంతియు నించు కంతయును లేకుండఁబోయెను. ఆమెతల్లి రోగదుఃఖములచే మంచము పట్టి యుండెను—ఆమెతండ్రి పరలోకగతుఁ డయ్యెను — ఆమె నాదరించి యించుకసాయము చేయుటకు సమీపబంధువు లెవ్వరును లేకుండఁబోయిరి—ఇఁక నామెను జూచువా రెవ్వరు? ఆమె కష్ట సుఖముల నాలించు వా రెవ్వరు?

చాలకాలమునుండి రమేంద్రుని సమాచారము లేమియును దెలియవచ్చుట లేదు. ఆతఁ డేదేశమునం దుండెనో, ఏమిపని చేయుచుండెనో హేమాంగికిఁ దెలియుట లేదు. ఆతనికడనుండి యొక యుత్తరమైనను రాకుండెను. ఏతావునఁనుండెనో తెలియనివానికి హేమాంగిమాత్ర మెట్లు జాబు వ్రాయఁగలదు?

హారకుమారుఁడు మరణించినతరువాత సతీశచంద్రుఁడు మునుపటి వలె నాయింటికి వచ్చుచుండుట లేదు. కేవలము మఱియాదకొఱకు వచ్చి పరామర్శించిపోవుట యుచితము గావున నాతఁడు దినమునకొకసారి యెప్పుడో వచ్చి యలవోకగా వారియోగక్షేమములఁ దెలిసికొని పోవుచుండెను. అంతేకాని యాతఁడు పూర్వపువిషయములనుగూర్చి యెన్నఁడును ప్రస్తావించుటయే మానివైచెను. నిరాధారయైయున్న హేమాంగి భాగ్యవతియై యున్నను నతికష్టముతో దినములపై దినముల నెట్లో గడపివైచుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు సతీశచంద్రుఁ డాయింటికి వచ్చెను. ఆతనికి మునుపటివలె నాయింటికి రానలయు ననుకుతూహలము గలుగుట లేదు. హేమాంగితల్లి యెవ్వరిచేనైనఁ గబురు పంపినప్పుడే యాతఁడు తప్పించుకొనలేక వచ్చుచుండెను. ఈ దినమునఁగూడ నాతఁ డట్లే వచ్చియుండెను.

హేమాంగి విషణ్ణవదనయై యొక్కచోఁ గూర్చుండి యుండెను. సతీశుఁ డామెచెంతకుఁ బోయి యెదురుగఁ గూర్చుండెను. మునుపటి సంతోషములేదు, యువతీమణి యగుహేమాంగిసుందర వదన కమలము నందు మునుపటియానందవికాసము కానరాకుండెను. కొంతసేపటివఱకు నిరువురును మౌనమును వహించి యుండిరి. తుదకు సతీశుఁడే హేమాంగిని బలుకరించి “ హేమా ! నీవిప్పు డనుభవించుచున్న కష్టమునుబట్టి బాగుగ నాలోచింపఁగా సంసారభార మిరువురువహింపఁ దగినదిగాని కేవల మొక్కరుమాత్రమే మోయుటకు సాధ్యమైనది కాదని నాకు బోధయగుచున్నది. ఏమనియెదవు ? ” అనియెను.

ఆమాట విన్నంతనే హేమాంగి యులికిపడి వంచినమొగము నించుకపైకెత్తెను. ఆమెహృదయమతివేగముగఁ గొట్టుకొనఁదొడంగెను.

అప్పుడు సతీశచంద్రుఁడు మరల మృదుస్వరముతో "హేమా! నీవింకను జిన్నబాలికవు గావుగదా! నీకిప్పుడు ప్రాయమును, ప్రాజ్ఞతయు నున్నది. నీవు నాయుద్దేశమును బాగుగ గ్రహించియే యుందువు—ఇటుచూడుము! నేను నిశ్చయముగాఁ దలఁచుకొన్నచో నిదివఱకే—చాలకాలముక్రిందటనే యేయువతీరత్నమునో పెండ్లి చేసికొనియే యుందును. హేమా! నేనొక్కమాటచెప్పెదను వినుము. నీకుమాత్రము తెలియదా యేమి? ఆతనికంటె వేయిరెట్లు నేనే నిన్నుఁ బ్రేమించి యున్నాను" అనియెను.

హేమాంగి యదరిపడియెను. మాటాడుట కామెకంఠము బిగిసికొనిపోయెను. అయినను బలవంతముగ నామె సంభ్రమముతోఁ జటాలున "ఎవ్వరికంటె?" అని ప్రశ్నించెను.

ఎవ్వఁడో యొకదుష్టరాక్షసుఁ డగపడకుండ వచ్చి తనకఠినహస్తముతో హేమాంగికంఠమును నొక్కివైచినట్లయ్యెను. ఎంతప్రయత్నించినను నామెనోటమాట వెలువడదయ్యెను. కొంతసేపటికామె యతికష్టముతో "సతీశా! నీవింకను నాతనిమాట మఱచిపోలేదా? ఆతఁడు నాకెవ్వరు? నేనాతని కెవ్వతెను?—" అనుచుండఁగనే యాసుందరీమణి గద్గదస్వరము క్రమక్రమముగా నవసన్నమైపోయె.

అప్పుడు సతీశుఁ డించుకస్వస్థచిత్తుఁడై "హేమా! అట్లయినచో నీవు మాఱుమాటాడక యంగీకరింపుము—నేనిప్పుడే మనవివాహమునకుఁ దగినప్రయత్నములం గావించెదను. మీతండ్రిగారియుద్దేశమెట్లుండెడిదో నీవుకూడ నెఱుంగుదువుగదా!" అనియెను.

హేమాంగి యింక నేమని వ్యతిరేకముగఁ జెప్పఁగలదు? అప్పుడామె యొకసారి తనహృదయములోనికి దృష్టులను మరలించు చూచుకొనియెను. ఆమెహృదయఫలకమునం దొకనాఁడు ముద్రితమైయున్న

రమేంద్రుని సుందరమూర్తి యింకను నట్లే ప్రకాశించుచుండెను. అందొక్కకళయైనను జెక్కుచెదరలేదు. కాని యామె యాతని బెండ్లి చేసికొనఁజాలదు—దరిద్రుఁడును, గులశీలము లెఱుంగఁబడనివాఁడును నగునొకడాక్టరును, భాగ్యవతియుఁ గులవధూమణియు, శీలవతియు నగు హేమాంగి యెట్లు పెండ్లియాడఁగలదు ? సతీశుఁడు గొప్పజమీాందారుఁడు—హేమాంగి చిన్నతనమునుండియు భాగ్యవంతులగు తల్లిదండ్రుల యుపలాలనములచే సుఖముగాఁ బెరిగినబాలిక !—ఆమె యించుకసేపాలోచించి వడఁకిపోవుచున్న కంఠస్వరముతో "సతీశా ! ఆలోచించుకొనుటకు నాకొక్కదినము గడవీయవలయును" అనియెను.

సతీశుఁడతివ్యగ్రభావముతో "హేమా ! అట్లే చేయుము. వ్యతిరేకసమాధానము మాత్రము చెప్పకుము. నేను నిన్నెంతగాఁ బ్రేమించుచుంటినో నీవే యెఱుంగుదువుగదా ! నిన్నుఁ బెండ్లియాడి సుఖింపవలయు ననునభిలాషచేతనే నేనింతకాలమువఱకును బెండ్లి చేసికొనలేదు. నీవు నాకు లభింపకపోయినచో నిఁక నేనెన్నఁటికిని మఱి యెవ్వతెను బెండ్లియాడువాఁడను గాను — మఱియు, నిప్పుడు మీా తల్లిని, మీా సంసారమునుగూడ నెల్లవిధములఁ గనుపెట్టిచూచుచుండుటకు నీకొకపురుషసాహాయ్య మావశ్యకమైయున్నది. నీవు బాగుగఁ జదువుకొన్నదానవు ; చాల బుద్ధిమంతురాలవు. ఇట్టి నీకు విశేషించి బోధింపవలసిన యావశ్యకము లేదు" అనియెను.

* * * *

చాలసేపటివఱకును హేమాంగి మౌనముతోఁ గూర్చుండి యుండెను. పిమ్మట నామె యటనుండి లేచి మెల్లమెల్లఁగా శయ్యాగతురాలై యున్నతల్లిచెంతకుం బోయెను. జబ్బుతోనున్నతల్లి యామె వంక నొకసారిమాత్రము చూచి కన్నులు మూసికొనియెను.

హేమాంగి తల్లిప్రక్కలోఁ గూర్చుండి వెఱ్ఱిదానివలె నిటు నటుఁ జూచుచుండెను. ఏమిమాటాడవలయు ననునుద్దేశముతో వచ్చెనో యామాట యామె నోటినుండి వెలువడదయ్యెను. చాల సేపటి కాయువతి యతిసాహసముతో మనసు పదిలపఱుచుకొని కంపిత స్వరముతో "అమ్మా!" అనియెను.

బిడ్డపిలుపు నాలకించి వ్యాధిగ్రస్తయగుతల్లి యించుక కన్నులను దెఱచి తదేకదృష్టితోఁ గుమార్తెనంకఁ జూడఁదొడంగెను. కాని హేమాంగి యేమియును మాటాడఁజాలక పోయెను. అప్పుడు తల్లి నీరసముగనున్న సన్నని యెలుంగుతో "అమ్మా! చెప్పవలసిన దేమో చెప్పుము!" అనియెను.

హేమాంగి మరల "అమ్మా!—" అని యూరకుండెను.

తల్లి : చెప్పుమమ్మా! ఏమి! అట్లు సంశయించుచుంటివేమి? చెప్పుము! విశేష మేమి?

హేమా : సతీశబాబు—

తల్లి : సతీశబాబా? ఏమి! అయ్యోతల్లీ! నాయొద్ద నీకింత సిగ్గెందులకమ్మా! చెప్పుము!

హేమా : ఆతఁ డిప్పుడు వచ్చి—నాతో—

హేమాంగి యింకఁ జెప్పఁజాలకపోయెను. ఆమె యెంతవిద్యావతియైనను గన్యగదా! తల్లియొద్దనైనను దనపెండ్లివిషయమై తానే ప్రస్తావించుట కామెకు సిగ్గుగాదా!

తనయ యిట్లు నగము చెప్పి సిగ్గుపడుచున్నదని యెఱింగి తల్లి త్రొందరితో "అమ్మా! ఆతఁ డేమనియెను? పెండ్లిమాట లేమైన వచ్చినవి గాఁబోలును! మంచిది. సరే—అందులకు నీవేమి చెప్పితివి? సిగ్గుపడకమ్మా! చెప్పుము!" అనియెను.

హేమా: ఇంకను నే నేమియు సమాధానము చెప్పలేదు. నీతో నాలోచింపకుండ నేమని చెప్పుదును?

తల్లి: అమ్మా! సతీశునివంటియల్లుఁడు లభించుట యెవ్వరికిష్టము గాకుండును? మీతండ్రిగారియుద్దేశముగూడ నదియే యని నీ వెఱుంగుదువుగదా! తల్లీ! నాయభిప్రాయముగూడ నదియే.

హేమా: అట్లయినచో—అమ్మా—

తల్లి: ఏమమ్మా! ఇట్టివివాహమున కింకను నభ్యంతర మేమున్నది? ఇంతకంటెను మన కేమికావలయును?

హేమా: అమ్మా! నేను సతీశు నావిధముగాఁ బ్రేమింపఁజాలకున్నాను. ఆతఁ డనిన నా కెంతయో గౌరవమున్నది. కాని యాతనినే పెండ్లియాడవలయునన్నంత ప్రేమ—

తల్లి: అమ్మా! ఇవి యన్నియును దూరదృష్టియెఱుంగని చిన్నతనపుమాటలు—భార్యయగుటచేతనే భర్తయెడలఁ బ్రేమ గలుగును—ప్రతివధూమణియును భర్తను బ్రేమింపవలసియే యుండును—తల్లీ! నీవీవివాహమున కెట్టియభ్యంతరమును గలిగింపవలదు. ఇంతటి గుణవంతుఁడును, భాగ్యవంతుఁడు, నగుభర్త లభించుట యెంత యదృష్టము! సతీశుఁడే నీభర్తయైనచో నిఁక నీసంసారవిషయమున మన కెట్టివిచారములు నుండవు. అమ్మా! నీవిఁక మాఱుమాట చెప్పకుము!

* * * *

ఆ విధముగనే జరిగెను. మఱునాఁడు సతీశచంద్రుఁడు వచ్చి హేమాంగిని దర్శించెను. మరల నాతఁడు వివాహవిషయమునఁ బ్రస్తావింపకుండఁగనే హేమాంగి తనయంగీకారము నాతనికి సూచించెను. ఆతఁడు నిశ్చయముగా హేమాంగిని దనప్రాణములకంటెనధికముగాఁ బ్రేమించి యుండెను. హేమ యప్పు డిట్లు సమ్మతించినంతనే సతీశుఁ డానందవికసితహృదయకమలుఁడై యామెకడ సెలవు గైకొనిపోయి వివాహప్రయత్నముల నతిసంతోషముతోఁ గావింప నారంభించెను. ఇంతకాలమునకు హేమాంగీసతీశులహృదయములు రెండునుగూడ నెన్నియో యాఘాతప్రతిఘాతములను సహించి మరలసమ్మిళితములై యలరారఁదొడంగెను.

## ఐదవ ప్రకరణము

ఈ ప్రపంచమంతయును నియతిశక్తిచేఁ బ్రతిపాలిత మగుచుండును. ఆ నియతిలీలలను విస్పష్టముగా నెఱింగి మెలంగుట కెంతటి వారికినిగూడ నసాధ్యమే—హేమాంగి యెంతకును సుఖవతి గాఁజాలకుండెను. ఆమె నిరంతరమును దనహృదయముతోఁ బ్రాణపణంబుగా ఘోరరణము గావించుచునే యుండెను. కాని యాహృదయమునం

దంకితమై ప్రకాశించుచున్న రమేంద్రుని ప్రణయసుందరమూర్తి నామె మొలతమాత్రమును దుడిచివైవఁజాలదయ్యెను ; ఒక్కనిమిషము నైనను హృదయఫలకమునుండి యా రమణీయమూర్తిని దొలఁగింప లేకుండెను. ఆమె వివాహదినము సమీపించుచున్నకొలఁది నామెకు సంతాపమును, సౌఖ్యాభావమును వర్ధిల్లి పోవుచుండెను. ఎంత ప్రయత్నించినను నామె తనహృదయమును గుదురుపఱుచుకొనఁ జాలకుండెను.

అనంతశక్తియగునియతి యద్భుతలీలామయియై విరాజిల్లు చుండును. ఎల్లయెడలను దాని ప్రచారము నిరాఘాటమైనది. దానిశక్తి యప్రతిహతప్రభావముగలది. నియతిచే వ్రాయఁబడుచుండు వ్రాఁతలు దేవతలకుఁగూడ నవిజ్ఞాతములైనవి. అట్టిచో వానిని గ్రహించుటకు మానవు లన నెంతటివారు !

రెండుసంవత్సరములనుండి రమేంద్రుని యోగక్షేమము లేమియును దెలియవచ్చుటలేదు. ఆతఁ డెచ్చటనుండెనోకూడఁ దెలియుట లేదు. ఆతని దర్శనము మరల లభించునని యాశించుటకుఁ గూడ నిఁక నవకాశ మేమున్నది ? హేమాంగి వివాహదినము సమీపించుచున్నది. ఇంతలో నొకనాఁ డాకస్మికముగాఁ దలంపని తలంపుగా రమేంద్రుఁడు హేమాంగియింటికి విచ్చేసెను.

దడదడలాడుచున్న గుండెలతో, వెనుక ముందాడుచున్న హృదయముతో, తడఁబడుచున్న యడుగులతో హేమాంగి మెల్ల మెల్లఁగవచ్చి రమేంద్రుని సందర్శించెను. రెండుసంవత్సరములు గడచి పోయినను హేమాంగి రమేంద్రుని మఱచిపోలేదు. కాని యా యువతీ మణి యాతనివంక మునుపటివలె మొగమెత్తి చూడఁజాలక పోయెను; ఏదో యొకవిధముగాఁ దలవంచుకొని నిలువఁబడియెను.

అప్పుడు రమేంద్రుఁడు మృదుగంభీరస్వరముతో "హేమా! నేను డాక్టరుపరీక్షయందు త్తీర్ణుఁడనై యొకయుద్యోగమును సంపాదించుకొని బర్మాకుఁ బోయి యుంటిని. ఈ రెండేండ్లనుండియు సెలవు దొరకకపోవుటచే మరల నొకసారియైనను మీ దర్శనము చేయఁజాలక పోయితిని. క్షమింపవలయును" అనియెను.

హేమాంగి మృదుస్వరముతో "క్షేమసమాచారములు తెలియుటకై యొకయుత్తరమయినను వ్రాయుట కవకాశము లేక పోయినదా?" అనియెను.

రమే : ఉత్తరమా? పరాయివాఁడ నగునేను గొప్పయింటి యాఁడుపడుచునకు జాబు వ్రాయుటకు సాహసింపఁజాలక పోయితిని. నీ కేమికష్టముగా నుండునో యని సంశయించితిని.

హేమాంగి మఱి యేమియును మాటాడఁజాలక పోయెను. మాటాడుట కామెకు సామర్థ్యముకూడ లేదు. ఆమె యూ పాద మస్తకమును గంపించిపోవుచుండెను. ఆ రమణీమణి ప్రశస్తలలాటము నందు మంచిముత్యములవలెఁ జెమటబిందువులు గానవచ్చుచుండెను.

అప్పుడు రమేంద్రుఁడు "హేమా! నేనింకను గొన్నిదినముల వఱకు నీ పట్టణమునందే యుండవలసియున్నది. మునుపటివలెనే మీ మందిరమునందుండి మీచేసహకారాదర సన్మానములం బడయుటకు నాకవకాశముండునా? నేను సామాన్యమగు దరిద్రకుటుంబములోని వాఁడను. మీరో, చాలగొప్పవారు—భాగ్యవంతులు!" అనియెను.

హేమాంగి విశాలనయనములు రెండును బాష్పజలప్రపూర్ణము లయ్యెను. ఆణిముత్యములవలె నొకటిరెండశ్రుబిందువు లామెపట్టు పయ్యెదపై జాఱిపడి యా నిమిషమునందే యింకిపోయెను. రమేంద్రుఁ డాకన్నీటిని గనుఁగొనకుండ లేదు. అతఁడు సంభ్రమముతో "ఏమిది! నీవేమి యేడ్చు—నారాక నీకుఁ జాల కష్టమును గలిగించినది

కాఁబోలును ! ఇట్లగునని యెఱుంగక స్వతంత్రించి వచ్చినందులకు క్షమింపవలయును ” అనియెను.

హేమాంగి బాష్పావరుద్ధకంఠస్వరముతో “ అట్లినన్నటికిని భావింపవలదు. నీవు వచ్చుటవలన నాకేమియును గష్టము గలుగుట లేదు. అనారోగ్యముగా నుండుటచే నేనిట్లుంటిని. నీవేమియు ననుకొన వలదు ” అనియెను.

రమే : నీకు జబ్బుగా నున్నదా ? ఏమి ? నీకారోగ్యమును గల్పించుటకై నేనెల్లవిధములఁ బ్రయత్నింపఁ గలననుసంగతి నీ నెఱుఁగవా ?—నేను మీతల్లిగారి జబ్బును శమింపఁ జేసినందులకై యామె నాకు బహుమానము గావింతునని వాగ్దానము చేసినది. హేమాంగీ ! హేమా ! నేనిప్పుడామెను సందర్శించి నాకు వైద్య పారితోషికముగా నిన్నొసంగవలయునని యామెను బ్రార్థింపఁదలఁచి తిని. అందువలన నీకసంతుష్టి గలుగదుగద ? కోపము రాదుగద ?

హేమాంగి యతివ్యాకుల హృదయముతోఁ దడఁబడిపోవుచుఁ గంపితస్వరముతో “ వలదు ! రమేంద్రా ! వలదు. నీవట్టిపని చేయ వలదు. ఇఁక లాభములేదు. నావివాహ మప్పుడే స్థిరపడిపోయినది, ” అనియెను.

రమేంద్రుఁడు హతాశుఁడై కొయ్యబొమ్మవలె నిలువఁబడి పోయెను. ఒక్కింతసేపటి కాతఁ డొక్క నిట్టూర్పు విడిచి దీనమంద స్వరముతో “ స్థిరపడిపోయినదా ? ” అనియెను.

హేమాంగి క్రమముగాఁ జచ్చిపోవుచున్న స్వరముతో “ఔను. నాయొడలియం దేమియును సుఖముగా లేదు. మీరిఁక మాయింటికి రావలదు—ఇఁక నెన్నఁడును నాకంటి కగపడవలదు, క్షమింప వలయును ” అనియెను,

రమే : అదియేమి ! హేమా ! అతఁడెవ్వరు ? వఁడెవ్వరు ? సతీశచంద్రుఁడేనా ?

హేమా : ఔను. నన్నాతనికిచ్చి పెండ్లిచేయుటకు నిశ్చయమైపోయినది. నావివాహ మింక నెన్నాళ్లో లేదు.

రమే : హేమా ! హేమా ! నేనెంత గ్రుడ్డివాఁడ నైపోయితిని! నీ హృదయ మిట్టిదని తెలిసికొనఁజాలకయేపోయితిని. నేను నిన్నింతగా ప్రేమించి యుంటినో, ఈరెండేండ్లనుండియు నీవియోగసంతాపముచే నుడికిపోవుచు నీదర్శనమున కిప్పు డెట్లువచ్చితినో నీ వెఱుఁగవు కాఁబోలును !—ఎఱుఁగ కేమి ! నిశ్చయముగా నెఱుంగుదువు. నిన్నుఁ బ్రేమించి యాశపడి యుండుటచేతనే నేనింతవఱకును బెండ్లిచేసికొని యుండ లేదు.

హేమాంగి యీసారి వంచినతల నించుక పైకెత్తి విచారసూచకస్వరముతో "ఔను. నీమాట నిజమే. నీహృదయము నేనెఱుంగుదును. నేనుగూడ నిన్నుఁ బ్రేమించియే యున్నాను. కాని మనయిరువురకును వివాహ మగునంతటిభాగ్యమును దేవుఁడు సంకల్పించి యుండ లేదు. రమేంద్రా ! విధివిధానము నెవ్వరు తప్పింపఁగలరు ? నీవింక నెన్నఁడును నాకంటి కగపడవలదు" అనియెను.

రమే : ఏమి ? ఎందుచేత ?

అని పలుకుచు రమేంద్రుఁడు కలఁగిపోవుచున్న హృదయముతో నతిసంభ్రమంబున హేమాంగి రెండుచేతులను దనచేతులయందుంచి పట్టుకొనియెను. అప్పుడు హేమాంగి తనహస్తములను లాగికొనవలయునని తలంచెను గాని యట్లు చేయఁజాలకపోయెను. ఆ సుందరీమణి విశాలనయనములు బాష్పజలంబులలోఁ దేలిపోవుచుండెను. కొంత సేపటి కామె కంపితాంగములతోఁ గంపిత కంఠస్వరముతో

రమేంద్రా! నాచేయి వదలుము! ఈ నిమిషమునుండి నన్ను మఱచి పొమ్ము. ఇక నెప్పుడును నీ దర్శనము నాకుఁ గలుగనీయకుము!" అనియెను.

రమేంద్రుఁడు దీనదృష్టులతో హేమ మొగమువంకఁ జూచుచు దీనకరుణాస్వరముతో "హేమా! ఇక నేను పోవలసినదేనా? హేమా! ఇక మన కిరువురకు నిదియే కడసారిచూపా?—సరే— అట్లయినచో సెలవు!" అని పలుకుచు నాతఁడు నిశ్చేష్టుండై యా సుందరీమణి కోమలకరపల్లవము నెఱుంగకుండఁగనే తనసంతప్త హృదయస్థలంబునఁ జేర్చికొని యొక్కసారి యొక దీర్ఘనిశ్వాసమును విడిచి మాటాడకుండ నటనుండి వెడలిపోయెను.

మొదటినుండియు నీ యిరువురి ప్రవర్తనమును నింకొకవ్యక్తి యస్పష్టముగాఁ గనుంగొనుచునే యుండెను. ఆ సంగతి యీ యిరువురిలో నొక్కరునుగూడ నెఱుంగనేయెఱుంగరు. ఆ సమయమునం దాయుభయులు నంతటి తన్మయచిత్తులై యుండిరి—ఆ చూచుచున్న వా రెవ్వరు? సతీశచంద్రుఁడే—హేమాంగీరమేంద్రుల కింతప్రేమ యున్నదని యాతఁ డెఱుఁగనే యెఱుఁగఁడు—రమేంద్రుఁడు మరల హేమాంగికడకు వచ్చి యీ విధముగా నుండునని యాతఁడు భావించియైన నుండలేదు.

సతీశచంద్రుఁడు హేమాంగీరమేంద్రుల స్థితిగతులం గాంచి యతిక్రోధముచేతను, ఈర్ష్యచేతను స్తంభితుఁడై నిలువఁబడిపోయెను. అతనిజీవచైతన్యమే లోపించిపోయిన ట్లయ్యెను. ఆతఁడు వారివాక్యోప వాక్యముల నన్నిటిని స్పష్టముగా నాలకించుచు, వారి సమస్తచేష్టలను గన్నారఁ గనుంగొనుచుండెను. ఇక గొలఁదిదినములలోఁ దనకు భార్య గావలసియున్న వధూమణి పరపురుషునితోఁ బ్రేమాలాపము లాడుచున్నది! అతనితలనుండి యతిదారుణంబులగు నగ్నిజ్వాలలు

ప్రజ్వరిల్లుచున్న ట్లుండెను — రమేంద్రుడు వెడలిపోయెను. ఇక హేమాంగి యొక్క తెవే యచ్చటఁ గొయ్యబొమ్మవలె నిశ్చేష్టయై నిలిచియున్నది! అయినను సతీచంద్రుఁ డిక నామె చెంతకుఁ బోయి పలుకరింపకుండఁగనే యతిశీఘ్రగమనముతో నాయిల్లు వెలువడి పిచ్చివానివలె వెడలిపోయెను. అతఁడు చాలసేపటివఱకు నేమియుఁ దోఁచక వీథులన్నియుఁ దిరుగాడెను. ఈ సంగతి మాతనికి దెలియుటయే లేదు. తిరిగితిరిగి యాయాసపడుటచే నాతని కించుక యాత్మస్మృతి గలుగుటయు నెట్లో మెల్లమెల్లఁగాఁ దనయిల్లు చేరుకొనియెను. నాఁడు తానుగాంచిన సంగతులన్నియు నాతఁడు తనమనసునందే రహస్యముగా నుంచుకొనియెను. ఆ విషయముంగూర్చి హేమాంగితో నెన్నఁడును బ్రస్తావింపనే లేదు.

రమేంద్రుడును దనకును జరిగిన సంభాషణమంతయును సతీశచంద్రుఁ డాలకించియుండెనను సంగతి పాపము హేమాంగి కేమి తెలియును? పెండ్లియగుటకు ముందుగనే దంపతుల హృదయములందుఁ బరస్పరము నొకొక్కరహస్యము దాగుకొని యుండెను. ఇట్టివివాహము ముందుముం దేవిధముగాఁ బరిణమించునో యనుప్రశ్నకుఁ బ్రత్యుత్తరము కేవలము నియతిశక్తియొక్క తమోమయగర్భమునం దతినిగూఢముగ విలీనమై యున్నది!

* * * *

యథారీతిగా సతీశచంద్రునకును హేమాంగికిని శుభవివాహము జరిగిపోయెను. సతీశచంద్రుఁడు తనసతీమణిని, అత్తగారినిగూడ వెంటఁ బెట్టుకొని జమీందారీగ్రామమగు కాళీపురమునకుఁ దీసికొనిపోయెను. హేమాంగితల్లి యిఁక నెంతయో కాలము శయ్యాశాయినియై యుండ వలసినపని లేకపోయెను. కొలఁదికాలములోనే యామె యనంతం బగు పరలోకంబునఁ దనపతితో మరలఁ గలిసికొనియెను.

తరువాత మూఁడుసంవత్సరముల కాలము గడచిపోయెను. అప్పటికి హేమాంగ కొకకుమారుఁడును, కుమారికయుఁ గలిగిరి. కాని దినదినమునకు నామెయారోగ్యము చెడిపోవుచుండెను. అందుచే సతీశ చంద్రుఁ డతివ్యాకులహృదయముతో నామెయారోగ్యముంగూర్చి భావించుచుఁ దగినప్రయత్నములను గావింపవలయు నని తొందరపడు చుండెను. ఈస్థానమును మార్చినచో వాయుపరివర్తనమువలన నామె కించుక నెమ్మది గలుగవచ్చు నని తలంచి మధుపురమున కామెను దీసికొనిపోవలయు నని సతీశుఁడు నిశ్చయించెను. ఆతనియిష్టప్రకార మచ్చటికిఁ బోవుటను హేమాంగియును సమ్మతించెను. సతీశుఁ డతి త్వరితముగఁ బ్రయాణసన్నాహమును గావించుచుండెను.

## ఆఱవ ప్రకరణము

ఆశ్వయుజమాసము వచ్చెను.

శరత్కాలమునందలి మధురసమీరము లించించుక చలిని గల్పించుచుఁ బ్రచారము సేయ నారంభించెను. ఆ చల్లనిదినములలో నొకనాఁడు కలకత్తానుండి బయలుదేఱినధూమశకటము మధుపురపుస్టేషనునొద్దకు వచ్చి యాఁగెను. ఆబండినుండి యచ్చట దిగవలసినవారందఱును దిగినతోడనే బండి మరల మహావేగముతో బయలుదేఱి నిముషములోఁ గన్నులకగపడకుండఁబోయెను. అప్పుడు మనసతీశుఁడును, బుత్రపుత్రికాసహితయగునాతనిసతీమణియు నాస్టేషనులో దిగిరి.

హేమాంగి యిప్పుడును మునుపటివలెనే కుసుమసుకుమారమును, మాధురీమయంబును నగుస్థిరయౌవనముచే నతిమనోహారిణియై యుండెను. కాని యామె యిప్పుడు పతిసంసారమునకంతకు నేకాధికారిణియు, గృహిణియు నై గృహకృత్యభారమును వహించి యుండుటచే నామెతారుణ్యమునందలితారళ్యమును, సౌందర్యమునందలి లావణ్యమును గొంచెము మందగించి యుండెను.

సతీశచంద్రుఁ డామధుపురమునందుఁ దాను బసచేయవలసిన యిల్లెక్కడ నుండెనో యేమియు నెఱుంగఁడు. ఆతని కానగరము క్రొత్త. ఆ పురమునందు రాఖాలబాబనునొకగృహస్థుఁ డాతనికి బరిచితుఁ డుండెను. సతీశచంద్రుఁ డిదివఱకే మధుపురమునందు దనకొక యింటి నాఱుమాసములవఱకు నద్దెకుమాటాడి యుంచవలయు ననియుఁ

నేను వచ్చునప్పటికు తెలియఁజేయుదు ననియు రాఖాలబాబునకు జాబు వ్రాసి యుండెను. కాని ఆ యిల్లెచ్చట నున్నదో, అది స్టేషనున కెంత దూరమందున్నదో సతీశుఁ డెఱుంగఁడు. అప్పటికి సతీశుఁడు తన్నుఁ దీసికొనిపోవుటకై రాఖాలబాబు స్టేషనునకు వచ్చియుండునని యనుకొనియెను. అతఁడాచుట్టుప్రక్కల నన్వేషించెనుగాని రాఖాలబాబు వచ్చినట్లు లేదు. సతీశుఁ డెన్నఁడు నెఱుంగని యొకపురుషుఁ డచ్చట నొక పల్లకిని, ఎద్దులబండిని సిద్ధముగా నుంచుకొని సతీశునికొఱకు నిరీక్షించి యుండెను.

రాఖాలబాబు స్టేషనులో నగపడకపోవుటచే సతీశచంద్రుఁడు చాల విసుఁగుకొనియెను. ఏమిచేయుటకు నాతనికిఁ దోఁచకుండెను. అప్పుడాతఁడు హేమాంగిం గాంచి "ఇక్కడివాండ్ర కెవ్వరికిని గౌరవ జ్ఞానము లేదని తోఁచుచున్నది. ఈ క్రొత్తనగరములో మనకాతని యిల్లెట్లు తెలియఁగలదో! జాబువ్రాసినను రాఖాలబాబు రానేలేదు! ఇప్పుడు మనమేమి చేయుదము?" అనియెను.

హేమాంగి తనభర్తమాటకుఁ దగినప్రత్యుత్తర మనుకూలముగా జెప్పఁజాలక పోయెను. ఆమె తలయూఁచుచు నాథునియుద్దేశమునకు సమాధానముగా "ఆతఁడు మఱచియుండఁడు. ఆతని కేదియో యావశ్యకమైన పనియుండుటచే స్టేషనునకు రాఁజాలక పోయె నేమో! ఆతఁడు నిశ్చయముగా మనలను దీసికొనిపోవుట కెవ్వరినైనఁ బంపియే యుండును" అనియెను.

ఇట్లు వారు మాటాడుకొనుచుండఁగనే యపరిచితుఁ డగునొక పురుషుఁ డచ్చటికి వచ్చి సతీశచంద్రుని మొగమునంకఁ దదేకదృష్టిం గాంచుచు నించుక సంశయముతో వినయసూచకస్వరమున "అయ్యా!

మీపేరు సతీశచంద్రుఁడా? మీరు కాళీపురపు జమీందారులేరా?" అని ప్రశ్నించెను.

సతీశచంద్రుఁ డించుక యాశ్చర్యపడి తలయూఁచుచు "ఔను. నాపేరు సతీశచంద్రుఁడే!" అనియెను.

తోడనే యా యపరిచితపురుషుఁడు "అయ్యా! రాఖాలబాబు ముఖ్యమైన యొకస్వకార్యమును దీర్చికొనుటకై నేఁటియుదయమున దేవగడమునకుఁ బోయియున్నాఁడు. అతఁడు పోవునప్పుడు నన్నుఁబిలిచి మీకొఱకొక పల్లకిని, ఎద్దులబండిని స్టేషనునకుఁ దీసికొనిపోవలయునని యాజ్ఞాపించి యున్నాఁడు. నేనట్లే తీసికొని వచ్చితిని. మీరు బయలు దేఱి నాతో వచ్చెదరా?" అనియెను.

సతీ: మంచిది. అట్లే వచ్చెదము. పల్లకియును బండియు నిచ్చటి కెంతటిదూరములో నున్నవి?

పురు: ఎంతో దూరములేదు. ఇచ్చటనే. పానియాఖోలా యందు సిద్ధముగా నున్నవి.

సతీశునకు పానియాఖోలా యనిన నేమియో యది యెచ్చట నున్నదియో బోధపడలేదు. కాని యాతఁ డప్పుడే సేవకులకుఁ దన సామానంతయు బండిపై వేయింపవలయునని యాజ్ఞాపించి భార్యా పుత్రులను బల్లకిపై నెక్కించి ద్వారపాలకు నా పల్లకితోఁగూడఁ బోవలయునని నియమించి తాను స్వయముగా రాఖాలబాబు పంపిన మనుష్యునితోఁగూడఁ గాలినడకను పానియాఖోలావైపునకు బయలు దేఱి పోయెను.

ఆ నూతననగరమునందు నూతనగృహంబునఁ బ్రవేశించి తన సామానంతయు నుచితస్థలములందుఁ జేర్చుకొని యంతయు నను కూలముగ సవరించుకొనుటకు సతీశున కాదినమంతయుఁ బట్టెను.

సాయంకాలమునం దాతఁడు పట్టణము నొకసారి చూచివచ్చుటకై బసనుండి బయలుదేఱి యవ్వలకుఁ బోయెను.

ఆతఁడు ప్రవేశించినమందిర మతిరమణీయముగా నుండెను. కవ్వులు కమనీయాలంకారములతో నప్పించుట కనువుగా నుండెను. ఆ మందిరము నెదుట అజయనదము నిర్మలజలంబులతోఁ బ్రవహించుచుండెను. దానియుభయకూలంబులను సరళవృక్షంబులు వరుసలుతీరి కోమలనవపల్లవంబులతో శీతలచ్ఛాయామయంబులై యుండెను. ఆ భూరుహంబులయందు వివిధంబులగువిహంగంబులు కలకలధ్వనులు సేయుచు వీనులవిందు గావించుచుండెను. దానికిఁ జుట్టుపట్ల నొకటిరెండు గృహంబులకంటె నధికగృహంబులు లేవు. ఆయుద్యానమందిరము లైనను జనసంకులములై యుండక కేవలము నారామపాలకులచే మాత్రమే సురక్షితములై యుండెను. ఆపట్టణమునఁ బ్రవేశించు నితర దేశీయు లందఱును దఱచుగా స్టేషనునకు సమీపమునందో రైలుమార్గ మున కవ్వలిప్రదేశమునందో తగినవిడుదులను జూచుకొని నివసించు చుందు రని సతీశుఁ డాతనివలనఁ దెలిసికొనియెను. ఇప్పు డాతఁడు ప్రవేశించిన సుందరభవనము కేవలము నిర్జనస్థానమునందే యుండుటచే వాయుపరివర్తనార్థమై యేతెంచిన తనకు మిగుల ననుకూలముగానే యుండె నని సతీశుఁడు చాలసంతోషించెను.

ఆతఁ డానగరమునం దిటునటుఁ గొంతసేపటివఱకును దిరిగితిరిగి యొకరిద్దఱుపెద్దమనుష్యులవలన రాఖాలబాబుగృహ మెచ్చట నున్న దియో తెలిసికొని క్రమముగా నచ్చటికిఁ బోయెను. రాఖాలబా బప్పుడే గ్రామాంతరమునుండి తిరిగి యింటికి వచ్చియుండెను. ఆతఁడు సతీశ చంద్రునిం గాంచి పరమానందముతో నెంతయో గౌరవించి ఒకకుర్చీపైఁ గూర్చుండఁ జేసి “ సతీశబాబూ ! ముఖ్యమైనయొకపని గలుగుటచే

నేనూరికిఁ బోవలసి వచ్చినది. ఆపని ముగించుకొని యిప్పుడే మరలి వచ్చితిని. అందుచేతనే స్టేషనునకు వచ్చి మిమ్ముల్లను గలిసికొనఁ జాలకపోయితిని. అందుకొఱకు నన్ను క్షమింపవలయును. మీదృష్టి కీనగర మెట్లున్నది ? బాగుగ నున్నదా ?" అనియెను.

సతీ : పట్టణమునకేమి ? బాగుగనేయున్నది. కాని యీపురము నందు జనసంఖ్య చాల తక్కువగానున్నది.

రాఖా : ఈప్రదేశ మెంతయోయారోగ్యకరమైనది. అందు చేతనే వాయుపరివర్తనమునకై యిచ్చటి కనేకులు వచ్చి కొంతకాలము నివసించి పోవుచుందురు. ఇంకను జాలమంది రాలేదు. క్రమక్రమముగా నిచ్చటికెందఱోవచ్చి చేరుకొనఁగలరు. కొలఁదిదినములలో మీరే చూడఁగలరు.

సతీ : ఇచ్చట వైద్యము చేయించుకొనవలసివచ్చినచో మంచి డాక్టరు లెవరైనఁ దొరకుదురా ?

రాఖా : ఆ. ఇచ్చట డాక్టరుల కేమియును లోపము లేదు— రైల్వేకంపెనీవారిడాక్టరు—

సతీశుఁడు రాఖాలబాబుమాట కడ్డము వచ్చి "రైల్వేకంపెనీ వారిడాక్టరు కావలసినప్పుడెల్ల లభించుట కవకాశముండదుగాదా ?" అనియెను.

రాఖా : అవును. ఆతఁడప్పుడు లైనుమీఁద వేర్వేఱుప్రదేశము లకుఁ బోవుచుండును. ఆమాట నిజమే—కాని యిచ్చట నింకొకమంచి డాక్టరున్నాఁడు. ఆతఁ డుద్యోగమును వదలివైచి స్వయముగనే వైద్యవ్యాపారమును జేయుచున్నాఁడు. ఆతని కెంతయో వయసు లేదు, చాలమంచివాఁడు: వైద్యమునం దాతని కీనగరమునఁ జాలప్రసిద్ధి యున్నది.

సతీశుఁ డించుక సేపు యోచించి "వయసుతక్కువ వైద్యుఁడా? ఆతఁ డింకను వైద్యము నేర్చుకొనుచున్నాఁడు కాఁబోలును. వైద్యుఁ డెంతవృద్ధుఁడైన నంతమంచిది. ఆతని కెంతయో యనుభవ ముండును. నా భార్యకు శరీరము నించుక యనారోగ్యముగా నున్నదని మీ కిదివఱకే వ్రాసియున్నాను గదా! ఆమె యిప్పుడు చిన్నచిన్న పిల్లలతల్లికూడ నైయున్నది. ఇట్టియవస్థలో మంచిడాక్టరు లభింపని ప్రదేశమునందు నివసించియుండుట యెంతమాత్రమును శ్రేయము గాదు. ఇచ్చట నెల్లవిధముల మంచిడాక్టరు దొరకునని మీరు వ్రాయుటచే నే నీగ్రామమునకు వచ్చితిని" అనియెను.

రాఖా : ఔను. ఆమాట నిజమే. నేనిప్పుడు చెప్పిన యాచిన్నవాఁడు చాల గొప్పడాక్టరని యీ యిక్కడనున్న వారందఱకును విశ్వాసమున్నది. ఇప్పటికి రెండుసంవత్సరమునుండి యాతఁ డిక్కడనే యున్నాఁడు. ఆతని కీనగరమునందు మంచిపేరున్నది—గొప్పవారందఱునుకూడ నాతనినే పిలుచుచుందురు. ఆతనిపేరు రమేంద్రబాబు—

రమేంద్రబాబు! ఆ పేరువిన్నంతనే సతీశచంద్రుఁడు ఉలికిపడి విస్మయ విస్ఫారితలోచనములతో రాఖాలబాబు మొగమువంకఁ దదేకదృష్టిం గాంచుచు నాత్రముతో "రాఖాలబాబూ! ఏమంటిరి? ఆతని పేరేమి?" అనియెను.

రాఖా : రమేంద్రబాబు.

సతీ : ఏమి! ఎవరు?

సతీశచంద్రుని విలక్షణ కంఠస్వరముంబట్టి రాఖాలబాబు విస్మితుఁడై యీతని కీనతుమఁ జెప్పుడు గలిగినదా యేమి యని యనుకొనియెను. ఇట్లు భావించి యాతఁ డించుక యుచ్చైస్స్వరముతో

"ఆతని పేరు రమేంద్రనాథఘోషు. మీ రాతని నెఱుగుదురా?" అనియెను.

సతీశుఁడేమో చెప్పవలయు ననుకొనియెను. గాని తనలోఁదానే యించుక నెమ్మదిపడి మృదుల స్వరముతో "ఎప్పుడో యొకసారి యాపేరు విన్నట్లే తోఁచుచున్నది. ఆతని యిల్లిచ్చటి కెంతదూరమునం దున్నది?" అనియెను.

రాఖా : ఇదిగో! ఇచ్చటనే—ఎంతో దూరము లేదు. అవశ్యక మైనచో నెప్పుడు గావలసిన నప్పుడే యాతనిఁ బిలిపించు కొనవచ్చును.

అనంతరమా యిరువురును మధుపురము నందలి యనేక విషయ ములం గూర్చి ప్రస్తావించుకొనిరి. కొంత సేపైన తరువాత సతీశుఁడు రాఖాలబాబునొద్ద సెలవు గైకొని తనబసకు వెడలిపోయెను.

## ఏడవ ప్రకరణము

ఎన్నఁడు నెఱుంగని తావున నివసించియుండువారి కన్నియు నననుకూలములుగనే యుండును. సతీశచంద్రుని దాసదాసీజనులు గూడ నూతనమగు మధుపురమునం దెల్లవిధముల వ్యస్తహృదయములతోఁ బ్రవర్తించుచుండిరి. సతీశచంద్రుఁడు తన కుమారున కొకదాసిని,

కుమారికకు నొక దాసిని నియమించి యుండెను. కుమారునకుఁ గాలు వచ్చి యటు నిటుఁ దిరిగి యాడుకొను చుండుటచే నాతనిదాసి యప్పు డప్పు డాతని స్వతంత్రముగా వదలివైచి యలక్ష్యముగా నుండు చుండెను. కుమారిక దాసి కంతకను నట్టిభాగ్యము లభింపలేదు. ఆ బిడ్డ యింకను బాగుగ నడవలేదు. ఇప్పు డిప్పుడే తప్పటడుగులు వైచు చుండెను. అందుచే దాసి యా బిడ్డ నెప్పుడు నెత్తుకొనియే తిరుగు చుండును. కుమారుని దాసి పెద్ద దాసిగను, కుమారిక దాసి చిన్న దాసిగను బరిగణింపఁ బడుచుండిరి.

ఒకనాఁడు పెద్దదాసియొద్ద అబ్బాయి లేకుండుటం గాంచి చిన్న దాసి "అక్కా! చిన్న బా బెచ్చట నున్నాఁడు" అని ప్రశ్నించెను.

చిన్నబాబు తనదాసిని వదలి గునగునన డచుచు నామందిరము నం దెచ్చటికో యాడుకొనుటకుఁ బోయియుండెను. చాలసేపైనది. పెద్దదాసి చిన్నబాబుమాటయే మఱచి పరాకుగా నుండెను. చిన్న దాసి ప్రశ్నించినతోడనే యామె యదరిపడి చిన్నబాబుకొఱ కిల్లంత యును వెదక నారంభించెను. ఆమె సంభ్రమముతో వెదకుచు నింటి వెలుపలికిఁ బోయి కెవ్వున నొక కేకవైచెను. ఆ యార్తనాదము నాలకించి యింటిలోని వారందఱు నొక్కపరుగున వెలుపలికి వచ్చిరి. చిన్నబాబు వీధియరఁగుపై గంతులువైచుచు జాఱి క్రిందనున్నయొక రాతి మీఁదఁ బడిపోయెను. తోడనే యాతనికి స్మృతి తప్పిపోయెను. కపాలమునుండి పొంగిపొంగి రక్తము కాఱుచుండెను.

హేమాంగి చటాలున లోపలినుండి వచ్చి యా బిడ్డను లేవఁ దీసి యెత్తుకొని దుఃఖావేగముచే నస్పష్టంబగు కంఠస్వరముతో "బాబు! బాబుగారు——ఎచ్చట నున్నారు? త్వరగా నెవ్వరైనఁ బోయి——ఆయనను——" అని యిఁక మాటాడఁజాలక పోయెను.

అప్పుడొక సేవకుఁడు త్వరితముతో నామె చెంతకు వచ్చి "అమ్మా! బాబుగారు రెక్కడకో షికారు దయచేసినారు—ఏవీథి నెచ్చటికిఁ బోయినారో నేను చెప్పఁజాలను" అనియెను.

హేమాంగి యేమియుం దోఁచక "అట్లయినచో శీఘ్రముగఁబోయి యెవ్వరైన నొక డాక్టరును దీసికొని రమ్ము!" అని యాజ్ఞాపించెను.

తోడనే యా సేవకుఁడు వైద్యునికొఱకుఁ బరుగెత్తుకొని పోయెను. హేమాంగి యున్మత్తురాలివలెఁ దడఁబడుచుఁ దలదిమ్మెత్తి యొడలెఱుంగక పడియున్న యాబిడ్డ నెత్తికొని లోపలికిఁ దీసికొని పోయెను.

ఒక్కనిమిషములో సేవకుఁడు డాక్టరును దీసికొని వచ్చెను. వైద్యుఁడుకూడఁ బరుగెత్తుకొనియే వచ్చుటచే నాయాసమువలన వగర్చుచుండెను. ఆతఁడు వచ్చులోపలనే యాబిడ్డ కించుక తెలివి గలుగుచుండెను. అప్పుడు డాక్టరు మిగులనైపుణ్యముతో బిడ్డతలను మందు నీటితోఁ గడిగివైచి యేదియో యొకమందువైచి యతిత్వరిత ముగా గుడ్డతో నొకకట్టుకట్టెను. పిమ్మట నాతఁడు హేమాంగి నుద్దేశించి "ఈ బిడ్డను మంచముపైఁ బరుండఁజేయవలయును. ఎంత మాత్రమును లేవనీయవలదు. నేనింటికిఁ బోయి యిప్పుడే యొక యౌషధమును బంపించెదను. మఱియేమియును భయములేదు. అంత గొప్పదెబ్బగాదు."

ఆ డాక్టరెవ్వరు? రమేంద్రనాథుఁడే. సేవకునివలన నీ సమా చారము విన్నంతనే యాతఁడు పరుగెత్తుకొని యచ్చటికి వచ్చియుండెను. ఇంతసేపటివఱకును హేమాంగిరమేంద్రులు లొండొరులను బాగుగ గుర్తించి చూచుకొనుటకవకాశము గలుగలేదు. విశేషించి హేమాంగి యానాడుమ రమేంద్రుని గేవలము మఱచిపోయియే యుండెను. ఇప్పు డాకస్మికముగా రమేంద్రుఁ డామెకన్నులఁ బడియెను. రమేంద్రుఁడు పూర్వ మొకప్పుడు హేమాంగినిని బ్రాణముకంటె నధికముగఁ

ప్రేమించియుండెను. ఇప్పుడాతని భావభంగులయందట్టిసూచనయైన నించుకంతయును గోచరించుటలేదు.

రమేంద్రబాబు తనపని ముగిసినతోడనే లేచి నిలువఁబడి యతి మృదుమధురస్వరముతో "ఇన్నాళ్లకు మరల మిమ్ముఁ జూడఁగలుగు భాగ్యము లభించినది" అనియెను.

హేమాంగి తలవంచుకొనియే మృదుస్వరముతో "నేనుమిమ్ము జూచిన తోడనే యానవాలు పట్టఁగలిగితిని" అనియెను.

రమే : మీరీ మధుపురమునకు వచ్చి కొంతకాల ముండెదరను సంగతి నేనిదివఱకే రాఖాలబాబువలన విని సంతోషించితిని.

హేమా : ఈ బిడ్డకేమియును భయము లేదుగద! అపాయకర మైనదెబ్బ గాదుగద!

రమే : ఏమియును భయములేదు. దెబ్బ సామాన్యమైనదియే—అరఁగుపై నుండి క్రింది రాతిపైఁ బడెనని విన్నప్పుడెంత గట్టిదెబ్బ తగిలి యుండునో యని భయపడి పరుగెత్తుకొని వచ్చితిని. తఱచుగా నిట్లే పిల్లలాటలాడుకొనుచుఁ బడిపోవుచుందురు. ఈ పిల్లవాఁడు మీ మొదటి సంతానమే కాఁబోలును.

హేమా : అవును. ఈతని తరువాత నొకయాఁడుబిడ్డ గలిగినది.

రమే : మంచిది. నేనింటికిఁ బోయి యిప్పుడే యొక యౌషధ మును బంపించెదను. ఆ మందుసీసాలో నొకగీటువఱకును మందొక గ్లాసులోనైచి యీ బిడ్డకీయవలయును. నేను సెలవు దీసికొనియెదను. సతీశచంద్రునకు నా నమస్కారములను నివేదింపవలయును.

అని చెప్పి రమేంద్రనాథుఁడింటికి బయలుదేఱిపోయెను. అతఁ డట్లావీధిని బడి కొంతదూరము వఱకును బోయినతరువాత నొకసారి వెనుకకుఁ దిరిగి చూచెను. హేమాంగి కిటికీయొద్ద నింకను నట్లేనిలువఁ

బడి యుండెను. రమేంద్రుఁడింక నామెవంక దృష్టిపాతము సేయకుండఁ గనే మెల్లమెల్లఁగా ముందటికి నడచి పోవుచుండెను. హేమాంగి యింకను గిటికీచెంత నిలిచియుండుటం గాంచినంతనే యాతఁ డతి త్వరితముగ నడవనారంభించెను. పాపము హేమాంగి రమేంద్రుని జూచుటకై యట నిలువఁబడి యుండలేదు. స్వామియగు సతీశునిరాక కెదురు చూచుచు నట నిలిచి యుండెను. హేమాంగీ రమేంద్రుల హృదయములం దిప్పుడు పూర్వ విషయములును, బూర్వభావములును గూడ సంపూర్ణముగా మాటిపోయియే యుండెను. అకస్మికముగఁ గలసికొనుట తటస్థించినను హేమాంగి రమేంద్రునిగాని, రమేంద్రుఁడు హేమాంగినిగాని పూర్వభావముతోఁ జూచియుండలేదు.

కాని యొక వ్యక్తిమాత్ర మీ విశేషము నించుకంతయైనను గ్రహింపఁజాలకయే యుండెను—ఆ సమయమునకు సరిగా సతీశచంద్రుఁడు తనబసకు మరలి వచ్చుచుండెను. ఆతఁడు మారమునుండియే తనయింటి కిటికీయొద్ద నిలువఁబడి చూచుచున్న హేమాంగిని, పథి నెంట నతివేగముగా వచ్చుచున్న రమేంద్రుని గన్నులారఁ గనుఁగొనియెను. సతీశుఁ డిదివఱకే రాఖాలబాబువలన రమేంద్రుని నామమును వినియుండెను. అప్పటినుండియు నాతఁడు రమేంద్రునిగూర్చియే యాలోచించు కొనుచుండెను.. నేఁడుగూడ నాతఁడు రమేంద్రునిమాట తలఁచుకొనుచునే యింటికిఁ దిరిగివచ్చుచుండెను. ఆ రమేంద్రుఁడే యిప్పుడు తనభార్య మధుపురమునఁ బ్రవేశించియుఁ బ్రవేశింప కుండఁగనే తానింటలేకున్న సమయమును గనుపెట్టి యింటికి వచ్చి రహస్యముగాఁ దనభార్యను సందర్శించి యేమేమియో మాటలాడి చల్లఁగా నింటికిఁ బోవుచుండెను. ఆతఁడట్లు పోవుచుండఁగాఁ దనభార్య కిటికీచెంత నిలువఁబడి యాతని వంకనే కన్నుంగొనుచున్నది ! — ఇంకేమున్నది ! సతీశచంద్రుని

.యూ పా^ము స్తకము నగ్నిజ్వాలలచే దహింపఁబడిపోవుచుండెను. అతని హృద: గాంతరాళమున దా వానలజ్వాల లతి దారుణముగ మండిపోవు చుం...

రమేంద్రనాథుఁడు సతీశచంద్రుని జూడనేలేదు. ఆతఁ డొక యావశ్యమైన పనిమీద నా రాజమార్గమును వదలి చేలగట్ల త్రోవను బట్టి యతివేగముగఁ బోవుచు నిమిషములో నదృశ్యుఁడై పోయెను. అందుచే సతీశునకు మఱింత యనుమానము గలిగెను. ఆతఁ డప్పుడు తనలో రమేంద్రుఁ డిప్పుడు నన్నుఁ జూచియే భయపడి తప్పించుకొని పాఱిపోవు చున్నాఁడు. నా కన్నుల యెదుటఁ బడుట కందుచేతనే యీతనికి సాహసము లేకపోయినది. అవును! నిజమే—తప్పు పని చేసినవానికి ధైర్య మెట్లుండును? ఈతఁ డనాయాసముగా, నతిరహస్య ముగా నా భార్యను జూచి పోవుచున్నాఁడు! మే మిచ్చటికి వచ్చి రెండుమూఁడు దినముల కంటె నధికముగా లేదు. ఇంతమాత్ర మాలస్యము గూడ నీతఁడు సహింపఁజాలక పోయినాఁడు! ఎంత సాహసము!" అని యనేక విధముల భావించుచు నీర్ష్యాపరవశుఁడై పోయెను.

ఆ సమయమునం దెవ్వరైన వచ్చి సతీశచంద్రునిం గాంచి "అయ్యా! రమేంద్రుఁడు పాపము మిమ్ముఁ జూడనేలేదు; ఏదియో తొందరపని యుండుటచే దగ్గఱ త్రోవను బట్టి సత్వరముగా వెడలి పోవు చున్నాఁడు; ఇంతకంటె నీతనియం దెట్టి లోపమును లేదు.—" అని యెన్నివిధముల సప్రమాణముగా బోధించినను సంశయాత్ముఁ డగు నాతఁ డెంతమాత్రమును విశ్వసింపఁ జాలఁడు.

ఆతఁ డెట్లో వచ్చి యింటఁ బ్రవేశించెను. గాని యింకను నాతని మనఃపరివర్తనము గాలేదు. సతీమణియగు హేమాంగి వ్యాకుల హృదయముతోఁ దడఁబడి పోవుచుండెను. వాస్తవముగా నామె

తనబిడ్డ యవస్థం గాంచి యేమియుం దోఁచక యట్లు కంగారు పడు చుండెను. కాని సతీశునకు మాత్ర మట్లు తోఁచుట లేదు. రమేంద్రుని దర్శించుట వలననే యామె యట్లు వికలహృదయయై యుండె నని యాతఁడు భావించుకొనియెను.

హేమాంగి తన నాథునిం గాంచినంతనే దీనస్వరముతో "అమ్మయ్యా! వచ్చితిరా! నే నిప్పు డెంతయో గందరగోళములోఁ బడి యుంటిని. ఎంతటిదారుణ సంఘటనము తటస్థించిన దనుకొన్నారు! ఇంకను గుండెదడ వదలుటయే లేదు!" అనియెను.

సతీశుఁ డించుక కోపకసూచక మగు స్వరముతో "ఔను—చాల దారుణకృత్యమే—ఇట్లగునని నే నిదివఱకే యనుకొను చున్నాను—ఏమైన నేమి? చెప్పఁకొనవలసినది గాదు!" అనియెను.

తన యజాగరూకత వలన బిడ్డ కంతటియపాయస్థితి సంభవించె నని భావించి భర్త యిట్లు కోపపడుచుండె నని హేమాంగి యనుకొని యెను. కాని విశుద్ధహృదయ యగు హేమాంగి నాథుని దురుద్దేశము నెట్లు గ్రహింపఁ గలదు; అప్పుడామె మృదుస్వరముతో "దైవాను గ్రహము వలన బిడ్డ కంతటి గట్టిదెబ్బ తగులలేదు. రమేంద్రబాబు వచ్చి చూచి యేమియును భయము లేదని చెప్పినాఁడు. ఆతఁ డీ నగరమున డాక్టరు పని చేయున్నాఁడు. ఇప్పుడే వచ్చి బిడ్డకుఁ గట్టు కట్టి మందు పంపించెద నని చెప్పి పోయినాఁడు. త్రోవలో మీ కాతఁ డెదురుపడియే యుండును" అని చెప్పెను.

మండిపోవుచున్న క్రోధానలమును లోలోపలనే యడఁచు కొన వలసి వచ్చుటచే సతీశుని కంఠస్వరము నిరుద్ధమైపోయెను. కొంతసేపటి కాతఁడు మనసు కుదురు పఱుచుకొని "అవును—నే నాతనిం జూచితిని—ఆతఁడు మనయింటికెందుకొఱకు వచ్చినాఁడు?" అనియెను.

హేమాంగి యుపరిపక్షి శీతస్వరముతో "నేనకునింబంపి నేనే మాతని నిటకు రప్పించితిని. నేను—" అనియెను.

అనుచుండఁగనే సతీశుఁడు జనలజ్వాలలవలె మండిపోవుచు "ఆలాగా ! నీవే కబురు పంపి పిలిపించితివా ? ఆతని నిటకు రప్పించు టకు నీకింతసాహస మెట్లు గలిగినది ? నేనింటినుండి వెడలియు వెడల కుండఁగనే సమయముచూచి నీవాతని బిలిపించుకొంటివా ? మునుపటి వలెనే యొకరినొకరు నేత్రానందకరముగా దర్శించుకొంటిరి గాఁబోలు నేమి ?" అనియెను.

హేమాంగి నిర్వాణపడిపోయెను. ఆమె విస్మయసూచకమగు స్వరముతో "ఇదియేమి ! ఇట్లు మాటలాడుచున్నారేమి ? మీయుద్దేశ మేమియో గ్రహించుకొంతయును బోధపడుటలేదు !" అనియెను.

సతీశచంద్రుఁడు ధిక్కారసూచకస్వరముతో "నీకింకను బోధ పడుటయే లేదా ? ఎంతజాణవు ! నీవిదివఱకుఁ బ్రేమించియున్న నీ పూర్వమిత్రుఁ డగుర మేంద్రునిమాట చెప్పుచున్నాను ! నేనించుకంత నీ కంటికి దూరమైనంతనే నీవాతని బిలిపించితివా ? చాలమంచిపనియే చేసితివి ! ఆతఁ డీనగరమున నివసించి యున్నాఁడనుసంగతి నీకింతలోనే యెవ్వరు చెప్పినారు ? అంతఃపురనివాసిని వగునాఁడుదానవుగదా ! ఇంతత్వరలోనే నీకాతనిసంగతి యెట్లు తెలిసినది ?—నీకిదివఱకే తెలి యును గాఁబోలును ! అందుచేతనే నీవీనగరమునకు వచ్చుటకు సమ్మ తించితివి ! నీకు దురుద్దేశమే లేకయున్నచో నాతఁ డిట నుండె నని యెఱింగియుండియు నొక్కనాఁడైనను నాతోఁ జెప్పకుండుటకుఁ గారణమేమి ?" అనియెను.

హేమాంగి భయవిస్మయములతో నయనకమలములను వికసింపఁజేసి నాథునివదనమువంకకు దదేకదృష్టిం గాంచుచుఁ గేవలము రుద్ధప్రాయంబైన కంఠస్వరముతో "మీకు మతిపోవుచున్నదా యేమి?" అనియెను.

## ఎనిమిదవ ప్రకరణము

కొంతసేపటివఱకు భార్యాభర్తలిరువురు నొక్కసారిగా మౌనమును వహించి యుండిరి. ఎవ్వరినోటినుండియు నొక్కమాటయైన వెలువడ లేదు. ఒక్కరికన్నులును ఱెప్పలు వాల్చుట లేదు. ఎవ్వరిదేహమునందును జలనమనుమాట లేదు.

హేమాంగి నిర్నిమేషనయనములతో మెల్లమెల్లఁగా మాటిమాటికిని నాథునిపాదములు మొదలు మస్తకమువఱకును దృష్టిసంచాలనము గావించుచుండెను. సతీశచంద్రుఁడుమాత్రము స్థిరదృష్టితో సతీమణిమొగమువంక నిరీక్షించుచుండెను. చాలసేపటివఱకు నెవ్వరును మాటాడలేదు. తుట్టతుదకు సతీశుఁడే మాటాడుట కారంభించెను. ఆతనివిశాలనయనములనుండి యగ్నిజ్వాలలును, వదనమండలమునుండి దారుణహాలాహలజ్వాలలును వెలువడుచున్నట్లుండెను. అప్పుడాతఁడు

క్రోధస్వరముతో “ఇదిగో! చూడుము! నేను స్పష్టముగాఁ జెప్పు చున్నాను. ఇకముం దెప్పుడైన నీవు రమేంద్రుని రహస్యముగాఁ జూచుటయే తటస్థించునేని—ఇక నాతఁడు ప్రాణములతో నిలువఁ జాలఁడని నిశ్చయముగాఁ దెలిసికొని యుండుము! తెలిసినదా?” అనియెను.

హేమాంగి యేమియు మాటాడకుండఁగనే తలయూఁచెను. అప్పుడామె హృదయమునందు సతీజనసులభం బగు సిగ్గుతోఁ గూడిన గర్వ ముద్దీపితం బయ్యెను. నిరంతరము నమృతవర్షమును గురియించు చుండు నామె నయనేందీవరములనుండి విశ్వమండలము నంతను దహింపఁజేయఁజాలు హుతాశనజ్వాలలు వెలువడ నారంభించెను. అవమానముచేఁ బ్రదీప్తంబగు హృదయక్షోభముచేతను, వృథాక్షోభ ముచే నుద్దీపితంబగు రోషముచేతను నామె కోమలాంగకంబు లన్నియును గ్రీష్మప్రతప్తంబులగు కదంబశాఖలంబోలి కంపించిపోవు చుండెను. అప్పుడామె యవమానితయు, గర్వితయునగు నాఁడుసింగము వలె గర్జించుచు “రహస్యముగఁ జూచితి ననియా?—రహస్యముగాఁ జూచుటవలన నేమికొంపమునిఁగినది? బిడ్డ యాటలాడుకొనుచుఁ గ్రిందఁ బడిపోయెను. స్మృతి తప్పిపోయెను. ఆ సమయమునకు సరిగా మీరింట లేకుండుటచే నేమియుం దోఁచక సేవకునిం బిలిచి యతివేగముగ నొక డాక్టరును దీసికొని రావలయునని చెప్పి పంపితిని. వాఁడు వెంటనే పోయి డాక్టరగుటచేఁ గాఁబోలు రమేంద్రుని దీసికొని వచ్చెను. ఆతఁ డిచ్చట డాక్టరుపని చేయుచున్నట్లు నాకదివఱ కేమియును దెలియనే తెలియదు! వెంటనే రమేంద్రుఁడు వచ్చి అబ్బాయి గాయమునకుఁ గట్టు కట్టి మందువైచి వెడలిపోయెను. నిజముగా నాతఁ డిచ్చటికి నన్నుఁ జూచుటకై వచ్చియుండ లేదు. అపాయస్థితిలోనున్న మీ కుమారుని

గాపాడుటకే వచ్చి యుండెను. ఇందు నా తప్పేమున్నది ? రహస్యముగా దర్శించుట యనిన మీ యుద్దేశ మేమి ? " అనియెను.

ఆ వెంటనే యమ్మానవతి గౌరవపాదవిక్షేపముతో నాగదినుండి మెఱుపుఁదీగవలెఁ నవ్వలికి వెడలిపోయెను. సతీశిరోమణులగు రమణీ మణులయందలి విశేషత్వ మనిన నిట్టిదియే — కుసుమకోమలత్వము నకును, వజ్రకఠినత్వమునకునుగల పరస్పర విచిత్ర మనోహర సమావేశ మిట్టిదియే — ప్రాణేశ్వరుని కరస్పర్శమాత్రముననే యానంద సమ్మూర్ఛితయై పోవుచుండు నక్కోమలాంగి యిప్పు డొక్కనిమేష ములో నళినిభీషణాకృతియై యనలవర్షమును గురియించుచుండెను ! అవమానిత యగు మానినీమణి, యుత్తేజితయు, నుత్తిష్ఠయునగు నాఁడుసింహమువంటిది—అట్టి సాధ్వీమణియెట్టయెదుట నిలువఁబడుటకుఁ బాపమునకు సాధ్యమగునా ?

సతీశచంద్రుఁడు నిశ్చేష్టుఁడై కొన్నినిమిషములవఱకు నట్లే నిలువఁబడిపోయెను. తరువాత నాతఁడు తనకుమారుని బరుండఁజేసిన గదిలోనికిఁ బోయెను. అచ్చట దాసివలన నదివఱకు జరిగినవృత్తాంత మంతయును సవిస్తరముగా నాకర్ణించెను. కాని యందువలనఁగూడ నాతనికి మనశ్శాంతి గలుగదయ్యెను. ఈర్ష్యయుఁ గ్రోధమును గలసి యాతని హృదయమునందు నరకానలజ్వాలలను బ్రజ్వలింపఁజేయు చుండెను. చాలకాలమునుండి యాతని హృదయమునం దయీర్ష్యా నలము తుషావృతంబగు ననలముంబోలి ప్రధూమితం బగుచుండెను. ఇప్పు డాకస్మికముగా దానియందు ఘృతాహుతి యగుటంజేసి యది యొక్కసారిగా మండుట కారంభించెను.

సతీశుఁడు హేమాంగిని బెండ్లియాడి యింతవఱకును సుఖమునే యనుభవించుచుండెనుగాని యెన్నఁడు నెంతమాత్రమును గష్టపడలేదు.

సతీశిరోమణి యగు హేమాంగి హృదయమునందు వివాహమునకుఁ బూర్వ మెట్టిభావమున్నను బెండ్లియైనతరువాత నామె యా భావము నించుకంతయైనను బ్రకటింపకుండ నెల్లవిధములఁదననాథుని సుఖవంతుని గనే చేయుచుండెను. కాని యీర్ష్య యనునది యతిభయంకర మగు కాలసర్పమునంటిది. దాని కొకసారి హృదయమునందుఁ జోటు దొరకి నచో నిఁక నదిసాధారణముగా నటనుండి వదలిపోదు. ఎన్నాళ్లక్రిందటనో సతీశునిహృదయకుహరమునం దాకాలసర్పము ప్రవేశించి యగపడియు నగపడకుండ నింతకాలమువఱకును నిలిచి యున్నది. రమేంద్రుఁ డిప్పుడు సతీశునిభార్యను రహస్యముగా దర్శించిన యవకాశమును గనుపెట్టి యాకాలసర్ప మతిభయంకరాకారములతోఁ దలయెత్తి బుసకొట్టుచు నృత్యముసేయ నారంభించెను.

హేమాంగీసతీశు లాదినమున మరల నేమియును మాటాడు కొననే లేదు. సతీశుఁ డొంటిరిగా నెలుపలిగదియందే కూర్చుండి యుండెను. అతిమానవతి యగు హేమాంగి మఱి యాతనిసమీపమునకు బోఁజాలదయ్యెను.

మఱునాఁటి ప్రాతఃకాలమునందే రమేంద్రుఁడు సతీశునింటికి వచ్చెను. ఆతఁడు సరళహృదయముతో సతీశునిం గాంచి యిప్పటి మరియాద ననుసరించి సతీశునికరగ్రహణము గావించుటకై చేయి సాచెను. కాని సతీశుఁడుమాత్రము చూచియుఁ జూడన ట్లూరకుండి యంతలో మనసు కుదురుపఱచుకొని చేయి వడఁకిపోవుచుండ నాతనిఁ గూర్చుండు మని సంజ్ఞచేసెను. కాని రమేంద్రుఁడుమాత్రమట్లు కూర్చుండ లేదు. ఆతఁడు తనపనితొందరను సూచించుచు "నాకిప్పుడు కూర్చుం డుట కవకాశములేదు. ఒకరోగిని జూచుటకై యిప్పుడే పోవలసి యున్నది. మీకుమారుఁడు సుఖముగా నున్నాఁడా ?" అనియెను.

అంతలో రమేంద్రుని కంఠస్వరము నాలకించి హేమాంగి చటాలున నచ్చటికి వచ్చి "మీ దయవలన నింతవఱకుఁ జిన్నబాబు సుఖముగనే యున్నాఁడు. మీరు చెప్పినరీతి నాతఁడు మంచముపైఁ బరుండి యుండుట కిష్టపడుట లేదు. లేచి యాడుకొనుటకుఁ దొందరపడుచున్నాఁడు" అనియెను.

సతీశచంద్రుఁ డప్పుడు కోపసూచకస్వరముతో "అయ్యో! ఏమని చెప్పుదును! ఇంతటి యజాగరూకతగలదాసీజనమును నేనెచ్చటను జూచియుండలేదు. ఆఁడుదాసివాండ్రను మాన్పింపవలయు నని నేనెన్నియోసారులు చెప్పియుంటిని. నిర్లక్ష్యముగా మెలంగుచుండు నాదాసిముండలమూలమున నిష్కారణముగాఁ గుఱ్ఱవాఁడు చచ్చిపోయియుండును. పరమేశ్వరానుగ్రహమువలన నొకగండము తప్పిపోయినది!" అనియెను.

రమేంద్రుఁడు మృదులస్వరముతో "అవును. దాసివాండ్రయసావధానతవలన నెట్టియనిష్టములైనను సంభవింపఁగలవు. ఏమైననేమి? బిడ్డకిప్పు డంతయపాయకరమైనదెబ్బ తగులకుండుట మీదంపతులయదృష్టమే యని చెప్పవచ్చును. ఏఁడీ! ఆబిడ్డ నొకసారి చూచిపోయెదను" అనియెను.

అప్పుడు హేమాంగి రమేంద్రుం గాంచి "ఇదిగో! పిల్లవాఁడీ ప్రక్కగదిలోనే పరుండి యున్నాఁడు—దయచేయుఁడు! నేనుగూడ నచ్చెదను" అనియెను.

తోడనే రమేంద్రుఁ డాగదిలోనికిఁ బోయెను. హేమాంగి సతీశునిం గాంచి "రెండు! మీరుకూడ నొకసారి లోపలికి రాఁగూడదా?" అనియెను.

సతీశచంద్రుఁడు కేవలమును రూక్షస్వరముతో సంక్షేపముగా "నేనెందులకు? నీవుపోయి బిడ్డను జూపింపుము!" అనియెను.

హేమాంగి మఱియేమియు మాటాడక లోపలఁ బ్రవేశించెను. మఱికొంతసేపటిలోనే యామెయు రమేంద్రుఁడునుగూడ వెలుపలికి వచ్చిరి. అప్పుడు రమేంద్రనాథుఁడు సంతోషముతో "పిల్లవాఁడు చాల బాగుగ నున్నాఁడు. కాని యింకను నాతని మంచముపైనుండి లేవనీయఁగూడదు. జాగ్రత్తగాఁ బరుండఁబెట్టి యుంచుటయే మంచిది. ఇప్పుడు కొంచెముగా జ్వరము తగిలినది. అయినను భయము లేదు. త్వరలోనే వదలిపోవును. బిడ్డమాత్రము లేచి యిటునిటుఁ దిరుగకుండఁ జూచుకొనుచు సావధానముగా నుండవలయును" అని చెప్పెను.

సతీ : బిడ్డకు మఱియేమియును భయము లేదుగద! జ్వర మంత హెచ్చుగా నున్నదా?

రమే : లేదు—ఏమియును బ్రమాదము లేదు. కాని యాతని లేవనిచ్చినచో జ్వరము కొంచెము హెచ్చుట కవకాశమున్నది. ఈ దినమునందుమాత్ర మాతఁడు మంచముపైనుండి కదలకుండఁ బరుండి యుండునట్లు భద్రముగాఁ జూచుచుండినఁ జాలును. ఇఁక భయము లేదు. రేపు లేచి యా పిల్లవాఁడు సుఖముగా నాడుకొనఁ గలఁడు. రేపటిదినమున నాలుగుగంటలకే నేను మరల వచ్చి బిడ్డను జూచిపోయెదను. మీరు దయచేయుఁడు! నాకు సెలవిండు!

అని చెప్పి రమేంద్రుఁడు వెడలిపోయెను. అతిసరళంబును, అమిత నిర్మలంబును, నిష్కపటంబును, సహజంబును నగు రమేంద్రుని సాధుప్రవర్తనముం గాంచి సతీశచంద్రుఁడు విస్మితుఁడై యేమి చేయుటకును నేమియనుటకును గూడ దెలియంగనంతటి విస్మయాధి

హృదయుఁడై పోయెను. ఆతఁడు కొంతసేపటివఱకు నేమియు మాటాడఁ జాలక రాతిబొమ్మవలె నిశ్చేష్టుఁడై కూర్చుండిపోయెను.

పిల్లవాఁడు మంచమునుండి లేచినచో జ్వరము హెచ్చిపోవునని రమేంద్రుఁడు స్పష్టముగాఁ జెప్పియుండెను. బిడ్డ యెంతమాత్రమును లేవకుండ వేయికన్నులతోఁ జూచుకొనుచుండవలయు నని హేమాంగి దాసికి బోధించి కట్టుదిట్టములను గావించియే యుండెను. అయిననేమి ! చాలకాలమునుండి దాసీజనము నిర్లక్ష్యముగా మెలంగుటకే యలవాటు పడియుండెను. చిన్నబాబు నిదురించుచున్నాఁడు గదా యని భావించి దాసికలిరువురును లోకాభిరామాయణమునుగూర్చి మాటలాడు కొనుచు నవ్వాలికిఁ బోయియుండిరి. ఆసమయమునందుఁ బిల్లవాఁడు మంచమునుండి లేచి వెలుపలికిఁబోయి యెండలో నిలువఁబడియెను.

కొంతసేపటి కాతనిరోదనముచే మందిరమంతయును బ్రతిధ్వ నింప నారంభించెను. చిన్నబాబిప్పు డెండలో నిలువఁబడి రెండుచేతు లను దలపైఁ బెట్టుకొని "బాబూ ! అమ్మా !" అని బిగ్గరగా నేడువ నారంభించెను.

ఆయేడుపు నాలకించి దాసి గడగడ వడంకుచుఁబోయి యా పిల్లవాని నెత్తికొని లోపలికిఁ దీసికొనివచ్చెను. అప్పుడు హేమాంగి వలన దాసి కెన్నియో చీవాట్లు తగిలినవని వేఱుగ వ్రాయనక్కఱలేదు. ఏమైననేమి ? చిన్నబాబునకు జ్వరము తగ్గినది గాదు. క్రమముగా నాతనికి జ్వరాతిరేకముచే స్మృతి తప్పిపోయెను. ఇఁక నేదియును గత్యం తరము లేకపోవుటచే నీసారి సతీశచంద్రుఁడే స్వయముగా సేవకుని బంపి రమేంద్రనాథుని బిలిపింపవలసిన వాఁడయ్యెను.

రమేంద్రుఁడును వెంటనే వచ్చి పిల్లవానిం గాంచి బొమలు ముడివైచి "ఈ పిల్లవానిని మంచమునుండి లేవనిచ్చితిరా ?" అనియెను.

సతీశచంద్రుఁడు జరిగినవృత్తాంతమంతయును రమేంద్రునకుఁ దెలియఁజేసెను. రమేంద్రుఁ డంతయు నాలకించి విరక్తుఁడై "చాల తప్పుపని జరిగినది. చిన్నబిడ్డలవిషయమున నింతయజాగరూకతగా నుండుట యుచితముగాదు—సరే—జరిగినదాని కేమనుకొన్న నేమి లాభము ? ఇప్పుడైనను భయములేదు—జ్వరము కొంచెము విజృంభించినది—అంతే ఇఁకనైనను జాగ్రత్తగాఁ జూచుకొనవలయును. ఒక సేవకుని నావెంటఁ బంపించినచో నాతనిచేతి కొకయౌషధము నిచ్చి పంపెదను" అనియెను.

# తొమ్మిదవ ప్రకరణము

సతీశచంద్రుఁడు మధుపురమునకు వచ్చి యప్పుడే పదిదినములయ్యెను. చిన్నబాబునకు జ్వరము వదలిపోయి మంచి యారోగ్యము గలిగెను. కాని యింకను సంపూర్ణముగా జ్వరము వదలిపోయె నని చెప్పుట కవకాశములేదు. కొంచెముగా నంతర్గతజ్వర మున్నట్లు తోఁచుచుండెను. అంతకంటె మంచిడాక్టరు లెవ్వరు నానగరమున

లేకుండుటచే జేయునది లేక సతీశచంద్రుడు రమేంద్రుని మాటకు మాటికిని బిలిపింపవలసినవాడయ్యెను. ఇష్టము లేకపోయినను సతీశుడు తన యింటికి రమేంద్రుడు ప్రతిదినమును రాకపోకలు గావించుచుండుటను దప్పించుకొనజాలకపోయెను. రమేంద్రుడు దినమునకు రెండుసారులు, ఆవశ్యకతనుబట్టి మూడుపర్యాయములు గూడ సతీశుని యింటికి వచ్చి చిన్నబాబును జూచి పోవుచుండెను.

ఈ కొలదిదినములలోనే సతీశునకు మధురపురమునందలి పెద్ద మనుష్యు లనేకులతోc బరిచయము గలిగెను. వారందఱు నాతని యోగక్షేమములను దెలిసికొనుటకై తఱచుగా వచ్చుచుc బోవుచుండిరి. అందు ప్రఫుల్లబాబను నొకధనాఢ్యుని కుటుంబమునకును, సతీశుని కుటుంబమునకును నత్యంతమగు స్నేహసంబంధము గలిగెను. ప్రఫుల్ల బాబును, అతని సహధర్మిణియుcగూడc దఱచుగా సతీశునింటికి వచ్చుచుండిరి. ఒకనాడు చిన్నబాబు మంచి యారోగ్యముగా నుండుటచే సతీశుడును హేమాంగియుc జిన్నబాబును దాసదాసీ జనంబుల కొప్పగించి జాగ్రత్తగాc జూచుకొనుచుండ వలయునని యాజ్ఞాపించి యిరువురును గలసి ప్రఫుల్లబాబునింటికిc జూడcబోయిరి.

వారిరాకం గాంచి పరమానందభరితుడై ప్రఫుల్లకుమారుడు మిగుల గౌరవముతో సతీశునెదురుకొని లోనికిc దీసికొనివచ్చి యొక కుర్చీపైc గూర్చుండcజేసి హేమాంగిని దనభార్యకడకు లోపలికిc బంపించెను. మిత్రులగు ప్రఫుల్లకుమారసతీశచంద్రులు కొంతసేపటి వఱకు నిష్టాలాపములచేc గాలక్షేపము గావించిరి. అనంతరము ప్రఫుల్ల బాబు సతీశునిం గాంచి “ మిత్రమా! ఒకసారి నగరములోనికి షికారు పోయివత్తమా ? ” అనియెను.

సతీశుఁడు మందహాసము చేయుచు "మంచిది. అలాగే పోయి వత్తుము!" అనియెను. పిమ్మట నయ్యిరువురును గలసి రాజవీథిని బయలుదేఱి పోయిరి. అట్లు సతీశుఁడును, ప్రఫుల్లకుమారుఁడును వెడలి పోయిన కొలఁదిసేపటిలోనే రమేంద్రుఁ డచ్చటికి వచ్చి ద్వారపాలకుని గాంచి "ప్రఫుల్లకుమారుఁ డెచ్చటికిఁ బోయినాఁడు?" అని యడుగు చుండెను. ఇంతలో సతీశునిమందిరమునుండి యొకసేవకుఁడు వగర్చు చు నచ్చటికి వచ్చి యాకస్మికముగా నచ్చట నగపడిన రమేంద్రు నిం గాంచి "డాక్టరుబాబూ! శీఘ్రముగా మాయింటికి దయచేయ వలయును" అని విన్నవించెను.

లోపల ప్రఫుల్లకుమారునిగృహిణితో మాటలాడుచున్న హేమాంగి తనసేవకునికంఠస్వరము నాలకించి తత్తరముతో నతిత్వరితముగ వెలుపలికి వచ్చి సేవకునిగాంచి "ఏమి! ఇంతలోనే యింత తొందరపడి యేలవచ్చితివి? నేను భయపడుచునే వచ్చితిని. చిన్నబాబునకు మరల జ్వరము తగులలేదుగద?" అని యడిగెను.

సేవ: అమ్మా! నేనందుచేతనే యింతతొందరగా వచ్చితిని. చిన్నబాబున కస్వస్థతగా నుండుటచే నాతనిదాసి డాక్టరుగారిని దీసికొని రమ్మని నన్నుఁ బంపించినది. నేను పరుగెత్తికొని యటకుఁ బోయితిని గాని రమేంద్రబాబిచ్చటికి వచ్చినట్లు వారిసేవకుఁడు నాకుఁ జెప్పెను. ఆకారణముచేతనే నేనిచ్చటికిఁ బరుగెత్తుకొని వచ్చితిని. సమయమునకు సరిగా డాక్టరుబాబుగారి దర్శనమైనది.

ఆమాటవిన్నంతనే ప్రేమమయి యగుతల్లిప్రాణము తల్లడిల్లి పోయెను. సతీశచంద్రుఁ డప్పు డేవైపునకు షికారు పోయెనో తెలియ దయ్యెను. ఇఁక నాతనికొఱకొకనిమిషమైన నాలసించుట కామె సహింపఁజాలకపోయెను. అప్పు డామె రమేంద్రునిం గాంచి "డాక్టరుబాబూ! త్వరపడవలయును. మనమిరువురమును గలసి యతివేగముగ

నింటికిఁ బోయి బిడ్డసంగతిని విచారింపవలయును. నాకేమియును తోఁచుట లేదు." అనియెను.

రమేంద్రుఁడట్లే యని చెప్పి యామెతోఁగూడ బయలుదేఱెను. అప్పటి కప్పుడే సంధ్యాకాల మయ్యెను. అతినిర్మలంబగు భూమండల ప్రాంతమున నఖిలజీవనయనానందకరుండగు శరత్కాల చంద్రుఁ డుదయించుచుండెను. ప్రకృతియంతయును వెండినీటిచేఁ బూఁత పెట్టఁబడినట్లు వెన్నెలవెలుంగులచే విరాజిల్లుచుండెను. సౌఖ్య మాధుర్య సౌందర్యములు మూఁడును గలసి యొక్కచో నతిమనోహరముగ సమ్మిళితములై యున్న యాసమయంబున విశ్వసామ్రాజ్యమున కంతకు నధీశ్వరియగు ప్రకృతిదేవి ప్రేమవిజయఘోషణంబులెల్లయెడల బ్రతిధ్వనితము లగుచుండెను. ఆనందాయకంబగునట్టి చల్లనివేళ హేమాంగీరమేంద్రులిరువురును గలసి యతిత్వరితగమనంబులతో పానియాఖోలా మార్గమునుబట్టి పోవుచుండిరి—సేవకున కంత తొందరయేమున్నది? తొట్రుపడుచున్న హృదయములతో నతివేగముగఁ బోవుచున్న హేమాంగీరమేంద్రులతో నిదివఱకే గమనాయాసముచే నలసియున్న యా సేవకుఁడు నడవఁజాలక చాలదూరము వెనుకఁబడిపోయెను.

దూరమునున్న యొక బయలునందు మార్గమధ్యమున సతీశచంద్రుఁడును, ప్రఫుల్లకుమారుఁడును నిలువఁబడి యావంకనే చూచుచుండిరి. అప్పుడు ప్రఫుల్లబాబు సతీశునిం గాంచి "మిత్రమా! అదిగో! చూచితివా! దూరమునందా త్రోవను బోవుచున్నవాఁడు మనడాక్టరు రమేంద్రుఁడే యని తోఁచుచున్నది! నీవు గుర్తించితివా? ఔను. ఆ దుస్తులను జూచినను, నడకనుబట్టి చూచినను నిశ్చయముగా నాతఁడే—సరిసరి అతని వెంట నొకయువతిగూడ నున్నదే—ఓహో! చాల వింతగా నున్నదే" అనియెను.

సతీశచంద్రుఁడు నవ్వ నారంభించెను. దూరమునం దుండుటచే నామె తనభార్యయే యని యానవాలు పట్టఁజాలకపోయెను. సతీశుఁడును, ప్రఫుల్లకుమారుఁడును గలసి యప్పుడు ప్రఫుల్లబాబు నింటివైపునకుఁ దిరిగి పోవుచుండిరి. ఇంతలో నిరువురు పెద్దమనుష్యులు వచ్చి వారిని గలిసికొనిరి. వారిని జూచి ప్రఫుల్లకుమారుఁడు నవ్వుచు "చూచితిరా! మనడాక్టరుగా రానందసాగరమున మునిఁగి తేలుచు నుక్కిరిబిక్కిరి యగు చున్నాఁడు! అతఁ డిప్పుడు మనతోఁగలసి వాయుసేవనమునకై రాక యొక సుందరీమణితోఁగూడి హాయిగా షికారు చేయుచున్నాఁడు! అనియెను.

అందొక పెద్దమనుష్యుఁ డామాట లాలకించి మందహాసము చేయుచు "ఆ యువతీమణి మన సతీశబాబుభార్య!" అనియెను.

ఆతఁడు దురుద్దేశముచే నిట్లు చెప్పియుండలేదు. హేమాంగి తనబిడ్డకు జబ్బుచేసినదని తెలిసి డాక్టరును దీసికొని యింటికిఁ బోవుచున్న ట్లాతఁడు వినియుండెను. కాని యాతఁ డంతవఱకే చెప్పి యూరకుండుటచే సతీశున కామాట హృదయశూలమువలె బాధింపఁ దొడఁగెను.

అప్పుడు ప్రఫుల్లకుమారుఁ డాపెద్దమనుష్యునిం గాంచి "ఆమె సతీశునిభార్యయేనా? డాక్టరును దీసికొనిపోవుట కేమికారణము? ఆకస్మికముగ నింట నెవ్వరికైన జబ్బుచేసినదా యేమి?" అని యడిగెను.

ఆ పెద్దమనుష్యుఁడు తనకుఁ దెలిసినవిషయమంతయు నెఱింగించెను. కాని సతీశచంద్రుఁడుమాత్ర మేమియును మాటాడలేదు; అన్యమనస్కుఁడై శూన్యదృష్టులతోఁ జేలవంకఁ జూచుచు గూర్చుండి పోయెను. అతివిశాలంబును, దిగంతవ్యాప్తంబును నగుసస్యక్షేత్రము నందు రజతవిమలంబులగు చంద్రకిరణములు నృత్యము చేయుచుండెను.

పైని మేఘవిహీనంబును, నిర్మలంబును నీలంబునగు విశాలాకాశ వక్షంబున నక్షత్రమాలికామధ్యంబునందు నిశామణియగు సుధాకరుఁడు విరాజిల్లుచుండెను. బాహ్యప్రకృతియంతయు నా సమయమునందు నృత్యమయియు, నానందమయియు నై యుండెను. ఈ విధముగా బహిర్జగంబంతయు నతివిమలకాంతులతోఁ దేజరిల్లుచు మనోమోహనకరమై యుండెను. కాని సతీశచంద్రుని హృదయాకాశమునందు మాత్రము క్రమక్రమముగా నమావాస్యచీఁకటి క్రమ్ముకొనుచు నతిగాఢముగఁ నలముకొనఁ దొడంగెను.

ఇంతవఱకును బరాకుగఁ గూర్చుండియున్న సతీశుఁ డప్పు డాకస్మికముగా నదరిపడి లేచి "మిత్రమా! నేనింటికిఁ బోయెదను. పిల్లవాని కెట్లున్నదో యేమో?" అని చెప్పి యతిత్వరితముగా నటనుండి వెడలిపోయెను.

అతఁ డట్లు కొంతదూరము పోయినతరువాత నొక పెద్దమనుష్యుఁడు తక్కినవారిం గాంచి "పాపము సతీశునకుఁ గుమారుఁ డనిన నెంతప్రేమయో చూచితిరా! బిడ్డకించుక యనారోగ్యముగా నుండె నను మాట విన్నతోడనే యాతఁడు నిశ్చేష్టుఁడై పోయినాఁడు! ఔను. పుత్రప్రేమ యతిప్రగాఢమైనదిగదా!" అనియెను.

వాస్తవముగా సతీశచంద్రుఁడు బిడ్డనుగూర్చి యంతవికల హృదయుఁడై యుండలేదు. అనుమానపిశాచశక్తి యతిదారుణముగా నాతని హృదయాంతరాళమునం దంతటను వ్యాపించి తనయమోఘ ప్రభావమును విస్తరింపఁజేసికొనుచుండెను.

సతీశుఁ డించుకసేపటి క్రిందటనే తనకుమారుఁ డారోగ్యముగ నాటలాడుకొనుచుండుటను జూచివచ్చెను. అట్టిబిడ్డ కింతలోనే జబ్బు చేయు ననుకొనుట కెంతమాత్రము నవకాశము లేదు. అందుచే సతీశున

కామాక్షి విశ్వసనీయముగాఁ దోఁపకయ్యెను. ఈర్ష్యాపిశాచ విష్టుఁడగు నాతఁడప్పుడు తనలో "ఇది కేవలమును కపట తంత్రము! రమేంద్రుని తోఁ గలసి యిచ్చవచ్చిన రీతిని వీధులవెంట షికారు చేయుటకు హేమాంగి పన్నిన పన్నాగము! హేమాంగీ రమేంద్రు లిదివఱకే యిట్లాలోచించుకొని నాకన్నులలోఁ దుమ్ముకొట్టుటకై యీవంక గల్పించుకొన్నారు! కాని బిడ్డకింతలో జబ్బుచేయుననుమాట కేవల మసత్యము! ఔరా! ఎంతసాహసము!" అని యనేకవిధముల భావించు కొనుచుఁ గ్రోధావేశముచే నొడలెఱుంగకుండ గృహాభిముఖుఁడై యతి శీఘ్రగమనముతోఁ బోవుచుండెను. అనుమాన పిశాచావేశముచే దేవ తలుగూడ దానవులై పోవుదురన్నచో దుర్బలహృదయుఁడును, దూర దృష్టివిరహితుఁడును, మానవమాత్రుఁడు నగు సతీశుఁ డెంతటివాఁడు!

అతఁ డింటియొద్దకు వచ్చి యెవ్వరితోఁడను మాటలాడకుండఁగనే చటాలున లోపలఁ బ్రవేశించెను. కొంతసేపటివఱకు నాతఁడు దొంగ వానివలె నిల్లు నాలుగు మూలలును దిరిగి తిరిగి యనంతర మడుగుల చప్పుడు వినఁబడకుండ మెల్లమెల్లఁగా లోపలి నుంసువాలోనికి వచ్చి యటనున్న సేవకునిం గాంచి మృదుస్వరముతో "ఆ వీధినుండి బయలు దేఱి మీ యమ్మగారింటికి వచ్చినారా!" అని యడిగెను.

సేవ: వచ్చినారుబాబూ! డాక్టరుబాబునుగూడ వెంటఁదీసి కొనియే వచ్చినారు. లోపలనున్నారు! డాక్టరుగారు మనచిన్నబాబును జూచుచున్నారు! చిన్నబాబున కాకస్మికముగా జబ్బు చేసినది!

ఆ మాటవిని సతీశుఁడు మెల్లఁగా జప్పుడు చేయకుండ గది లోపలఁ బ్రవేశించెను. అతఁడు పోయి చూచునప్పటికి హేమాంగి చిన్నబాబు పరుండియున్న మంచముప్రక్కను నిలుచఁబడి యుండెను.

రమేంద్రుడు శోధించుకవంగి చిన్నబాబు చేయిపట్టుకొని నాడిని బరీక్షించు చుండెను.

సతీశచంద్రుని జూచినంతనే చిన్నబాబు "బాబా! బాబా!" యని పిలుచుచు మంచమునుండి లేచుటకుఁ దొందరపడియెను.

అప్పుడు హేమాంగి తననాధుని గాంచి యొక్కనిట్టూర్పు విడిచి ప్రసన్నవదనముతోఁ బ్రసన్నస్వరముతో "చిన్నబాబున కిప్పుడు నెమ్మది గలిగినది. దాసి యెందుల కింత తొందరపడిపోయినదో చెప్ప వలసిన యావశ్యకత లేదు. పాపము దాని కేమి తెలియును? కంగారు పడి వైద్యునికొఱకు కబురు పంపినది!" అనియెను.

సతీశచంద్రుఁడు దాసింగాంచి కోపసూచకస్వరముతో "నీవూరక మాటిమాటికిని డాక్టరుకొఱకుఁ గబురులు పంపుచుండు టెందులకు!" అని గద్దించెను.

దాసి : బాబూ! నేనేమి చేయుదును? డాక్టరును బిలువకుండ నెట్లుండఁగలను? బాబునకు జ్వరము తగిలినది. చూచుచుండఁగనే హెచ్చిపోయినది. ఒడలు తెలియకుండఁ బడిపోయినాఁడు! నాకుఁ జాల భయము వైచినది! మీ రెవ్వరింటికిఁ బోయితిరో నాకుఁ దెలియలేదు. పోవునప్పుడు మీరైనను నాకుఁ జెప్పలేదు. అందుచే నాకేమియుం దోఁచక డాక్టరుబాబును దీసికొని రావలయునని సేవకుని బంపితిని.

అప్పుడు రమేంద్రుఁడు పిల్లవానిని బాగుగఁ బరీక్షించి లేచి, "ఈ మాదిరి జ్వరమున కప్పుడప్పు డిట్లే యగుచుండును. ఇందుకొఱ కెంతమాత్రమును భయపడవలసిన పనిలేదు. పిల్లవాఁడిప్పుడు బాగుగనే యున్నాఁడు! ఏమియును భయములేదు" అనియెను.

సతీశుఁ డేమియును మాటాడలేదు. హేమాంగి యొక్కనిట్టూర్పు విడిచి మనసుఁ గుదుట పఱుచుకొనియెను. రమేంద్రుఁడు బిడ్డ కీయవలసిన మందులు మొదలగునవి యిచ్చి యటనుండి వెడలి పోయెను. తరువాతఁ గొంతసేపటివఱకును బిడ్డయొద్దఁ గూర్చుండి హేమాంగి తన పడకటింటిలోనికిఁ బోయెను. ఆమె తనగదిలోఁ బ్రవేశించిన నిముసమునందే సతీశచంద్రుఁడుఁ గూడ నందుఁ బ్రవేశించెను.

## పదియవ ప్రకరణము

సతీశచంద్రుఁ డాగృహామధ్యమునందుఁ బ్రవేశించినతోడనే లోపలినుండి చటాలునఁ దలుపు మూసి గొళ్లెమును బిగించివైచెను. అది చూచి హేమాంగి నివ్వెఱపడిపోవుచు "అంత తొందరగాఁ దలుపు మూసితి రేమి?" అని ప్రశ్నించెను.

అప్పుడు సతీశుఁడు వజ్రగంభీరస్వరముతో "మాటాడకుము! ఆఁగుము! నామాటలు ముగియునంతవఱకును నిన్నీగదినుండి యవ్వలికిఁ బోనీయను! అందుచేతనే యీతలుపు మూసి వైచితిని. నీతో నేనిప్పు డెన్నియోమాట లాడవలసి యున్నవి. ఏదీ! చెప్పుము! ఈ శరత్కాలమునందుఁ జల్లనివెన్నె వెలుంగున నీవు నీ ప్రియునితోఁ గలసి మహానందముతో విలాసవిహారముం గావించిన వృత్తాంతమును

సవిస్తరముగా వినవలయునని కుతూహలపడుచున్నాను! చెప్పుము!”
అనియెను.

హేమాంగి హృదయావేగముతోఁ దలుపువంకఁ జూడఁబోడం గెను. ఆమె యింతకుఁబూర్వ మనేకపర్యాయము లప్పుడప్పుడు స్వామి హృదయభావములను గ్రహించి యట్టియసమయముల యందాతని కన్నులయెదుటఁ బడకుండఁ దప్పించుకొని పోవుచుండెడిది. ఇప్పు డామె కట్టియవకాశ మేది? అకస్మికముగా నిట్లు బంధింపఁబడియుండుట నామె సహింపఁజాలక పోయెను. ఆమెహృదయ మవమానదుఃఖముచేఁ బరితపించిపోవుచుండెను. ఇఁక నేమియుం జేయఁజాలక యా సతీశిరో మణి యేడ్చుచు “నాథా! మీరు నాయెడల నింతటికఠినహృదయులై పోయితి రేల? నే నెన్నఁడైన మీయెడల నెట్టియపచారమునైనఁ గావించి యెఱుంగుదునా? ఏమికారణమును లేకుండ నూరక నన్నిట్లు నిందించుటకు సరళహృదయులగు మీకు నోరెట్లు వచ్చుచున్నది? ఎప్పుడైన నాయెడల నెట్టిదోషమునైన మీరు కనుపట్టియుంటిరా? ఊరక నన్నిట్లేడ్పించెద రెందులకు?” అనియెను.

సతీశచంద్రుఁ డింకను నతికఠోరంబగు స్వరముతో “లేదు—— ఇంతవఱకు నీయందు నాకెట్టిదోషమునుగూడ నగపడలేదు——అంత వఱకు నేనంగీకరించెదను. కాని నీవిక్కడకు వచ్చినప్పటినుండియు నేదో యొకవిధముగా నగపడుచున్నావు. పొంగిపొరలిపోవుచున్న హృదయభావోద్రేకము నడఁగించుకొనఁజాలక నీలో నీవే బాధపడు చున్నట్లు నాకుఁ దోఁచుచున్నది! దీనికంతకును గారణ మేమి? నీవెంత దాఁచుకొనుచున్నను నిత్యమును గాంచుచున్న నాకు నీహృదయభావము గోచరించుట లేదా? నీ ప్రణయహృదయ మెంతబిగబట్టినను నీకు

లాంగికి యెక్కుడకో యెగసిపోవుచున్నది. ఔను. పాపము నీవేమి చేయఁగలవు ?" అనియెను.

హేమా : అయ్యో ! ఇట్టియన్యాయపుమాటలచే నన్నూరక యేల బాధించెదవు ? నే నిదినఱ కెన్నఁడునుగూడ మీకంటెు నన్యులను బ్రేమించి యెఱుంగను.

సతీ : అలాగా ? ప్రేమావేశముచే నోటఁబెలుంగకుండ మాట లాడుచుఁ జేయునదిలేక యానాఁడు నీప్రాణప్రియునికి శాశ్వతముగా సెలవొసంగి పంపించినప్పుడు నీనిష్కపటప్రవర్తనమును నేనుగన్నులారఁ జూడక యేయున్నచో—

హేమాంగి యదరిపడి తలయెత్తకుండఁగనే యతిమృదులంబగు స్వరముతో "ఎప్పుడు ?" అనియెను.

సతీ : ఇంకను నెప్పుడని యడుగుచున్నావా ? సంపూర్ణముగ మొదటినుండియు వర్ణించి చెప్పమందువా ? నీకాసంగతి జ్ఞప్తికి వచ్చుటలేదా ? నీవాదినమునందు నీకన్నులనుండి యానందాశ్రువులో, భవిష్యద్వియోగదుఃఖాశ్రువులో యెడతెగకుండఁ బ్రవహించుచుండఁగా నీప్రాణప్రియునుద్దేశించి "సర్వాంతఃకరణంబులచేతను నేను నిన్నే ప్రేమించియుంటిని !" అని చెప్పలేదా ? అప్పుడాతఁడతిసాహసముతో నీపాణిగ్రహణముగావించి తనవక్షస్స్థలమునందుఁ జేర్చుకొనలేదా ? అప్పటిమీప్రణయవిలాసము లన్నియును నేను స్వయముగా నాకన్నులారఁ గాంచి యుండలేదా ?

ఆమాట విన్నంతనే హేమాంగికి నిశ్వాసప్రశ్వాసములు చటాలున నిలిచిపోయెను. ఇఁక నామె యేమియును మాటాడఁజాలక పోయెను. సత్యవచనమునకు వ్యతిరేకముగఁ బ్రత్యుత్తర మేమని చెప్పఁగలదు?

అప్పుడు సతీశచంద్రుఁడు మరల గభీరస్వరముతో "మాటాడ వేమి ? ఇదియంతయు నిజమేనా ? ఇట్టిసీయసాధుచరిత్రమును సంపూర్ణముగా నెఱింగియుండియు నెప్పుడైన నేను నీతోఁ బ్రస్తావించితినా ? అందులకుఁ గారణ మేమో నీవించుకంతయైన గ్రహించితివా ? లేదు—ఏమనిన—నేను సర్వవిధములచేతను నిన్ను నాప్రాణములకంటె నధికముగఁ బ్రేమించి యుంటిని ! అందుచేతనే యప్పటిమీసంగతు లన్నియు నప్పుడే మఱచిపోఁగలిగితిని—కాని—నీవో?—హేమాంగీ? అయ్యో! నీ వెంతనిర్భాగ్యురాలవు ! చంచలచిత్తురాలవు ! విశ్వాసవిహీనురాలవు! కపటవర్తనురాలవు ! ఏమందువు ?" అనియెను.

హేమాంగి శోకగద్గదస్వరముతో "నాథా ! నేనిప్పుడు పరమేశ్వరునినామము నుచ్చరించుచు నాసర్వసాక్షిపై నొట్టువెచుకొని సత్యము చెప్పుచున్నాను. స్వామీ ! నేనుగూడ నావిషయములన్నియును సంపూర్ణముగా మఱచిపోయితిని ! హృదయపూర్వకముగా దేవునియెదుట—ప్రత్యక్షదేవతాస్వరూపులగు మీ పాదములయెదుట—నేను చెప్పినమాటను మీరు విశ్వసింపనలయును ! నేనిప్పుడు తొల్లిటికపరిణయముగ్ధనగు తారుణ్యవతిని గాను ! మీగృహిణినై, బిడ్డల తల్లినై యున్నదానను ! మీపాణిగ్రహణసౌభాగ్యము లభించినప్పటి నుండియు నాకు మీకంటె నితరాభీష్టం బేదియును లేదు. నాథా ! ఈ విధముగాఁ బూర్వవృత్తాంతముల నన్నిటిని దడవి గోరంతలు గొండంతలు చేసి యూరక నన్నేల బాధించెదరు ? మీకోమలహృదయమునందించుకంతయైనను దయ యనుమాటయే లేదా ?" అనియెను.

సతీ : ఆహా ! ఏంతదానవు ! మనసు గరఁగింపఁగలమాటలు నేర్చినదానవు గాకున్నచో నింతలేసిపనులు చేయఁగలవా ? మన మీనగరమునకు వచ్చి యెన్నాళ్లయినది ? ఏనాఁడు మనమీయూరఁ

ప్రవేశించితివో యూనాఁటినుండియు నాతఁడు నీచెంతకు వచ్చుచునే యున్నాఁడుగదా! దినమునకొకసారియా? రెండేసి, మూఁడేసి పర్యాయములు! పదిపర్యాయములు! ఔనా?

హేమా: అయ్యో! ఆతఁ డూరక వచ్చుచుండునా? మన బిడ్డకు జబ్బుచేయుటచే నాతనికి మందిచ్చుటకై వచ్చుచుండెను. రోగమునకుఁ దగినయౌషధము నిప్పించుకొనకుండ మీరుమాత్రము కడుపారఁ గన్నబిడ్డను జంపుకొనుట కంగీకరింపఁగలరా? ఆతఁ డెప్పుడు వచ్చినను మనబిడ్డకు వైద్యము చేయుటకే వచ్చుచున్నాఁడు. అంతకంటె నితరోద్దేశమేదియు నాతనికి లేనే లేదు. మీరు గూడ స్వయముగాఁ జూచుచునే యుంటిరి గాదా?

సతీ: సరే. అలాగే యనుకొందము. కాని నేఁటిమాట యేమందువు? రాత్రిసమయమున నిర్జనమైయున్న రాజమార్గము వెంటఁబడి మైలుదూరము మీరిరువురును జోడుగా వచ్చియుంటిరి. అప్పటి మీ స్థితిగతులను గన్నారఁ జూచి నేనాకస్మికముగాఁ బిచ్చివానివలెనై పోయితిని—అప్పుడు నాహృదయ మెంతవికలమైపోయినదో నీకెట్లు తెలియును? కాని యాతఁ డింతవఱకదృష్టవంతుఁడే—ఆసమయమునం దాతఁడు నేనును ద్రోవలోఁ గలసికొనకుండఁ దప్పిపోయినది. అట్లే తటస్థించినచోఁ గ్రోధోద్రేకముచే నప్పుడు నేనేమి చేసియుందునో యెట్లు చెప్పఁగలను?

హేమా: అదియేమినాథా! మీ రెంతయో దూరదృష్టిగల విజ్ఞానవంతులుగదా! అయ్యో! ఈ విధముగా సామాన్యునింబోలి మాటలాడుచున్నారేమి? ఆతఁ డిన్నిసారులు మనయింటికి వచ్చుచుండెను గదా! ఎన్నఁడైన నగౌరవముగాఁ బ్రవర్తించినాఁడా? అసభ్యముగఁ బ్రస్తావించినాఁడా? మీకింతసంశయమేల? నేనిప్పుడు

పరసతీమణి ననియు, బిడ్డలతల్లి ననియు నాతఁ డెఱుంగఁజాలఁడా! ఇంతచదువుకొన్న వాని కంతపాటిజ్ఞానమైనను లేకుండఁబోవునా?

సతీశుఁ డిప్పు డిప్పు డున్మత్తుఁడై పోయెనా యేమి? సంపూర్ణముగాఁ బిచ్చివాఁడు గాకపోయినను జాలవఱ కాతని కట్టియవస్థయే తటస్థించినది. అప్పుడాతఁ డొక్కసారిగా బాలకునివలె రోదనము చేయుచు రెండుచేతులను బారసాచి చటాలున హేమాంగిని గౌఁగిలించుకొని యతివ్యాకులితంబగు హృదయస్థలంబునం జేర్చుకొని యదేరీతిగ వెక్కివెక్కి యేడువ నారంభించెను.

పిచ్చిచేఁతలం గావించుచు నేమియు మాటాడక యేడ్చుచున్న నాథుని యప్పటియవస్థం గాంచి హేమాంగి భయభ్రాంతురాలై పోయెను. ప్రాణేశ్వరుఁ డింతటి వికలహృదయముతో దీనభావముం గాంచియుండుట నామె యిదివఱ కెన్నఁడును జూచి యుండలేదు. ఆతని యసాధుప్రవర్తనమువలన మొట్టమొదట నాసతీశిరోమణికి సహింపఁ జాలనంతటి క్రోధమే గలిగెను. ఆ క్రోధముచే నామె కొన్నాళ్లవఱకును నాథునిసాన్నిధ్యమును వదలి యెచ్చటికేని బోవలయునని ప్రయత్నించెను. కాని యిప్పటి యాతని వికలావస్థం గాంచి యేమిచేయఁగలదు.? ఒక్కనిమిష మెడఁబాసియున్నచోఁ బ్రాణేశ్వరుఁ డెప్పటి కేమైపోవునో యని యామెకు భయము గలిగెను. అప్పుడామె యెట్లయిన నాథునిహృదయమునకు శాంతిని గల్పింపవలయునని యెన్నియోవిధములఁ బ్రయత్నించెను. కుసుమకోమహృదయయగు నామె పాప మాతని నెట్లూఱడింపఁగలదు? తన్నుఁ గౌఁగిలించుకొని యదేపనిగ నేడ్చుచున్నభర్తం గాంచి తుదకామెయు నేడువ నారంభించెను.

అప్పుడు సతీశచంద్రుఁడు నిరంతరపతిసేవాపరాయణ యగుతన యిల్లాలిం గూర్చి యన్యాయముగా సందేహించినందులకుఁ దనలోఁ

దానే యెంతయో సిగ్గుపడియెను. హేమాంగిచెప్పినమాట లన్నియును సత్యములే యని యాతనికప్పు డత్యంతమును విశ్వాసము గలిగెను. అందుచే నాతనివికలహృదయము కుదుటబడియెను. అతఁడు తన కన్నీటిని దుడిచికొని ప్రగాఢంబగునొకదీర్ఘనిశ్వాసమును విడిచి ప్రాణేశ్వరితోఁగూడఁ బర్యంకముపైఁ బడిపోయెను.

మఱునాఁ డెప్పటివలెనే రమేంద్రుఁడు చిన్నబాబును జూచి పోవుటకై సతీశునింటికి వచ్చెను. అప్పుడు సతీశుఁడు మునుపటివలెఁ గాక రమేంద్రుని కెదురేఁగి యాతని చేయి పట్టుకొని సమాదరపూర్వకంబుగా లోనికిఁ దీసికొనిపోయి కూర్చుండఁజేసెను. ఆతఁ డింతవఱ కెన్నఁడును రమేంద్రు నీవిధముగా సన్మానించి యుండలేదు.

## పదునొకండవ ప్రకరణము

అనుమాన మనుకాలసర్పము మహాభయంకరమైనది. ఏవిధముచేనైనను దాని కొకసారి హృదయకుహరమునందుఁ బ్రవేశించుట కవకాశము లభియించినచో నిఁక దానిని దూరముగాఁ ద్రోసివైచుటకుఁ గాని, యచ్చటనే దానినడంచివైచుటకుఁ గాని యెంతటివారును సమర్థులు గాఁజాలరు. అది యేమాత్రపుటవకాశము దొరకినను జటాలునఁ

బడగనెత్తి తనగరళపుఁగోరలచేఁ గాటుపైచుటకుఁ బ్రయత్నించుచుం డును. మనసతీశచంద్రునిహృదయమునందుఁ జాలకాలముక్రిందటనే యావిషసర్పము ప్రవేశించి యుండెను. ఆతఁడెంతమాత్రమును దాని నటనుండి కదల్పఁజాలకుండెను. కాన దానిశక్తినిమాత్రము విజృంభింప కుండ నించుక యడఁచిపెట్టి యుండెను. అది కేవలము తత్కాలిక శాంతివిధానముమాత్రమే—ఎప్పుడో తగినసమయము చూచుకొని యది మరల బుస్సుమని తలయెత్తుకొని యాడకమానదు !

సతీశచంద్రుఁడు ప్రాజ్ఞుఁ డయ్యును నిరంతరమును దనభార్యయు, రమేంద్రుఁడును గావించుచుండు ప్రతికార్యమునుగూర్చియుఁ గారణము లేకుండఁగనే సందేహపడుచుండెను. కాని యాతఁ డెంత యనుమా నించినను అప్పటినుండియుఁ దనభార్యమనసునొచ్చునట్లుగా నెట్టిప్రస్తావ మును గావింపక లోలోపలనే పరితపించి పోవుచుండెను. రమేంద్రుఁ డగపడుటచేతనే కాక యాతనిపేరు వినఁబడుటవలనఁగూడ సతీశుని హృదయ ముడికిపోవుచుండెను. రమేంద్రుఁడువచ్చి హేమాంగివిషయమై ప్రస్తావించుచున్నప్పుడు సతీశునకుఁ గోపము గలుగుట సహజమే— కాని యాతఁడు చిన్నబాబు నారోగ్యమునుగూర్చి యుపదేశించుటను గూడ వినఁజాలక సతీశచంద్రుఁ డున్మత్తునివలె విపరీతవర్తనుఁ డై పోవు చుండెను. క్రమముగా నాతనికిఁ దనభార్య తనకన్నులలో దుమ్ముగొట్టి రహస్యముగా రమేంద్రునితోఁగూడి ప్రణయలీలం దేలుచుండె నను సందేహము దృఢపడిపోవుచుండెను. ఆతఁడు నిరంతరమును హృదయము నందే యతిదారుణంబు లగునరకయాతనల ననుభవించుచుండెను. ఎప్పుడైన నొక్కసారియైన ననుమానపిశాచావిష్టులై, తత్కృతంబులగు దుస్సహాబాధానలజ్వాలల ననుభవింపనివారికి సతీశునిహృదయసంతాప మెంతదారుణమైనదో యించుకంతయును దెలియనే తెలియదు.

తుట్టతుదకు సతీశచంద్రుని యవస్థ విలక్షణముగాఁ బరిణమించిపోయెను. అతఁడిప్పుడు గేవలము పిచ్చివాఁడును గాఁడు—ప్రకృతిస్థుఁడునుగాఁడు.

ఒకనాఁటికంటె నొకనాఁడు చిన్నబాబున కారోగ్యము గలుగుచుండెను. రమేంద్రుఁ డిప్పుడు తఱచుగా సతీశునింటికి వచ్చుచుండుట లేదు. ఎప్పుడో యొకసారిమాత్రము వచ్చి పిల్లవానిని జూచి పోవుచుండెను. చిన్నబాబునకు మంచి యారోగ్యము గలిగెను. అందుచే రమేంద్రుఁడు ప్రతిదినమును వచ్చి యాతనిఁ జూచిపోవలసిన యావశ్యకత లేకుండెను.

చిన్నబాబు సంపూర్ణముగా నారోగ్యవంతుఁ డయ్యెను. ఒకనాఁడు రమేంద్రుఁడు సతీశునింటికి వచ్చి సంతోషముతో నవ్వుచు "నేనిక నిచ్చటికిఁ దఱచుగా రావలసినపని లేదు. నాకు సెలవు దయచేయింపవలయును" అని చెప్పి వెడలిపోయెను. సతీశచంద్రుఁ డాతని కెట్టిప్రత్యుత్తరమును జెప్పక యన్యమనస్కుఁడై యుండెను. అప్పుడాతనినోటినుండి "ఇంతకాలమున కీతనిసంబంధము వదలిపోయినది!" అనుమాటలు వెలువడియెను.

అప్పుడు హేమాంగి సతీశునిం గాంచి "ఔను. బిడ్డకంత తఱచుగా జబ్బుచేయుచుండెడిది. దైవానుగ్రహమువలన నిఁకవైద్యసాహాయ్యమక్కఱ లేకుండఁ జిన్నబాబు సుఖముగానున్నాఁడు! మన బిడ్డకు వైద్యముచేసినందులకు మనమేమియీయవలయునో బిల్లుపంపవలసినదని యాతనితోఁ జెప్పియున్నాను" అనియెను.

ఆ దినము సోమవారము. మఱునాఁడు మంగళవారమున సతీశచంద్రుఁడు భోజనము చేసినతరువాత భార్యం గాంచి "ఇన్నాళ్లనుండియు జిన్నబాబునకు జబ్బుగా నుండుటచే నవకాశములేక

యీ నగరమునందలి విశేషములను జూచుటకే లేకపోయితిని. నేఁడైనాఁ పట్టణమంతయును దిరిగి చూచివచ్చెదను" అనియెను.

సతీశచంద్రుఁడు నిజముగాఁ జిన్నబాబుమూలముననే యిల్లు విడువఁజాలకుండుటలేదు. అతఁడు తన మనోవికారముచేతనే యొక నిమిషమైనను వెలుపలికిఁ బోఁజాలకపోయెను. అందులకుఁ గారణము భార్య విషయమునంగలిగిన యతిఘోరతరంబగు ననుమానమే—ఇప్పుడు రమేంద్రుని రాకపోకల బాధవదలిపోయినది గదా యని యాతఁ డెల్లవిధముల నిశ్చింతుఁడై యుండెను. అందుచేతనే సతీశ చంద్రుఁడు భోజనముచేసి వీథిలోనికి వెడలిపోవుటకు సాహసింపఁ గలిగెను.

సతీశున కదివఱకొకనిమిషమైనను గృహము విడువఁజాల కుండుటకు ముఖ్యకారణ మేదియో హేమాంగి సంపూర్ణముగా నెఱింగియే యుండెను. కాని యామె యొక్కప్పుడును దనమనో భావమును సూచించియైన నుండలేదు. ఆమె తన మనసులోనిమాటను మనసునం దడంచుకొనుటయే గాని యెన్నఁటికైనను వెలువరించునట్టి స్వభావము గలది గాదు.

మఱునాఁడుగూడ సతీశచంద్రుఁడు భోజనమైన వెంటనే బయలు దేఱి యవ్వలికిఁ బోయెను. నాఁటి సాయంకాలపు రైలుబండినుండి దిగి సతీశచంద్రుని పిన్నయత్త తనకుమారుఁడగు సుధాంశుని వెంటఁ బెట్టుకొని సతీశుఁడు బసచేసియున్న యింటికి విచ్చేసెను. ఆమె బయలు దేఱుటకు ముందుగా నుత్తరము వ్రాయకపోవుటచే సతీశుఁ డానాఁడే నామె వచ్చునని యెఱుంగక యిల్లు విడిచి పోయియుండెను.

సాయంకాలమైపోయెను. ఇంకను సతీశుఁ డింటికిఁ దిరిగి రాలేదు. అప్పుడు వీథిలో నెవ్వరిదో యడుగులచప్పుడు వినఁబడియెను. అది విని హేమాంగి యాత్రముతో లేచి తనలో "ఆయనయే వచ్చు

చున్నట్లున్నది ! ఇంటిలో నున్న పెన్నత్తగారిని జూచి నిశ్చయముగా నెంతయో యాశ్చర్యపడెడువారు” అని యనుకొనుచుండెను.

కాని యా యడుగులచప్పుడు సతీశచంద్రునిది గాదు ! అంతలోఁ దలుపు దెఱచుకొని రమేంద్రనాథుఁడు లోపలఁ బ్రవేశించెను.

అయ్యో ! మరల రమేంద్రునిరాకయా ! హేమాంగి గుండెలు దడదడఁగొట్టుకొని పోవుచుండెను. సతీశచంద్రుఁ డింట లేనిసమయము నకు సరిగా రమేంద్రుఁడు వచ్చియుండెను. ఇఁకఁ దఱచుగా మీయింటికి రావలసినపనిలేదని చెప్పిపోయిన రమేంద్రుఁ డింతలోనే మరల వచ్చెను ! ఈ సమయమున సతీశచంద్రుఁ డింటికి వచ్చి తనయొద్దనున్న రమేంద్రునింగాంచి యేమనుకొనునోగదా ! హేమాంగిహృదయము బహువిధములఁ బరితపించిపోవుచుండెను. అప్పటి సంధ్యాతరళాంధకార మామెకన్నులలో నమావాస్య నిశీథమునందలి గాఢాంధకారముగాఁ బరిణమించెను. ఆమె గుండె లతితీవ్రముగఁ గొట్టుకొనఁదొడంగెను. తుద కామె యతికష్టముతో హృదయమును బదిలపఱుచుకొనియెను.

రమేంద్రుఁ డట్లు లోపలఁ బ్రవేశించినతోడనే హేమాంగిం గాంచి “చిన్నబాబు క్షేమముగా నున్నాఁడా ?” అని ప్రశ్నించెను.

హేమాంగి మందస్వరముతో “సుఖముగా నున్నాఁడు. జబ్బేమియును లేదు. ఇఁక మీయింటికి రావలసినపని లేదని మొన్నటి దినమున మీరే చెప్పితిరిగాదా ?” అనియెను.

రమేం : ఔను. ఇఁకఁ జిన్నబాబును జూడవలసిన యావశ్యకమేమియును లేదు. నేనిప్పుడు పనియుండి యీ వీథిని బోవుచుంటిని. ఒకసారి చూచి మఱిపోవుద మని తలంచి యిచ్చటికి వచ్చితిని. నేఁటి దినమున మంచువిస్తారముగాఁ బడుచున్నది. శీతకాలమునం దప్పుడప్పుడిచ్చట నీ విధముగనే మంచు గురియుచుండును. చీకటి రాత్రులలో

నీ మంచుమూలమున మఱింత గాఢాంధకారముగా నుండును. ఒకయడుగుదూరములో నున్నవారినిగూడఁ దెలిసికొనుటకు దృష్టిశక్తి లేకుండఁబోవును.

అని చెప్పుచు నాతఁ డొకకుర్చీని లాగికొని హేమాంగిపార్శ్వమునందు వైచికొని యందుఁ గూర్చుండెను. అప్పు డాతనిహృదయమునందుఁ బూర్వభావ మించుకంతయును లేనేలేదు. సతీశచంద్రుఁడు తన రాకపోకలంగూర్చి యనుమానపడుచుండెనను సంగతి నాతఁ డెంత మాత్రము నెఱుంగఁడు. ఆతనికి నిజముగా నప్పుడు హేమాంగియెడల మాతృభావమే యుండెను. అందుచేతనే యాతని కామెపార్శ్వమునందుఁ గూర్చుండుట కేమియును సందేహము లేకుండఁబోయెను. ఆతఁడు నగరమునందలి పెద్దమనుష్యులు నలుగురిలోనను నెట్లు మసలుచుండెనో యేకాంతముగ నున్నను హేమాంగికడ నట్లే ప్రవర్తించుచుండెను. ఇప్పు డాతఁ డామెను బూర్వపరిచిత యగు నాత్మబంధురాలిగా భావించుకొనుచుండెను—ఔను. ఇది యంతయును సత్యమే—కాని యాతఁడు సద్భావముతో నున్నను దననాథుఁడు లేనిసమయమునం దిట్లు వచ్చి కూర్చుండియుండుటచే హేమాంగి హృదయము తత్తఱిల్లిపోవుచుండెను. ఈ సమయమునందు సతీశుఁ డింటికి వచ్చి యిది యంతయుంగాంచినచో నేమని యనుమానించునో, యెట్టిదుర్భాషలాడి యవమానించునో యని యామె భయపడుచుండెను.

పాపమామె యింటికి వచ్చిన పెద్దమనుష్యుని బొమ్మని యెట్లు చెప్పఁగలదు ? ఉపాయాంతరముచే నాతనిఁ బంపివేయుదునని తలంచి "రమేంద్రబాబూ ! వచ్చినవారు రానేవచ్చితిరి. చిన్నబాబు నొకసారి చూచిపోఁగూడదా ?" అనియెను.

నాథ్యమైనంతనఱకు రమేంద్రుఁడు కొంతశీఘ్రముగ నవ్వలికిఁ బోయిన నంతమంచిదని హేమాంగి యాతురపడుచుండెను. కాని రమేంద్రుఁడుమాత్ర మంతత్వరగా వెడలిపోవుటకై యటను వచ్చి యుండలేదు. అప్పుడాతఁడు హేమాంగిం గాంచి "చిన్నబాబును నేనువెళ్లఁ బోవునప్పుడు చూచెదను. ఇప్పుడు తొందరలేదు. కూర్చుండుము!" అనియెను.

లేచినిలువఁబడిన యామె యిఁక నేమియుం దోఁచక యట్లే కూర్చుండెను. కాని యామెమనసు మనసులో లేదు. అయినను బెద్ద మనుష్యుఁడగు రమేంద్రునెదుట దనగుట్టుబయల్పడనీయక యెంతయో జాగ్రత్తగా మెలంగుచుండెను. పరమేశ్వరుఁ డిట్టివిపరీతసంఘటనములను గల్పించుచుండుట నిర్మలహృదయములకు నిశ్చలశక్తులను బ్రసాదించుటకే కాఁబోలును! అప్పుడు రమేంద్రుఁ డామెం గాంచి "సావధానవై కూర్చుండి వినవలయును. నీతో నొకమాట చెప్పవలసి యున్నది!" అనియెను.

ఆమాట విన్నంతనే యామె యులికిపడియెను. ఆమెతల తిరిగి పోవుచుండెను. నోట మాట వెలువడదయ్యెను. ; మౌనముతో నట్లె కూర్చుండియుండెను. కానియామె యాపాదమస్తకమును స్వేదసిక్తమై పోవుచుండెను. ఉత్తర క్షణమునం దెట్టి దుస్సహసంభాషణము వినవలసి వచ్చునో యని యామె భయపడిపోవుచుండెను.

అప్పుడు రమేంద్రనాథుఁడు మృదుస్వరముతో "నేనొక యతి రహస్యంబగు విషయముంగూర్చి నాశ్రేయముంగోరు నెవ్వరియాలోచనము నైనను గైకొనవలయునని యనుకొనుచున్నాను. నీవు చాల బుద్ధిమంతురాల వని నేనెఱుంగుదును. ఇతరు లందఱియాలోచనల కంటెను నీయుపదేశమే యమూల్యమైనదని నావిశ్వాసము. అందు చేతనే నాకతి ప్రధానంబగు నొక ఘనవిషయముం గూర్చి నీవుఁ దెలిపి

సి యాలోచనమును బడయఁ గోరుచున్నాను ! దయయుంచి తెలుప వలయును " అనియెను.

హేమాంగి యేమియు మాటాడఁజాలక పోయెను. చైతన్య విహీనయగు పాషాణ ప్రతిమవలె నామె యట్లే కూర్చుండి యుండెను.

## పంద్రెండవ ప్రకరణము

ఊరకుండుట మర్యాద గాదని హృదయము పరితపించి పోవుచుండెను. గాని యెంత ప్రయత్నించినను హేమాంగినోటినుండి మాట వెలువడ దయ్యెను. హృదయము బ్రద్దలై పోవునేమో యనునంతటి తీవ్రముగా నామె సకలాంగకములును గంపించి పోవుచుండెను. " రమేంద్రనాథుఁ డేవిషయమునుగూర్చి మాటాడఁ దలఁచుచున్నాఁడు ? ఆతనికి నాతో నాలోచింపవలసిన విషయ మేమున్నది ? అయ్యో ! ఈయుసందర్భసమయమున నా నాథుఁడు వచ్చునేమో గదా! ఇదివఱకే యనుమానపడుచున్న యాయనకీ సమావేశ మెంతబాధాకరముగా నుండునో ! ఇఁక నేమున్నది ? ఇదివఱకే యాతని హృదయమున రాఁజు కొనుచున్న క్రోధానల మిప్పు డొక్కసారిగాఁ బ్రజ్వరిల్లక మానునా ? పరమేశ్వరుఁడు నా హృదయమున కింకను నెట్టి సంతాపమును

గల్పించుకొనదలంచెనో ! నేనేమిచేయుదును ? ఈసంగతి యంతయును దెలిసి రమేంద్రుని బంపితివా ? ఎంతతప్పు ! గృహచ్ఛిద్రములను బయలు పఱచుకొనుట యెంతయవమానకరము !" అని యనేకవిధం బుల భావించుకొనియెను.

ఆమె యేమియు మాటాడక కూర్చుండి యుండుటం గాంచి రమేంద్రుఁడు మృదుస్వరముతో "ప్రఫుల్లకుమారబాబుతనయను నీవు చూచితివిగాదా ?" అనియెను.

హేమాంగికిఁ గొంచెము మూపిరి తిరిగినట్లయ్యెను. ఆమె చటాలున "చూడకేమి? వారు తఱచుగా మనయింటికి వచ్చుచుందురు. ఒకసారి నేనుగూడ వారియింటికిఁ బోయితిని. ఆబిడ్డ చాల నుత్తమురాలు !" అనియెను.

రమేం : అంతపరిచయ మున్నదని తెలియుటచేతనే నిన్నడిగితిని. ఆమె మంచిగుణవతియేనా ?

హేమా : అవును. మిగుల శాంతస్వభావము గలబాలిక. మిగులఁ జక్కనిపిల్ల. బాగుగఁ జదువుకొన్నది. ఎప్పుడును సంతోషముగా నందఱితోడను గలసిమెలసి యుండును—ఏమి ? ఆమెనుగూర్చి యింతగా నడుగవలసిన యావశ్యక మేమి కలిగినది ?

రమే : యేమియును లేదు. ఆమెవివాహవిషయమై యాలోచింప మాటాడఁ వలసియున్నది.

హేమా : ఆలాగా ! నీవామె కేదియైన సంబంధమును దలఁచితివా యేమి ?

రమేం : సంబంధము మాటాడుట గాదు. నేనే స్వయముగా నామెను బెండ్లియాడఁదలంచి యావిషయమై నీతో నాలోచించుటకై యిచ్చటికి వచ్చితిని.

హేమాంగి యతివిస్మయముతో రమేంద్రుని మొగమువంకఁ జూడఁదొడంగెను. కొంతసేపైనతరువాత నామె "సుశీల చాలచక్కని బిడ్డ—చాలగుణవంతురాలు !" అనియెను.

రమేంద్రనాథుఁ డామాట విని మందహాసము చేయుచు మృదు స్వరముతో "అట్లయినచో నేనామెను పెండ్లిచేసికొనవచ్చునా ? ప్రఫుల్లకుమారుఁ డీవిషయముం గూర్చి నాతోఁ బ్రస్తావించి యున్నాఁడు. అందుచేతనే యెల్లవిధముల నామేలుఁగోరియున్న నీయభిప్రాయమును దెలిసికొనుటకై నేనిచ్చటికి వచ్చియుంటిని" అనియెను.

హేమాంగి ప్రసన్నవదనముతో "ఈశుభవార్త వినుటవలన నాహృదయము పరమానందకందళిత మైనది" అనియెను.

ఆమె చెప్పినమాటలలో నెంతమాత్రము నసత్యము లేదు. ఆమె మనఃపూర్వకముగనే యిట్లు చెప్పెను. రమేంద్రనాథుఁడు తగిన కన్యను బెండ్లియాడి సుఖించుచున్నచో నిశ్చయముగా హేమాంగి కెంతయో సుఖముగా నుండును.

ఆ సమయమునందు వీథికిటికీచెంత గాఢాంధకారములో నెవ్వారి ముఖమో కాని కానవచ్చుచుండెను. ఆ వదనభంగి యంతయు నతి భయంకరమై యుండెను—విస్ఫారితంబులగు నయనంబులనుండి యగ్ని స్ఫులింగములు వెలువడుచుండెను—శిరోజము లపరిష్కృతములై యందందుఁ జెదరిపడి యుండెను — ఓష్ఠాధరములు కేవలమును వక్రములై యుండెను—ఏమియాభీషణవికృతాకారము ! వారెవ్వరు ? అది నిజముగా మానవవదనమా ? కాక పిశాచవక్త్రమా ? అది ప్రేత మూర్తి గాదుగద ?

హేమాంగిగాని, రమేంద్రనాథుఁడుగాని యా భీకరదృశ్యమును గాంచి యుండలేదు. వారు తమ యాలోచనలోనే మునిఁగి యుండిరి.

అప్పుడా పైశాచికమూర్తి వదనమునుండి యతిభీకరంబును, అర్ధస్ఫుటంబు నగువికృతశబ్దము వినిర్గతం బయ్యెను. ఆయుభయులును గూడ నాధ్వని నాకర్ణించి యదరిపడి గవాక్షమువంకఁ దమదృష్టులను మరలించిరి. కాని వారి కచ్చట నేమియు నగపడలేదు.

అప్పుడు హేమాంగి రమేంద్రునిం గాంచి భయముతో "ఈ భయంకరారావ మెట్లు పుట్టినది ?" అనియెను.

రమేం : చాలరాత్రి యైయుండును. గాఢాంధకారము క్రమ్ముకొని యున్నది. అందుపై దట్టముగా మంచు గురియుచున్నది. వీధిలో నెవ్వఁడో చీకటిలోఁ గన్నుఁగానక కాలుజారి పడిపోయెనేమో ! ఇఁకఁ బద ! చిన్నబాబు నొకసారి చూచి నేనింటికిఁ బోయెదను.

హేమాంగి సరే యనిచెప్పి చిన్నబాబుకడ కాతని వెంటఁబెట్టుకొని పోయెను. రమేంద్రుఁ డాబిడ్డను బాగుగఁ బరిశీలించి యారోగ్యముగనే యున్నాఁడని చెప్పి బయటికి వచ్చి సూచీభేద్యంబగు నయ్యంధకారమును, సాంద్రతమంబగు హిమంబును గాంచి మందహాసము చేయుచు " నేనీ సమయమునందు దారిలో నెట్టికష్టమును బడకుండ నిరపాయముగా నిల్లు చేరవలయునని యనుకొనుచున్నాను. కాని యెదుట నేమున్నదో యెఱుంగఁ బడనంతటి యీ గాఢాంధకారమునం దడుగడుగునకు నపాయములు తటస్థించుటకే యవకాశ మున్నది. అన్నిటికిని బరమేశ్వరుఁడే యున్నాఁడు. ఇఁక నేఁబోయి వచ్చెదను " అనిచెప్పి రమేంద్రుఁడు హేమాంగికడ సెలవు గైకొని యా కటికి చీకటిలోఁ గలసిపోయెను.

హేమాంగి యెప్పటికప్పుడే సతీశునిరాక కెదురుచూచు చుండెను. కాని యెంత రాత్రియైనను సతీశుఁ డింటికిఁ జేరుకొనలేదు. అంధకార బంధురమైయున్న యా భయంకర రాత్రిసమయమున

మార్గమధ్యమమునం దాతని కెట్టియపాయమైనను దటస్థింపలేదుగదా!--సతీశచంద్రునిరాక యాలస్యమైపోవుచున్న కొలఁదిని హేమాంగి హృదయము గలంగిపోవుచుండెను. ఆమె నిమిషమున కొకలాగై పోవుచు నధైర్యముచేఁ దడఁబడిపోవుచుండెను.—ఇఁక నామె నిశ్చింతయై యూరకుండఁజాలక తత్తరముతో నొకసేవకునిం బిలిచి "ఓయీ! నీవొకలాంతరును దీసికొని యూరిలో వెదకి మీబాబును దీసికొని రమ్ము!" అని యాజ్ఞాపించెను.

సేవకుఁడు వెడలిపోయెను. కాని యింతలోనే సతీశుఁడు వడి వడిగ నడచివచ్చి యొరులెవ్వరికి నగపడకుండఁ దమయింటిదొడ్డి తలుపుఁ దెఱచికొని మెల్లమెల్లఁగా లోపలఁ బ్రవేశించి యెవ్వరితోఁ గూడ నేమియును మాటాడకుండఁగనే చటాలునఁ దనపడకయింటి లోనికిఁ బోయి తలుపు మూసికొనియెను. ఏమది! సతీశుఁ డట్లు చేయుటకుఁ గారణమేమి? మరల నాతని హృదయమున ననుమాన వికారము గలిగినది గాఁబోలును! అదృష్టవశమున రమేంద్రుఁ డిచ్చట నున్న సమయమునందాతఁ డింటికి రాలేదు. చాలమంచిపని జరిగినది! అట్లే వచ్చియున్నచో నెట్టియనర్థకములు తటస్థించి యుండునో గదా!

హేమాంగి హృదయాంతరాళమునం దతిప్రచండంబును, అవి జ్ఞాతంబునగు గాలివాన యతిదుస్సహముగాఁ జెలరేఁగిపోవుచుండెను. ఆమె యాలోచనా ప్రభంజనములు తీవ్రవేగముతో విశృంఖలములై ప్రవహించి పోవుచుండెను. ఏమియుం దోఁచక యామె మఱియొక గదిలోనికిఁ బోయి కూర్చుండెను. ఆమెకన్నులు తిరిగిపోవుచుండెను; ఏమియు నగపడుటలేదు. ఏకకళామాత్రావశిష్టంబగు చంద్రమండలముం బోలె యామెవదనమంతయును వసివాఁడి విషాదచ్ఛాయాచ్ఛన్నమై పోయెను.

కొంతసేపైన తరువాత సతీశచంద్రుఁడు మరలఁ దలుపు దెఱచుకొని గదిలోనుండి వెలుపలికి వచ్చెను. అతఁడప్పుడు దోడిగికొనియున్నదుస్తులను విడిలి వేఱుదుస్తులను ధరించి యుండెను. హేమాంగి కదియంతయును విచిత్రముగను, వింతగను, సంశయాస్పదముగను, భయంకరముగను దోఁచుచుండెను. సతీశుఁ డట్లు వెలుపలికి వచ్చుటయేగాని యెవ్వరితోడనుగూడ నేమియును మాటలాడలేదు. చాలరాత్రియైనది. అప్పుడు హేమాంగి యాతని చెంతకు వచ్చి "భోజనమునకు వచ్చెదరా ?" అనియెను.

అప్పుడైనను సతీశచంద్రుఁడు తనభార్య కెట్టిప్రత్యుత్తరమును జెప్పకుండెను. అతని యప్పటియాకారవికారములం గాంచి హేమాంగి భయభ్రాంత యయ్యెను. అయినను నామె యించుక ధైర్యము తెచ్చుకొని మరల నాధునిం గాంచి "ఇంతదట్టముగా మంచుగురియుచున్న ఈచీకటిరాత్రివేళ నింతసేపటివఱకును మీరెచ్చట నున్నారు?" అని ప్రశ్నించెను.

ఈసారిమాత్రము సతీశచంద్రుఁడు మెద్దువారిన కంఠస్వరముతో "గాఢాంధకారమునఁ గన్నులగపడకపోవుటచేఁ ద్రోవదప్పిపోయితిని. వీథులన్నియును గ్రమముగాఁ దిరిగితిరిగి తుద కెట్లో యిల్లుచేరుకొనఁ గలిగితిని" అనియెను.

హేమా : అలాగా ? ఎంతపని జరిగినది ! ఇంతరాత్రివఱకు నేల యాలస్యము చేసితిరి ? చీకటిపడకుండఁగనే యింటికి రావలసినది—సరే—దైవానుగ్రహమున నిరపాయముగా నింటికి వచ్చితిరి. చాలరాత్రియైపోయినది. భోజనమునకు లెండు !

సతీ : అక్కఱలేదు — నాభోజనమైపోయినది. అందుచేతనే చీకటిపడకుండ బయలుదేఱుట కవకాశము గలిగినది కాదు.

హేమా : ఆలాగా ? అట్లయినచో మీరెక్కడ భోజనము గావించితిరి ? నిజమేనా ?

సతీ : నిజమే—ప్రఫుల్లకుమారుఁడు బలవంతపెట్టుటచే నాతని యింట భుజింపవలసివచ్చినది.

సతీశచంద్రుఁ డింటికి వచ్చెనని తెలిసినతోడనే యాతనిపిన్నత్త యాత్రముతో నాతనిచెంతకు వచ్చెను. ఇఁకఁ దప్పించుకొనుట కవకాశములేక యాతఁ డామెతోఁ గలసి యామాటయు, నీమాటయు నాడుట కారంభించెను. ఇంతవఱకును బండుకొనియున్న చిన్నబాబు తండ్రికంఠస్వరము నాలకించి చటాలున లేచి యొక్కపరుగున నాతని చెంతకు వచ్చి కూర్చుండెను.

అప్పుడు సతీశచంద్రునిపిన్నత్త యాపిల్లవానిం జూచి సంతోషముతో "సతీశా ! ఈప్రదేశము చాల నారోగ్యకరమైనది. అందుచేతనే యీచిన్నబాబున కింతత్వరలో జబ్బుకుదిరినది. మఱియొకచోటనైనచో నెన్నిచిక్కులు పడవలసియుండునో ! అదృష్టముచే నీనగరమునం దుండుటయు, తగినట్టివైద్యుఁడు లభించుటయుఁ దటస్థించినది" అనియెను.

ఆమాట విని చిన్నబాబు నవ్వుచు "అమ్మమ్మా ! నాకెంత జబ్బు చేసిననేమి ? ఏమియును జబ్బులేనిపిల్లవానివలెనే నేనాతని మందుల నన్నిటిని మ్రింగితి నని డాక్టరుబాబు నన్ను మెచ్చుకొని యున్నాఁడు. ఒకసారియైనను మందుమ్రింగుటకు నేనేడువలేదు" అనియెను.

సతీశుఁడు చటాలునఁ దలయెత్తి చిన్నబాబుం గాంచి "బాబూ! డాక్టరుగా రీమాట నీతో నెప్పుడు చెప్పినారు ?" అని ప్రశ్నించెను.

చిన్నబాబు కోమలస్వరముతో "ఇప్పుడే — నేఁటిసాయంకాలము డాక్టరుగారు మనయింటికి వచ్చినారు, నన్నుఁ జూపించుటకై యమ్మ యాతని లోనికిఁ దీసికొని వచ్చినది" అనియెను.

కన్నెలేడిపై కుఱుకఁబోవుచున్న క్రూరవ్యాఘ్రమువలె సతీశచంద్రుఁ డప్పుడు భార్యవంకఁదిరిగి యనలశరంబులంబోని తీవ్రదృష్టులచే నామె సకలాంగకములను దహింపఁజేయుచు "నేఁడు రమేంద్రుఁడు మరల మనయింటికి వచ్చినాఁడా?" అని ప్రశ్నించెను.

హేమాంగి యప్పుడు తనకంఠస్వరమును స్వాభావసిద్ధముగఁ జేసికొనవలయునని యనేకరీతులఁ బ్రయత్నించెను గాని యట్లు చేయఁ జాలకపోయెను. తుద కామె కంపితస్వరముతో "ఔను! నేఁడు సాయంకాలమైన తరువాత నాతఁడు మనయింటికి వచ్చినాఁడు!" అనియెను.

## పదుమూఁడవ ప్రకరణము

సతీశుఁ డున్మత్తునివలె లేచిపోయి పడకకుర్చీపైఁ గూలఁబడియెను. ఆతఁడు మఱియేమియును మాటాడలేదు. హేమాంగి యించుకదూరమున నిలిచి యుండెను. కొంతసేపైన తరువాత సతీశుఁడు క్రోధదూషితస్వరముతో "అలాగా? ఆతఁ డింక నిచ్చటికి రాఁడని గాదా?" అనియెను.

హేమాంగి సంత్రస్తంబును, సంతప్తంబును, సంక్షుభితంబును నగుహృదయముతో "ఔను! మొన్నటిదినమునం దాతఁడుగూడ నట్లే చెప్పినాఁడు. ఈవీథి నెవ్వరియింటనో పనియుండి పోవుచుఁ జిన్నబాబు నొకసారి చూచి మఱిపోవుదమని యెంచి వచ్చితినని చెప్పినాఁడు. అది గాక యింకొక విశేషవిషయమునుగూర్చి మాటలాడవలయుననికూడ మనయింటికి వచ్చినాఁడు. ఆ సంగతి వినియెదరా?" అనియెను.

ఇంతలో సతీశునికై వెదకఁబోయిన సేవకుఁడు వగర్చుకొనుచు లోపలఁ బ్రవేశించెను. ఆతనిం గాంచి సతీశుఁడు విరక్తభావముతో "ఏమది? అట్లువగర్చుచున్నావేమి? ఎక్కడకుఁ బోయితివి? ఇదిగో! నేనింటికే వచ్చితిని! చూచుచున్నావా?" అనియెను.

సేవకుఁడు వ్యాకులితహృదయముతో భయవిస్మయసూచక స్వరముతో "బాబూ! బాబూ!—ఎంతదారుణము—ఎంతఘోరము—ఎంతకష్టము——ఎంతపనిజరగినది——" అనియెను.

పడకకుర్చీపైఁ బరుండియున్న సతీశుఁ డప్పుడు లేచి కూర్చుండి సేవకుని ధిక్కరించుచు "మూఢుఁడా! ఏమిజరగినదిరా? చెప్పవు! ఏమిఘోరకృత్యము!" అనియెను.

సేవ: బాబూ! హత్య——మహాప్రభూ! అతిదారుణమైన హత్య జరగిపోయినది!

సతీశునిపిన్నత్తయు, నాతని భార్యయగు హేమాంగియు, సేవకుఁడు చెప్పిన యా భయంకరవార్త నాలకించి భయభ్రాంతులై పోయిరి; దాసదాసీజన మంతయు భయప్రకంపితమై పోవుచుండెను కాని సతీశచంద్రుఁడుమాత్ర మేమియును జలించుటయే లేదు. ఆతఁడు చల్లగాఁ బడకకుర్చీపైఁ బరుండి గంభీరవదనముతో, గంభీరస్వరముతో

"హత్యయా ! పిచ్చివాఁడా ! హత్య యెచ్చట జరిగినది ?" అని ప్రశ్నించెను.

సేవ : మహాప్రభూ ! రైలుస్టేషనునుండి వచ్చుత్రోవలో జరగినది—చాలభయంకరమైనహత్య !—

సతీ : అలాగా? ఎట్లు జరిగినది? అచ్చట నీకాసంగతి యేమైనను దెలిసినదా ?

సేవ : బాబూ ! తెలిసినది ! అచ్చట నెందఱోజనులు గుంపు గూడి చెప్పుకొనుచున్నారు ! ఒకపెద్దవర్తకుఁ డెవ్వఁడో తనయంగడినుండి విశేషధనమును దీసికొని యొకయెద్దుబండినెక్కి వచ్చుచుండఁగా నెవ్వరో దుర్మార్గులు వచ్చి యాతనిని హత్యగావించి యాధనము నెత్తికొని పాఱిపోయినారఁట ! ఈ సుధుపురమునందలి ప్రజలందఱు నిట్లే చెప్పుకొనుచున్నారు !

• సతీ : అలాగా ! పొమ్ము! పిచ్చిగాడిదా! అవలకుఁబొమ్ము?—అట్లు చెప్పుకొనుచున్నట్రాగుబోతు లందఱు నెక్కుడివారురా !

సేవకుఁడు తనప్రభునిచే నీవిధముగా ధిక్కరింపఁబడి యటనుండి యొక్కపరుగున నవ్వలికిఁ బోయెను. సతీశచంద్రుఁ డట్లే సర్సీపైఁ బరుండి కన్నులు మూసికొని "ఆహా ! ఇంకను నొకటిరెండుగంటల కాలమైనను గడవకుండఁగనే లోకులదృష్టిలో నొకవిషయము మఱి యొకవిధముగా నెట్లు మాఱిపోయినదో చూడుము ! హత్యజరిగిన మాటయేమో సత్యమే—కాని యాచంపఁబడినవాఁడు వర్తకుఁడును గాఁడు—ఆతఁ డెద్దులబండినెక్కి వచ్చుటయును లేదు—దొంగ లాతని గొట్టి ధనము దోచుకొనిపోవుటయును లేదు—కేవల మిది యంత యును గల్పన — ఇంతస్వల్పకాలములోనే లోకులకంఠములనుండి

యీ చిత్రచరిత్రమంతయు నెట్లువ్యాపించినదో చూతుము !" అని యనుకొనియెను.

ఆమాట లాలకించి సతీశునిపిన్నత్త యాత్రముతో "బాబూ ఈహత్యావృత్తాంతముంగూర్చి నీవిదివఱకే వినియుంటివా?" అనియెను.

సతీ : ఔను ! నేనింటికి బయలుదేఱి వచ్చుచుండఁగాఁ ద్రోవలో నిప్పుడే వినియుంటిని.

హేమాంగి యపరిపక్షి "అలాగా ! అట్లయినచో నంతటి దారుణహత్యనుగూర్చి మీరింతవఱకును జెప్పనేలేదేమి?" అనియెను.

సతీ : చెప్పుటకేమున్నది ? పెండ్లియా ? పేరంటమా ? హత్యావృత్తాంత మేమిసంతోషవార్త యని చెప్పుదును ?

హేమాంగి భయముచే వడఁకుచు "ఉచంపఁబడిన వారెవ్వరు? మీకేమైనను తెలిసినదా ?" అనియెను.

సతీ : ఆ. అక్కడఁజేరియున్న పెద్దమనుష్యులమాటలను బట్టి నే నప్పుడే తెలిసికొన్నాను.

హేమా : మరణించినయాతఁ డెవ్వఁడు ? ఈయూరివాఁడేనా ? ఆతని మీరెఱుఁగుదురా ?

సతీ : ఎఱుఁగుదును——పాపము——! మన డాక్టరుబాబు రమేంద్రుఁడే——ఆతనియింటియెదుట గేటుప్రక్కనే యెవ్వరో గాని యాతని జంపి పడవైచి పోయిరి !

అతిదారుణంబును, భయావహంబును నగునీవార్త నాలకించి నంతనే హేమాంగికోమలహృదయ మేవిధముగా సంక్షుభితంబై పో యెనో వర్ణింపఁజాలము——ఆకస్మికముగ నామెవదనమండలము వెల్లనై పోయెను——శరీరమంతయును వివర్ణమై, కంపితమైపోవుచుండెను—— ఆమె యుచ్ఛ్వాసనిశ్వాసములు స్తంభితములై పోయెను —— అకటా !

ఎంతటిఘోరవార్త! నేటిసాయంకాలమునందే రమేంద్రుఁ డీయింటికి వచ్చి యామెతోఁ జాలసేపటివఱకును సంభాషించి పోయియుండెను-- కొలఁదిసేపటి క్రిందటనే యాతఁడు తన పెండ్లివిషయముంగూర్చి చెప్పియుండెను—అయ్యో! పాపము! అట్టిరమేంద్రుఁ డిఁక లేఁడు!— ఈ ప్రపంచమునందే లేకుండఁబోయెను! హంతకులచే వధింపఁబడి పోయెను!

హేమాంగి హృదయాంతరాళమునందు నిమిషనిమిషమునకును వేలకొలఁది యాలోచనములుద్భూతంబులై మనోవేగమునఁ బరిభ్రమించి పోవుచుండెను. వర్షాప్రభంజనాహతులచే నాకాశంబు వఱకు నెగసిపడుచున్న సముద్రతరంగములవలె నుద్వేలితంబులగు నయ్యాలోచనా పరంపరలమధ్యమునం దామెకు వేలకొలఁది భయంకర దృశ్యములు గోచరించుచుండెను. హృదయమును సుస్థిరముగాఁ జేసికొని యాలోచించుకొనుశక్తి యామెకు లేకుండఁబోయెను. ఆమె యంతరంగసాగర మిప్పుడు కేవలమును బడబానల సంక్షుభితమై పోవుచుండెను!

అప్పుడు సతీశచంద్రుని పిన్నత్త హేమాంగిం గాంచి "అమ్మా! ఎంతపని జరగినది! ఆడాక్ట రెవ్వరు?" అని ప్రశ్నించెను.

హేమాంగి యామెప్రశ్నకుఁ బ్రత్యుత్తరము చెప్పఁజాలకుండెను. ఆమె కిప్పుడు మాటాడుటకే శక్తిలేకుండెను. అప్పుడు సతీశచంద్రుఁడు పిన్నత్తంగాంచి "ఆతఁ డీనగరములోనివాఁడే! మన చిన్నబాబునకు మందిచ్చిన డాక్టరాతఁడే—చిన్నబాబునకు జబ్బుగా నున్నప్పు డాతఁడు తఱచుగా మనయింటికి వచ్చుచుండెడివాఁడు. ఈశ్వరానుగ్రహమున బిడ్డకు సంపూర్ణముగ నారోగ్యము గలిగినది. ఇఁక నేనీయింటికి రావలసినపని లేదని యాతఁడే చెప్పి పోయినాఁడఁట! కాని నేఁడేకారణముచేతనో మరల వచ్చినాఁడు! పాప మాతఁ

డిచ్చుటినుండి బయలుదేఱి తనయింటికి మరలిపోవుచుండఁగా మార్గ మధ్యమునందే యాతని నెవ్వరో చంపివైచిరి! చాలమంచివాఁడు! ఏమయిననేమి! ఏనాఁటిపాపముచేతనో యాతని కిట్టిదుర్మరణము గలిగినది!" అనియెను.

సతీశునిపిన్నత్త భయవిస్మయావిష్ట హృదయముతో "నాయనా! అంతమంచివానిని—లోకోపకారిని నిష్కారణముగాఁ జంపి పాఱవైచుట కాక్రూరాత్ములకుఁ జేతు లెట్లు వచ్చినవో?" అనియెను.

సతీశుఁడు విశేషముగా నేమియును మాటాడక "అత్తా! ఆ సంగతు లన్నియును మన కెట్లు తెలియును? వారికి వానికి నేమి విరోధము లున్నవో?" అనియెను.

పిన్నత్త : బాబూ! ఔను! ఉండవచ్చును. లేకున్న నింతటి ఘోరకృత్యమును జరుగవు. నీవీసంగతి నెవ్వరివలనఁ దెలిసికొంటివి?

సతీ : ఈ సమాచార మంతయు నప్పుడే నగరము నాలుగు మూలలను వ్యాపించి పోయినది. నేనింటికి బయలుదేఱి వచ్చు చుండఁగాఁ ద్రోవలో నిరువురు పెద్దమనుష్యులు నాకగపడిరి. వికల హృదయములతో నగర్చుకొనుచుఁ బరుగుపరుగునఁ బోవుచున్నవారిం గాంచి యది యేమని ప్రశ్నించితిని. వారప్పుడు వడఁకుచున్నకంఠము లతో డాక్టరుఘోరమరణవార్తను దెలిపి తిరిగిచూడకుండఁగనే వడి వడిగా ముందటికిఁ బోయిరి.

పిన్న : అయ్యో! పాపము!—సరేకాని యెవ్వఁడో యొక గొప్పవర్తకుఁడు హత్యగావింపఁబడియెనని మనసేవకుఁడు చెప్పినాఁడే! ఒక్కరాత్రి యొక్కటేవిధముగా రెండుహత్యలు జరగుట యసంభ వము! ఆ చంపఁబడినవాఁడు మనసేవకుఁడు చెప్పినట్లు వర్తకుఁడే కావచ్చును—లోకోపకారియగు డాక్టరు నూరక యెవ్వరు చంపుదురు?

చీఁకటిలో సరిగా గుర్తింపలేక జనులు పొరపాటుపడి యిట్లనుకొను చుండిరేమో !

సతీశుఁడు మఱియేమియు మాటాడక సంక్షేపముగా "అట్లయిననుగావచ్చును" అని చెప్పి పడకకుర్చీపైఁ బరుండి నిద్రపోయెను. ఆగందరగోళములో నాతఁడు తన పిన్నత్తతోఁగూడ నెవ్వరువచ్చిరో యని యడిగి తెలిసికొనుట గూడ మఱచిపోయెను.

క్రమక్రమముగా దాసదాసీజనమంతయును నిద్రలో మునిఁగి పోయెను. సతీశచంద్రుఁడు కుర్చీమీఁదనే పరుండి నిద్రించుచుండుటం గాంచి యాతని నచ్చటనే యొంటిగా విడిచి తాను పడకటింటికిఁ బోయి శయనింపఁజాలక హేమాంగి యచ్చటనే కూర్చుండి తన పినతల్లితో నామాటయు, నీమాటయు నాడుచుఁ గాలక్షేపము సేయు చుండెను.

ఇంచుమించుగా రాత్రి పండ్రెండుగంటలై పోయెను. అప్పు డెవ్వరో గాని వీధితలుపు గొట్టి పిలుచుచున్నట్లు వినవచ్చెను. అది విని యా స్త్రీలిరువురునుగూడ నదరిపడి లేచిరి. "ఇంతరాత్రివేళ నిది యేమి !" అని వారికి భయము గలిగెను. అప్పుడే యతిదారుణంబగు హత్యావృత్తాంతమును వినుటవలన వారి కతిసామాన్యంబులగు విషయములు గూడ భయంకరములుగనే గోచరించుచుండెను.

తనతల్లిని సతీశునింట దిగఁబెట్టి యామె కుమారుఁడగు సుధాంశుఁడు తన పినతండ్రి నొకసారి చూచివచ్చుటకై గిరిధీకిఁ బోయి యుండెను. పోవునప్పు డాతఁడు పినతండ్రియొద్ద నొకటిరెండుదినము లుండి మఱివచ్చెదనని చెప్పి యుండెను. ఆతఁ డింతలోఁ దిరిగివచ్చునని వారెట్లు భావింపఁగలరు ? కాని యర్ధరాత్రివేళ వీధిగుమ్మము నొద్ద నెవ్వరో నిలిచి బలముగాఁ దలుపుగొట్టి పిలుచుచుండిరి !

వారెవ్వరై యుందురు ? ఆ చప్పుడుచే నంతలో సతీశునకు నిద్రాభంగ మగుట వలన నాతఁడు పడకకుర్చీనుండి లేచి కూర్చుండెను.

## పదునాలుగవ ప్రకరణము

ఆదేపనిగా వీథితలుపు గొట్టు చుండుటచేఁ బెద్దచప్పు డగు చుండెను. ఆ భయంకర శబ్దమువలన నింటిలోని సేవకులకందఱకును గూడ నిద్రాభంగ మయ్యెను. అప్పుడొక సేవకుఁడు లేచిపోయి తలుపు తెఱచెను. తత్క్షణమే సుధాంశుఁడు లోపలఁ బ్రవేశించెను. ఆతనిం గాంచినతోడనే యాతనితల్లి "నీవా నాయనా ! ఇంతలోనే తిరిగి వచ్చితి వేమి ?" అనియెను.

సుధాం : అమ్మా ! పినతండ్రిగారు గ్రామములో లేరు. ఏడెనిమిది దినములవఱకును నింటికి రారఁట ! అన్నినాళ్లవఱకును నేనచ్చట వేచియుండు టెందులకు ? అందుచేతనే తిరుగుబండిలో బయలుదేఱి వచ్చివేసితిని. ఆయన లేకుండుటచే నట నుండుట నాకిష్టము లేకపోయినది.

తన పిన్నత్తగా రొంటిగా నిచ్చటికి రాలేదని సతీశుల కప్పుడు బోధపడియెను. ఆమె యొంటిగ వచ్చుటగూడ నసంభవము గదా !

సుధాంశుఁడు నిశ్చయముగా నామెతో వచ్చియుండునని యూతఁడిది వఱకే యూహించుకొనియెను. కాని యేసంగతియు నడిగి తెలిసికొనుట కాతని కవకాశము లేకపోయెను. ఆతనిహృదయ మనేకవిషయములం గూర్చి యాలోచనా పరంపరలలోఁబడి కొట్టుకొనిపోవుచుండెను. ఇంటికి వచ్చినవారింగూర్చి పరామర్శింపకుండుట మర్యాదగాదని యాతని కప్పుడు తోఁచెను. అందుచేతనే సతీశుఁడు సుధాంశునిం గాంచి "బావా! నీకీగాఢాంధకారములోఁ ద్రోవ యెట్లు తెలిసినది? అబ్బా! ఎంతశ్రమపడి వచ్చితివో!" అనియెను.

సుధాం: నేను గిరధీనుండి బయలుదేఱునప్పటికే చీకటిపడి పోయినది! కాని యిక్కడకుఁ జేరునప్పటి కింతమంచుచే నంధకార బంధురమై పోవునని నాకెట్లు తెలియును? స్టేషనునుండి మనయింటికి బయలుదేఱునప్పుడు చాలచీకటిగా నున్నదని భయపడితిని. కాని యదృష్టవశమున నాకాకష్టము లేకపోయినది.

సతీ: ఎందుచేత? నీకు సహాయముగా నెవ్వరైన వచ్చిరా యేమి? ఏమిజరిగినది?

సుధాం: చాలమందిప్రజలు లాంతరులను జేతులతోఁ బట్టు కొని పరుగుపరుగున వీథులవెంటఁ దిరుగుచుండిరి. ఆలాంతరుల వెలుఁగువలన నాకు మహోపకారమయ్యెను. ఆ వెలుఁగులో దారి తెలిసికొని నేను సుఖముగా నిల్లు చేరఁగలిగితిని.

ఆమాట విని యాతని తల్లి "బాబూ! సరేకాని—నీవింత రాత్రివేళ వచ్చి యెవ్వరినైనఁ బిలువవలయునుగాని యూరక తలుపు బ్రద్దనుగొట్టుట యెంతతప్పు! ఆ ఘోరశబ్దము విని మేమందఱము నెంత భయపడిపోయితి మనుకొన్నావు!" అనియెను.

సుధాం : అమ్మా ! అదియేమి ? అంతగా భయపడిపోవుట యెందులకు ?

తల్లి : భయముగాదా నాయనా ! నీకుఁ దెలియలేదు గాఁబోలును ! ఈ గాఢాంధకారములో నీరాత్రి యొకభయంకరమగు హత్య జరగిపోయినది. !

సుధాంశుఁడు తత్తరముతో "అలాగా ? ఎప్పుడు ? ఎక్కడ ?" అని ప్రశ్నించెను.

తల్లి : బాబూ ! ఎక్కడనో యైన నింతభయ మేల ? ఈ మధుపురమునందే—మన కవ్వాలివీథినే—

సుధాం : ఆలాగా ? అందుచేతనే గాఁబోలును జనులందఱును లాంతరులను జేతఁ బట్టుకొని వీథులవెంటఁ బరుగులెత్తుచున్నారు ! అంతయుఁ జూచుచు నేనూరక యింటికి వచ్చుటయేగాని యీ గందరగోళమంతయు నేమని యొక్కరినైనను నడుగనే లేదు—బావా ! ఆ చంపఁబడినవా రెవ్వరో నీకేమైనఁ దెలిసినదా ?

సతీ : తెలిసినది. ఆతఁ డీనగరమునందుఁ బ్రసిద్ధిగాంచియున్న యొకడాక్టరు !

సుధాంశుఁ డాశ్చర్యముతోఁ గన్నుల నింత చేసి "ఆలాగా ? ఎంతటిఘోరకృత్యము !" అనియెను.

అప్పు డాతనితల్లి సుధాంశుం గాంచి "బాబూ ! మనచిన్న బాబునకు మందిచ్చి జబ్బు గుదిర్చినడాక్టరే—నేఁటిసంధ్యాసమయము నందుఁగూడ నాతఁ డిచ్చటికి వచ్చి చూచిపోయినాఁడు !

సుధాం : అయ్యో ! పాపము ! చంపఁబడినవాఁ డాతఁడేనా ? ఎంతపని జరగినది ! మనడాక్టరేనా ?

తల్లి : ఔను. కొంతరాత్రివఱకు నాతఁ డిచ్చటనే యున్నాఁడు-హేమా! ఎనిమిదితొమ్మిదిగంటల వఱకును రమేంద్రబాబు మన యింటనే యున్నాఁడుగదా?

ఆమాట విని సుధాంశుఁ డదరిపడి "అమ్మా! ఏమంటివి? రమేంద్రబాబా?—ఆ డాక్టరు పేరు రమేంద్రుఁడా? — అట్లయినచో నాతఁడు మన రమేంద్రబాబు గాడుగద?—" అని యాతఁడు హేమాంగివంకఁ దిరిగి "అక్కా! ఆతఁడేనా?" అని యడిగెను. అప్పుడాతని తల్లి విస్మయాక్రాంత హృదయముతో "మనరమేంద్ర బాబా?—ఆతఁ డెవ్వఁడు నాయనా!" అనియెను.

సుధాం : అమ్మా! నీవెఱుఁగవు. అక్క కాతనిసంగతి తెలియును. కలకత్తాలో నున్నప్పు డాతఁడు తఱచుగా, అక్కయొద్దకు వచ్చుచుండెడివాఁడు! ఈమెకు నాతనికిని జాల పరిచయమున్నది. ఆతఁడు నన్నుఁగూడ నెంతయోగౌరవముతోఁ జూచుచుండెడివాఁడు—అక్కా! ఆతఁడేనా యీతఁడు?

సతీశచంద్రుఁడు గంభీరస్వరముతో "ఔను!—ఆ రమేంద్రుఁడే యీ డాక్టరు రమేంద్రబాబు!" అనియెను.

సుధాంశుఁ డదరిపడి "ఆ రమేంద్రబాబేనా? అయ్యో! పాప మాతఁడు కలకత్తాలో నున్నప్పుడు నన్నెంతయో ప్రేమతో నాదరించుచుండెడివాఁడు! చాల మంచివాఁడు! ఎంతపని జరిగినది! అంతటి యుత్తమున కెట్టిఘోరమరణము తటస్థించినది!" అనియెను.

సతీ : ఔను. ఆతఁడే—కొన్నాళ్లనుండి యాతఁ డీనగరము నందు డాక్టరుపని చేయుచున్నాఁడు.

సుధాంశుని వదనమండలము కేవలమును విషణ్ణమైపోయెను. ఆతఁడు నిశ్చయముగా నొకప్పుడు రమేంద్రనాథు ననేకవిధములఁ బ్రేమించి యుండెను. అట్టి ప్రేమాస్పదుని దారుణమరణమున కాతని

హృదయము జాలిచే గొట్టుకొని పోవుచుండెను. అప్పు డాతఁడు హేమాంగిం గాంచి “ అక్కా ! రమేంద్రబా బీనగరమునం దున్నాఁడని యెఱింగియుండియు నా పేర నొక యుత్తరమైనను వ్రాసితివి గావేమి ? అట్లు వ్రాసినచో మరణింపకుండఁగనే యాతని నొకసారి చూచు భాగ్యము నాకుఁ దటస్థించి యుండును గదా ! ” అనియెను.

అప్పు డాతని తల్లి సుధాంశుని గాంచి “ అయ్యో నాయనా ! ఇంతలోనే యాతఁడు చచ్చిపోవు నని యెవ్వరనుకొన్నారు ? ఇంతపని జరుగు నని ముం దెట్లు తెలియును ? ” అనియెను.

సుధాం : ఆతఁడు చాల మంచివాఁడమ్మా ! ఆతనికి నే ననిన నెంతగౌరవ మనుకొన్నావు ?

తల్లి : అంత మంచివాఁడా బాబూ ! అందుచేతనే యిట్టి కష్టము ! లోకమునందు మంచివారికే మహత్తరము లగు విపత్తులు సంభవించుచుండును !

సుధాం : ఆతఁ డెంత యుత్తముఁడో అక్క నడుగుము ! ఈ బావకును, అక్కకును దైవవియోగ ముంటచేఁ బెండ్లి యైనది— అట్లుగానిచో నిశ్చయముగా మనయక్క రమేంద్రుని బెండ్లియాడ వలసినదే—నే నప్పటికిఁ జిన్నవాడనే గాని—అప్పటి యెల్లవిషయములును నాకుఁ దెలియుచునే యుండెడివి——అక్కా ! యథార్థము చెప్పితిని ! నీవు కోపగించుకొనవలదు——

అప్పుడు సుధాంశుని తల్లి తన కుమారుఁడు చెప్పినమాట లాలకించి యులికిపడియెను. ఆనిమిషములో నామెకుపూర్వపువిషయము లన్నియు నొక్కసారిగా స్మృతిగోచరంబు లయ్యెను. హేమాంగీ రమేంద్రుల యన్యోన్య ప్రణయచరిత్రముంగూర్చి యామె యాలకించి యుండెను. ఒకరినొకరు ప్రాణములకంటె నధికముగఁ బ్రేమించుకొని

యున్నట్లామె స్పష్టముగా నెఱుంగును. కేవలము దరిద్రుఁడను కారణము చేతనే హేమాంగి యాతని పెండ్లియాడ లేదు. అంతేకాని యితర కారణంబేమియును లేదు. ఆ రమేంద్రుఁడును, ఈ నగరమునందు డాక్టరుపని చేయుచు నిరాత్రి మరణించియున్న రమేంద్రుఁడు నొక్కఁడే యని వినుటవలన నామె హృదయమునం దిప్పుడొక సంశయము గలిగెను. కాని దానింగూర్చి భావించుటకుఁగూడ నామె భయపడి పోవుచుండెను.

అప్పటి కప్పుడే చాలరాత్రియై పోయెను. అందఱిహృదయ ములు గందరగోళముగనే యుండెను. అయినను నాఁటిరాత్రి వారెల్లో తమతమశయ్యలం జేరి నిద్రించిరి. ఎవ్వరెవ్వరి కేయేదుస్స్వప్నములు గలిగినవో గ్రహించి యెవ్వరు వ్రాయఁగలరు? ఆరాత్రి వారికి నిదురలోకంటె మేలుకువలోనే యనేకదుస్స్వప్నములు దోఁచు చుండెను!

## పదునేనవ ప్రకరణము

సుధాంశుఁడు శయ్యపైఁ బరుండినంతమాత్రముననే హాయిగా నిద్రపోయెను. కాని యాతని తల్లికిమాత్రము నిద్ర పట్టలేదు. చిర కాలమునుండి సతీశునింటియందుఁ బని చేయుచు నింటిలోని దాని వలెనే మెలంగుచున్న పెద్దదాసి యప్పుడు తంబాకును తయారుచేయుచు

సుధాంశుని తల్లిం గాంచి "అమ్మా! ఈ ఘోరవార్త విన్నది మొదలు కొని భయముచే నా గుండెలు కొట్టుకొని పోవుచున్నవి. ఎంత ప్రయత్నించినను నిద్ర పోఁజాలకున్నాను!" అనియెను.

తల్లి : ఔను! నిజమే— మఱియొకరైనచో నంత భయపడ వలసిన పనియే లేదు—అతఁ డిచ్చటినుండియే రాత్రి చీకటిలో బయలుదేఱి పోవుట ఆ వెనుకనే యింతటి ఘోరకృత్యము జరుగుట— భయము గాదా?

దాసి యదరిపడి "ఏమమ్మా!—ఇచ్చటినుండి యెవ్వరు వెళ్ళి పోయిన తరువాత?" అని ప్రశ్నించెను.

తల్లి : ఎవ్వ రనియెదవేమి? ఆ డాక్టరుబాబు రాత్రి యిక్కడ నుంచియే గాదా పోయినాఁడు!

దాసి : ఔను—డాక్టరుబాబు పోవుటకును, ఈఘోరకృత్యము జరగుటకును, మనము భయపడుటకును సంబంధ మేమున్నది?

తల్లి : అయ్యో! నీ వేమి విన్నావు? నీ కేమియును దెలియనే లేదా? మన సేవకుఁడు వచ్చి వీధిలో నెవ్వరో దొంగ లొకవర్తకుని హత్య గావించి పోయినారని చెప్పినసంగతి మాత్రమే నీ వెఱుఁగుదువు గాఁబోలును! అది గాదు. ఆ హత్య గావింపఁబడినవాఁడు మన డాక్టరు రమేంద్రనాథుఁ డఁట!

దాసి నివ్వెఱపడి "డాక్టరు బాబా! అది యేమి? ఈ సంగతి యెవ్వరు చెప్పినారు?" అనియెను.

తల్లి : మన సతీశుఁడే! అతఁ డింటికి వచ్చుచుండఁగా ద్రోవలో నీవార్త యాతని కెవ్వరో చెప్పినారఁట!

దాసి : బాబు వచ్చి చెప్పినారా? ఆయన కీసంగతి తెలియఁ జేసినవా రెవ్వరో? ఒకవర్తకుఁడు చంపఁబడినట్లు మనవంటవాఁడు

రూఢిగాఁ దెలిసికొని వచ్చియున్నాఁడు. ఆ చంపఁబడినవాఁడు వర్తకుఁడే కాకయున్నచో లోకుల కంతయసత్యము చెప్పవలసిన యావశ్యక మేమున్నది ?

తల్లి : మనవంటవాఁడు పొరపాటుగా విని యుండును—సతీశుఁ డెల్లసంగతులను బాగుగాఁ దెలిసికొని వచ్చినాఁడఁట !

దాసి : అట్లు కాదమ్మా ! మనబాబుగారే పొరపాటుగా విని యున్నారు. చచ్చి పడిపోయియున్న యావర్తకుని గన్నులారఁ జూచి వచ్చినవారివల్లనే మనవంటవాఁ డెల్లసమాచారములను దెలిసికొని వచ్చినాఁడు ! మీయందఱియెదుటను భయపడి యాతఁడు సర్వవృత్తాంతమును సంపూర్ణముగాఁ దెలుపుటకు సాహసింపఁజాలక పోయెను. కాని మాకంతయును స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. అయ్యో ! పాపము ! డాక్టరుబాబును జంపివైచుటకుఁ గారణ మేమున్నది ? అమ్మా ! ఆతఁడు నిజముగా మానవుఁడు గాఁడు. దేవతాస్వరూపుఁడు !

తల్లి : ఔనఁట ! మా సుధాంశుఁడుగూడ నాతఁ డెంతో యుత్తముఁ డనియే చెప్పినాఁడు.

దాసి : ఔనమ్మా ! ఈ పట్టణములో విశుద్ధచరిత్రుఁడును, ఉదారహృదయుఁడు నగురమేంద్రబాబును బ్రేమింపనివా రెవ్వరును లేరు—కాని—

తల్లి : అదేమి ? "కాని—" అని నీ వనుటవలన నెవ్వరో యాతని ద్వేషించువా రున్నట్లును, వారిని నీ వెఱిఁగియున్నట్లు నుద్యోతక మగుచున్నది—చెప్పుము ! వా రెవ్వరు !

దాసి : అమ్మా ! కేవలము మనబాబుగా రొక్కరికి మాత్రమే యాతని గౌరవము నయనకంటకముగా నుండును ! మాయజమానురాలి కొఱకుఁ జాలకాలముక్రిందటనే యా యిరువురి హృదయములందును

బరస్పరభేదభావములు పుట్టినవి. నేను హేమకుమారబాబుగారికిఁ బ్రాంత దాసినే కావున నాకెల్లసంగతులును స్పష్టముగాఁ దెలియును-కాని మా హేమాంగితల్లిని బెండ్లియాడినతరువాతనుండి మేమిక్కడకు వచ్చువఱకును మాత్రము సతీశబాబు హృదయమునం దాభేదభావ మించుకంతయు నాకగపడలేదు—ఏమి చెప్పుదునుతల్లీ! ఈయూరు వచ్చితిమి! ఆనాఁడే మొదలు! మాబాబుగారి స్థితిగతు లన్నియును వ్యత్యస్తములై పోయినవి!

తల్లి : కాని మా హేమమాత్రము సాధారణ యువతులతోఁ బోల్పఁదగినది గాదు! ఏమందువు?

దాసి : కాదు — కాదు — చిన్నప్పటినుండియు నామె హృదయమును నే నెఱుఁగనా? ఆమె మనసునందుఁ బూర్వ మెట్టి భావ మున్నను బెండ్లియైనది మొదలుగ నామె సతీశబాబును బ్రాణముకంటె నధికముగఁ బ్రేమించుచునే యున్నది.

తల్లి : హేమాంగి రమేంద్రుని మరలఁ జూచుట యీ నగరము నకు వచ్చిన తరువాతనేనా? కాక యింతకుముం దెప్పుడైనఁ జూచినదా?

దాసి : లేదు — పెండ్లియైనతరువాత నామె రమేంద్రుని దర్శించుట కిదియే మొదటిసారి! ఈయూరు వచ్చిన తరువాతనే యాతని జూచుట తటస్థించినది. చిన్నబాబు వీథియరుఁగుమీఁదినుండి పడుటయే దీని కంతకును గారణము! ఏమైననేమితల్లీ! మాకిచ్చట నుండుట కెంతమాత్రము నిష్టముగా లేదు—ఎట్లయిన నీనగరమునుండి తప్పించుకొని పోయినచోఁ బ్రదుకుదుము!

* * * * * *

రాత్రి శయనింపఁబోవునప్పుడు హేమాంగి సతీశునిం గాంచి "విన్నారా! ఇప్పు డామాట యనుకొనవలసినయావశ్యక మేమియును లేనేలేదు—కాని—అతఁడు నిజముగాఁ బెండ్లియాడుటయే తటస్థించి నచో నిప్పటియవస్థ యంతయు నెంతదారుణముగా నుండును!" అనియెను.

సతీశునియాలోచన చాలదూరమువఱకును బోయెను. దురదృష్ట వశమునఁ దాను రమేంద్రునే పెండ్లియాడినచోఁ దనకిప్పుడు భరింప శక్యముగానిదురవస్థ సంభవించునుగదాయని హేమ యనుకొనుచున్న ట్లాతఁడు భావించుకొని కేవలవికారస్వరముతో సంక్షేపముగా "ఉండదా మఱి? నిశ్చయముగా నతిదారుణముగనే యుండును!" అనియెను.

పాపము హేమాంగి యంతవఱ కాలోచించుకొనలేదు. ఆమె సహజస్వరముతో "ఆతని కీపాటికిఁ బెండ్లి కావలసినదే—ప్రఫుల్ల కుమారునితనయ నాతని కిచ్చుటకుఁ బెండ్లిమాటలుకూడ జరిగినవి!" అనియెను.

సతీ: అలాగా? అతఁడు పెండ్లికూడ నాడఁదలఁచెనా? నీవో? నిన్ను వదలివైచియేనా? అతఁడు నిన్ను మఱచిపోఁగలఁడా?

సతీశునిహృదయమునందు నిరంతరము నీర్ష్యానలము ప్రజ్వలించి పోవుచున్నది. ఆ భయంకరజ్వాలయే ప్రలాపరూపమున నిప్పు డాతని నిరసనాంచలమునుండి యీ విధముగా వెలువడియెను. అంతేకాని సతీశున కిప్పు డీరీతిగా మాటలాడవలసిన యావశ్యక మెంతమాత్రమును లేదు—ఏమందురా? ఇఁక రమేంద్రనాథుఁ డీలోకమున లేనేలేఁడు గదా?

ఇట్టిదుస్సహదుఃఖసమయమున హేమాంగి సతీశుని యున్మత్త ప్రలాపమును లక్ష్యము సేయలేదు! కాని మఱియొకసమయమునం

దెప్పుడైనసతీశుఁ డిట్టికుటిలభాషణములచే నవమానించుటయే తటస్థించె నేని, మానవతియగు హేమ యప్పు డేమిచేయుటకు సాహసించెనో, యేమగుటకు వెనుదీయకుండునో మేము చెప్పఁజాలము. ఈఘోరవార్త నాలకించినప్పటినుండియు నామెహృదయము సున్నపుగుల్లవలె నుడికి పోవుచుండెను. అప్పు డాసతీశునికటువుమాట పొంగుచున్న గుల్లను కట్టితోఁ గలయఁద్రిప్పినట్లయ్యెను. హేమాంగి తనవేఁడికన్నీటిధారలచే హృదయజ్వాల నించుక యుపశమింపఁజేసికొనుచు గద్గదస్వరముతో "నాథా! మీరింకను నిట్టి కటువచనంబులచే నన్నేల అవమానించెదరు? మీపాదములపైఁ బడి వేఁడుకొనుచున్నాను! పూర్వపు విషయముల నన్నిటిని మీరు మఱచిపోవలయును. నేను పరమేశ్వర నామోచ్చార ణముచేయుచు మీపాదపంకజములను స్పృశించి ప్రమాణము చేసి మనఃపూర్వకముగా సత్యము చెప్పుచున్నాను. ఏనాఁడు మిమ్ములను బెండ్లి యాడితినో యానాఁటినుండియు నేను మిమ్ములనే ధర్మముగను, దైవముగను, ప్రాణముగను, సర్వస్వముగను భావించి సేవించుచున్నాను. అప్పటినుండియు నాహృదయమునందు మీకంటె నన్యమూర్తి యొక నిమిషమాత్రమైనను నిలుచుటకుఁ దావిచ్చుట లేదు! దయావిహీనులై మీరూరక యిట్టిదుర్భాష లాడుచు నన్నేల యవమానించెదరు? ఏల బాధించెదరు? ఏల యేడ్పించెదరు?" అని గోలుగోలున నేడువఁ దొడంగెను.

సతీశచంద్రుఁడు శిలావిగ్రహమువలెఁ బడియుండెనేగాని యేమి యును మాటాడలేదు. అప్పుడు హేమ మరల "నాథా! పాప మాతఁడు నేఁడు తనవివాహవిషయముం గూర్చి యాలోచించుకొనుటకే మనయింటికి వచ్చినాఁడు! పోవుచుండఁగా దురదృష్టవశమున నాతనికిఁ బెద్దపెండ్లియే యైపోయినది!" అనియెను.

అప్పటికిని సతీశచంద్రుఁ డేమియును మాటాడలేదు. మౌనముతో నట్లే పరుండి యుండెను. కాని యారాత్రి యాతనికి నిద్రపట్టినదో లేదో యాతఁ డొక్కఁడే యెఱుంగును గాని యితరు లెవ్వరికిని దెలియదు!

* * * * * *

తెల్లవాఱినతోడనే సతీశచంద్రుఁడు లేచి సుధాంశుని వెంటఁ బెట్టుకొని బజారునకు బయలుదేఱిపోయెను. అతఁ డట్లు వెడలిపోయిన మఱికొంత సేపటిలోనే ప్రఫుల్లకుమారబాబు ఇచ్చటికి వచ్చెను. సతీశునకును ప్రఫుల్లకుమారునకును విశేషస్నేహసంబంధ మేర్పడియెను. వారుభయులును "మీరు" అనుటకుబదులుగాఁ బరస్పరమును "నీవు" అనియే పిలుచుకొనుచుండిరి. అంతేకాదు—ఆతఁ డింటికి వచ్చినప్పుడు సతీశచంద్రుని గృహమునం దాఁడువాండ్లెల్ల నాతని దర్శించుటకు సంశయము లేకయుండిరి. విశేషించి మధుపురమునందే గొప్పవారి యిండ్లయం దైనను ఘోషాపద్ధతి లేదనియే చెప్పవచ్చును. ఈ సకల కారణంబులచేతను ప్రఫుల్లకుమారుఁ డప్పుడప్పుడు వచ్చి సతీశుఁ డింట లేకున్నను హేమాంగితో నిస్సంశయముగా మాటలాడి పోవుచుండెను. ఇచ్చటికి వచ్చిన తరువాత నామె పినతల్లితోఁగూడ ప్రఫుల్లబాబునకుఁ బరిచయ మయ్యెను

ప్రఫుల్లకుమారుఁ డాలోపలఁ బ్రవేశించినతోడనే "ఎంత దుష్కాలము వచ్చినది! ఎంతటి ఘోరకృత్యము జరిగినదనుకొన్నారు! మీకుఁ దెలిసినదా?" అనియెను.

హేమాంగి కేవలమును దుఃఖగద్గదస్వరముతో "తెలిసినది. పాపము. ఆతఁడు నిశ్చయముగాఁ జచ్చియేపడిపోయినాఁడా? కాక యపాయకరములగు దెబ్బలు తగిలినవా?" అనియెను.

ప్రఫుల్లకుమారుఁడు విషణ్ణవదనముతో నతిదీనస్వరముతో "ఇఁక నట్టియాశ యేమియును లేదు. అప్పుడే మరణించినాఁడు!" అనియెను.

ఆమాట విని హేమాంగి సమీపమునఁ గూర్చుండియున్న పినతల్లి "ఆలాగా యాయెనా? మా సతీశచంద్రుఁడు చెప్పినట్లు నిశ్చయముగా నాతఁడు మనడాక్టరు రమేంద్రబాబేనా? ఎవ్వఁడో యొకవర్తకుఁడు హత్య గావింపఁబడియెనని మావంటవాఁడు మునుపు చెప్పియున్నాఁడు!" అనియెను.

ప్రఫు: ఆతఁడు చెప్పినమాటకూడ యథార్థమే — నిన్నటి రాత్రి మఱియొక గొప్పవర్తకుఁడుగూడ జంపఁబడినాఁడు! ఒక్క రాత్రియే యతిభయంకరములగు రెండుహత్యలు జరగినవి! ఈ మధుపురమునందిట్టి దారుణకృత్యము లిదివఱ కెన్నఁడును జరగియుండలేదు. ఆవర్తకుఁడు విశేషధనమును దీసికొని చీకటిలో వీథిబడి వచ్చుచుండఁగా నెవ్వరో వచ్చి యాతనింజంపి యాధనమును దోచుకొని పాఱిపోయిరి. అదిగాక డాక్టరుబాబు హత్య మఱియొకటి! ఆతఁ డెచ్చటినుండియో బయలుదేఱి తనయింటికి వచ్చుచుండెను. సరిగా నింటిగుమ్మము నొద్దకు వచ్చునప్పటికి వీథిగేటుచెంతనే యెవ్వరో యాతని నొకకఱ్ఱతోఁ గొట్టి చంపివైచి పోయిరి.

అప్పుడు హేమాంగిపినతల్లి యాతనింగాంచి "బాబూ! ఈ మాటకూడ నిజమేనా? మాసతీశుఁడు నీవుచెప్పినట్లే చెప్పియున్నాఁడు" అనియెను.

హేమాంగి దీనమందస్వరముతో "పాప మాతఁడు నిన్నటిరాత్రి యిచ్చటనుండి పోవుచున్నసమయమునందే యీ ఘోరకృత్యము జరిగినది కాఁబోలును!" అనియెను.

ప్రఫుల్లకుమారుఁడు విస్మయముతో "డాక్టరురమేంద్రబాబు నిన్నటిరాత్రి మీయింటికి వచ్చినాఁడా?" అని ప్రశ్నించెను.

హేమా: ఔను. వచ్చినాఁడు చిన్నబాబును జూచుటకై వచ్చినాఁడు. ఆతఁడిటనుండి బయలుదేఱు నప్పటికి రాత్రి యేఁడున్నర, యెనిమిదిగంటలవేళ యైయుండునని తోఁచుచున్నది!

ప్రఫు: అలాగా!—అప్పుడు గాదు. ఇంకను చాలరాత్రియైన తరువాతనే యాతఁడు చంపఁబడెను. కాని యేసమయమునం దీఘోర కృత్యము జరిగినదో సరిగాఁ జెప్పుట కవకాశము లేదు. చాల రాత్రి యగువఱకును డాక్టరుబా బింటికి రాకపోవుటచే సేవకుఁ డాతని వెదకుటకై బయలుదేఱిపోయెను. ఆతఁడు వీథులన్నియును దిరిగి చూచెనుగాని డాక్టరుజాడ యగపడలేదు. తుదకాతఁడు హతాశుఁడై యింటికిఁ దిరిగివచ్చుచు నింటిగుమ్మమున కించుకదూరమునఁ బడియున్న యాతనిమృతదేహమును గనుఁగొనియెను.

ఆమాట విని హేమాంగిపినతల్లి "ఆలాగా! కాని యీసమాచారమును సతీశుఁ డంతకుముందే తెలిసికొన్నట్లు మాకుఁ జెప్పియున్నాఁడు" అనియెను.

ప్రఫుల్లకుమారుఁ డాశ్చర్యముతో "అది యెట్లు? డాక్టరుబాబును హత్యచేయుటకుముందుగనే యాతఁడు హతుఁడయ్యెనను

సమాచారము సతీశున కెట్లు తెలిసినది ? ఇది చాలవింతగానున్న దే!"
అనియెను.

పినతల్లి : రాత్రి వంటవాఁ డింటికి వచ్చి భయభ్రాంతుఁడై
యొకవర్తకుఁడు హత్యగావింపఁబడియెనని చెప్పెను. అప్పుడు సతీశుఁడు
వానిమాట కడ్డము వచ్చి వర్తకునిహత్యయనుమాట అసత్య మనియు,
రమేంద్రుఁడు చంపఁబడె ననియుఁ జెప్పియున్నాఁడు. అంతకు ముందే
యీసంగతి నెవ్వరో తెలిసికొనియుందురు. వారివలననే సతీశుఁ
డీసమాచారమును వినియుండుననుకొందును.

ప్రఫు : రాత్రి యొంటిగంట దాటువఱకును డాక్టరు రమేంద్ర
బాబు చంపఁబడినసమాచార మాతని సేవకునికిఁగూడఁ దెలియదు !
అట్టిచో నంతకు ముందుగా నాతఁడు మరణించెనని యెవ్వరైన భావింప
నైనభావింపఁగలరా ?

పినతల్లి : ఏమో ! సతీశుఁడుమాత్ర మెవ్వరివలననో నిశ్చయ
ముగా నీవృత్తాంతము వినియుండును. అట్లు గాకయున్నచో మాకాతఁడు
స్పష్టముగా నెట్లు చెప్పఁగలఁడు ?

ప్రఫుల్లకుమారుఁ డించుక సేపాలోచించి "ఇది యంతయు
నాశ్చర్యకరముగా నగపడుచున్నది. అందులకు సందేహములేదు.
సతీశబా బింతకుముందే యెవ్వరివలన నీసమాచారమంతయు నాలకిం
చెనో, ఎట్లు తెలిసికొనియెనో నేను చెప్పఁజాలను !" అనియెను.

పినతల్లి : వీధినిబడి యెవ్వరో యతివేగముగఁ బరుగెత్తుకొని
పోవుచున్నారఁట! వారివలననే సతీశుఁ డీసమాచారమును విన్నాఁడఁట!
అప్పటికెంతరాత్రి యైయుండునో యేమోకాని మాసతీశుఁ డింటికి
వచ్చునప్పటికిమాత్రము తొమ్మిదిగంటలవేళ యైనది.

ప్రఫుల్లకుమారుఁ డదరిపడి "ఎంతటి భయానకకృత్యము! ఆ దురాత్ముఁ లే మనడాక్టరుబాబును జంపి యట్లు పాఱిపోవుచుండ వచ్చును! ఏమనిన—డాక్టరుబాబు చంపఁబడిన క్లింకను నా సమయమున నెవ్వరికిని దెలియనే తెలియదు! తెలియుట కవకాశమును లేదు! రాత్రి తొమ్మిదిగంటలకు ముందుగనే రమేంద్రుఁడు చంపఁబడినట్లు సతీశునితోఁ జెప్పిన వారెవ్వరో ముందుగాఁ దెలిసికొనవలయును. అకారణముగ రమేంద్రుని బలవంతముగాఁ జంపిపాఱిపోయిన హంతకులఁ జాడ దెలియునంతవఱకును మేమెవ్వరమునుగూడ నిశ్చింతులమై యుండఁజాలము. ఆ చెప్పినవారెవ్వరో సతీశచంద్రుఁ డెఱిఁగియేయుండునని నాకు తోఁచుచున్నది" యనుకొనియెను.

పిన : వారేయుద్యానమునందో గాని పనిచేయుచుండు పనివాండ్రట!

వారిట్లు సంభాషించుకొనుచుండఁగనే సుధాంశునితోఁ గలసి సతీశచంద్రుఁ డింటికి వచ్చెను.

# పదునాఱవ ప్రకరణము

సతీశచంద్రుఁడు లోపలఁ బ్రవేశించినంతనే ప్రఫుల్లకుమారుఁడాతనిం గాంచి యాత్రముతో "డాక్టరు రమేంద్రబాబు హత్యను గుఱించి నీవు నిన్నరాత్రియే తెలిసికొంటివా?" అని ప్రశ్నించెను.

సతీ : ఔను. నాకు రాత్రియే తెలిసినది. శ్రేష్ఠియుద్యానమందిరమునందలి పనివాండ్రీ సమాచారమును నాకుఁ దెలిపియున్నారు.

ప్రఫు : అక్కడి పనివాండ్రవలననేనా? సరే! అట్లయినచో నిశ్చయముగా హంతకులు దొరకకతీరదు. అంతగా శ్రమపడనక్కఱలేదు—ఉండుము!

అని చెప్పి ప్రఫుల్లకుమారుఁడు సతీశచంద్రునితో మఱియేమియు మాటాడకుండఁగనే యొక్కపరుగున నటనుండి వెడలిపోయెను.

శ్రేష్ఠియుద్యానమందిర మచ్చటి కెంతయో దూరముగా లేదు. అతఁ డొకయరగంటలోపలనే సతీశునింటికి మరలి వచ్చి సతీశునిం గాంచి "నేనిప్పుడు పోయి యా యుద్యానపాలకుల నడిగితిని. వారీ వార్త నీతోఁ జెప్పిన ట్లింతమాత్రము నంగీకరించుట లేదు. డాక్టరుబాబు హత్యగావింపఁబడెనను సంగతి వారు నీతోఁ జెప్పనేలేదఁట! ఇంతేకాక—నాఁటి డాక్టరుబాబు చంపఁబడెనను సంగతియే వారికిఁ దెలియలేదఁట!" అనియెను.

సతీ : ఏకారణముచే వారిట్లు కేవలము నసత్యము చెప్పుచున్నారో నాకుఁ దెలియుట లేదు. నేను రాత్రి చీకటిలో వీధిని బడి

యింటికి వచ్చుచుంటిని. అప్పు డాయిరువురును బరుగెత్తుకొని నా ప్రక్కనుండియే పోవుచుండిరి. సరిగా వారావీథినుండియే నాకెదురు వచ్చిరి. అందొకనిచేతిలో లాంతరున్నది. ఆవెలుఁగుమూలముననే నేను వారి నానవాలు పట్టఁగలిగితిని. వారట్లు విభ్రాంతులవలెఁ బరుగుపరుగునం బోవుచుండుటం గాంచి సంశయించుచు "అదియేమి! అట్లు పరుగెత్తుచున్నారు?" అని ప్రశ్నించితిని. అప్పుడు వారు వగర్చుకొనుచు "అతిభయంకరమగు విషయము—ఘోరతరంబగునరహత్య!—డాక్టరురమేంద్రబాబు నెవ్వరో చంపి పాఱవైచినారు—" అని నాతోఁ జెప్పిరి. వారట్లు చెప్పకయేయున్నచో నాకీసమాచారమంతయుఁ దెలియుట కవకాశ మేమున్నది? అప్పుడు త్రోవలో వారికంటె నితరు లెవ్వరును నాకగపడనేలేదు!

ప్రఫుల్లకుమారబాబు సంశయాక్రాంతహృదయముతో, సందిగ్ధభావముతో "సతీశా! అదియే నిజమైనచో నిప్పుడు వా రీవిషయము నంగీకరింపకుండుటకుఁ గారణ మేమైయుండును? ఆ యిరువురిలోనను దోఁటమాలిమాట కేమిగాని మందిరపాలకుఁడు చిరకాలమునుండి యటఁ బనిచేయుచున్న వాఁడే—"

అని చెప్పుచుండఁగా సతీశుఁడు "ఆమందిరపాలకుఁడే నాకీసంగతి చెప్పినాఁడు!" అనియెను.

ప్రఫు: ఆలాగా! అట్లయినచో నాతఁడు చాలపెద్దమనుష్యుఁడనియే యీాయూరివా రందఱు నాతని గౌరవించుచుందురు. తోఁటమాలికూడ మంచివాఁడే. నీకీసంగతి చెప్పినవారు వారుగాక మఱి యెవ్వరైన నైనచో నిశ్చయముగా వారీక్రూరతంత్రమునందుఁ జేరియుందు రేమో యని నేననుమానించి యుందును—సరే—ఇప్పు డొకసారి పోయి యామందిరపాలకుని నీయొద్దకుఁ దీసికొని వచ్చెదను—అతఁడు నీయెదుటఁగూడ నెట్లసత్యము చెప్పుటకు సాహసింపఁగలఁడో చూచెదను!

సతీ : మంచిది—అలాగే పోయి యిప్పుడే తీసికొని రమ్ము. నిమిషములో నంతయుఁ దేలిపోవును.

ప్రఫుల్లకుమారుఁడు మరలఁ బరుగెత్తుకొని వెడలిపోయెను. ఆతఁడు రమేంద్రనాథు నెంతయో ప్రేమించి యుండెను. అంతేకాక యాతనికిఁ దనతనయ నిచ్చి పెండ్లిచేయవలయు ననికూడ నిశ్చయించుకొనియెను. అట్టివాఁడీయవస్థలో రమేంద్రుని జంపిన క్రూరహంతకులను బట్టుకొనవలయు నని యింతపట్టుదలతోఁ బ్రయత్నించుచుండె ననుటలో నాశ్చర్య మేమున్నది ?

కొన్నినిముషములలోపలనే యాతఁడు వృద్ధుఁడగునుద్యాన మందిరపాలకుని వెంటఁబెట్టుకొని సతీశునింటికిఁ దీసికొనివచ్చెను. వచ్చినతోడనే యామందిరపాలకుఁడు సతీశుం గాంచి "బాబూ ! మీరు జమీందారులు ! గొప్పవారు—మీయొద్దకుఁ దీసికొనివచ్చినాఁడు !" అనియెను.

సతీ : నిన్నటిరాత్రివేళ నీవును మఱియొకఁడును వీథివెంటఁ బరుగెత్తుకొనిపోవుచు నాకగపడితిరి గాదా ?

వృద్ధు : ఔను బాబూ ! అంతతొందరగా నెచ్చటికిఁ బోవుచున్నా రని మీరప్పుడు ప్రశ్నించితిరి. ఈవీథినొక మనుష్యుఁడు హత్యగావింపఁబడియె నని నేను మీతోఁ జెప్పియుంటిని.

ఆమాట విని సతీశచంద్రుఁడు ప్రఫుల్లకుమారునివంకఁ దిరిగి "ప్రఫుల్లబాబూ ! వినుచున్నావా ?" అని మరల నామందిరపాలకునిం గాంచి "నీవప్పుడు నాతో సరిగా నేమాటలు చెప్పితివో యామాటలే ప్రఫుల్లబాబునకుఁ జెప్పుము !" అనియెను.

వృద్ధు : బాబూ! ఎవ్వరితోఁ జెప్పినను నొక్కటే మాట బాబూ! నేనప్పుడు మీతో "ఈ షేథియం దొకమనుష్యుఁడు హత్య గావింపఁబడెను" అని చెప్పితిని.

సతీ : అలాగా? నీవు చెప్పినమాట యంతేనా? ఇంకేమియును జెప్పలేదా?

ప్రఫు : ఓయీ! నీ వెంతమాత్రమును భయపడవలసినపని లేదు. అప్పుడు నీవు డాక్టరురమేంద్రబాబు నెవ్వరో చంపిపాఱవైచిన ట్లీయనతోఁ జెప్పితివా?

వృద్ధుఁడు భయభ్రాంతుఁడై గడగడ వడఁకుచు "బాబూ! ఆ సంగతి నే నెట్లు చెప్పఁగలుగుదును?—మీ కప్పుడు నేను చెప్పిన మాట యంతే—" అనియెను.

సతీశుఁడు ధిక్కరించుచు "అదికాదు—నీ వసత్యము చెప్పు చున్నావు. డాక్టరుబాబు హత్య గావింపఁబడె నని నీ వప్పుడు నాతోఁ జెప్పితివి?" అనియెను.

వృద్ధు : లేదుబాబూ! ఎవ్వడో యొకవర్తకుఁడు హత్య గావింపఁబడియె నని చెప్పుచు మేము పరుగెత్తి పోవుచుంటిమి—అప్పుడు మీరు మా మాట వినియును, వినిపించు కొనకుండఁగనే మీ దారిని బోయితిరి. డాక్టరుబాబు కూడఁ జంపఁబడినట్లు రాత్రి మాకుఁ దెలి యనే తెలియదు. నేఁటియుదయమునందే మే మావార్త వినియుంటిమి. రాత్రి రెండు హత్యలు జరగిపోయె నని మే మప్పు డనుకొంటిమి!

సతీశచంద్రుఁడు విస్మయాక్రాంతహృదయముతో నదరిపడి "ఏమంటివి! రెండు హత్యలా? అది యెట్లు?" అనియెను.

ప్రఫు : సతీశబాబూ! గొప్పవర్తకుఁడు గూడ నిన్నటిరాత్రి యే యే క్రూరులచేతనో చంపఁబడియెను. మందిరపాలగుఁ డగు నీ వృద్ధుఁ డా వర్తకుని హత్య గుఱించియే నీకుఁ జెప్పియుండు ననుకొందును!

నీవు వీథినిఁబడి వచ్చుచున్న సమయమునకు డాక్టరుబాబు చంపఁబడెనను సమాచార మెవ్వరికిని దెలియనే తెలియదు. రాత్రి యొంటిగంటయైన తరువాత నీ ఘోరవార్త ముందుగా నాతనిసేవకుఁడు మాత్రమే తెలిసికొనఁగలిగెను. అందుచేతనే నా కాశ్చర్యముగా నున్నది. డాక్టరుబాబు చంపఁబడె నను వార్త తొమ్మిదిగంటల రాత్రిలోపలనే నీ వెవ్వరివలనఁ దెలిసికొనఁ గలిగితివి ?

సతీశచంద్రుఁ డేమియును బ్రత్యుత్తరము చెప్పలేదు. ఏమని చెప్పవలయునో యాతని కెంత ప్రయత్నించినను స్ఫురించుట లేదు. క్షణము సేపటివరకు నాతఁ డేమియు మాటాడక యట్లే నిలువఁబడి పోయెను. ఆ మౌనభావ మతి భయంకరముగను, ఘోరముగను, సంశయాస్పదముగను దోఁచుచుండెను. ప్రఫుల్లకుమారబాబప్పుడు మరల గంభీరస్వరముతో "సతీశా! నీ వీ ఘోరవృత్తాంతమును నిన్నటిరాత్రి యెవ్వరివలన విని యుంటివి ?" అని ప్రశ్నించెను.

కాని యప్పుడుగూడ సతీశుఁ డేమియును మాటాడకయే యుండెను. అతని యుచ్ఛ్వాసనిశ్వాసము లతిదీర్ఘములై పోవుచుండెను. తుద కాతఁ డతికష్టముతో నాత్మసంయమనము గావించుకొని మఱి యొకవైపునకు శూన్యదృష్టులం బఱగించుచు బొమ్మవలె నిలువఁబడి యుండెను. అటనున్న సుధాంశుఁడు అతనితల్లి మొదలగువా రందఱును విస్ఫారితనయనములతో సతీశచంద్రుఁ డేమి చెప్పునో యని తదేక దృష్టిం గాంచుచుండిరి.

సతీశచంద్రున కేమిచేయుటకును దోఁచుట లేదు. అతఁడు తెలిసియో తెలియకయో మొట్టమొదటనే యొకమాటను జెప్పివైచెను. దానిని నిలువఁబెట్టుకొనుటకు నిరాబాధకమగు నుపాయమేమియు నాతనికి గోచరించుట లేదు. పోనిమ్ము! ఆ మాటను మఱియొకవిధముగా

మార్చి చెప్పుటకుఁగూడ నవకాశ మగపడకుండెను. క్రమముగా నాతనికష్టస్థితి యతిదుస్సహమైపోవుచుండెను. చాలసేపటివఱకుఁ నాతఁడట్లే మౌనముతో నుండి తుదకు ధైర్యము తెచ్చుకొని దృఢస్వరముతో "ఆ సమాచారమును నేనితనివలననే వినియుంటిని! ఇప్పుడీతఁడంగీకరింపకుండుటకుఁ గారణమేమో నాకుఁ దెలియుట లేదు!" అనియెను.

ఆమాట విని వృద్ధుఁడగు మందిరపాలకుఁడు "బాబూ! మీర న్యాయముగా మాటలాడుచున్నారు. డాక్టరుబాబుహత్యసమాచారము నాకు రాత్రి తెలియనే తెలియదు—అట్టిచో నేను మీతో నెట్లు చెప్పఁగలుగుదును? మీరు రాత్రి హత్యజరిగినదని నేను చెప్పినప్పుడు వినియును నేదియోసామాన్యవిషయమువలె భావించినిశ్చలచిత్తముతో మూత్రోవను మీరు పోయితిరి—మీరుగొప్పవారు! నేనొకమాట చెప్పఁగా నింకొకమాట చెప్పితి నని ధిక్కరించి యడుగు చున్నారు! ఇట్టిచో సామాన్యుల మగు మేమేమి చేయఁగలము? బాబూ! ఏమైన నేమి? నేనిఁక నింటికిఁ బోయెదను. ప్రభువువారి సెలవైనప్పుడు మరల వచ్చెదను" అని చెప్పి వెడలిపోయెను.

# పదునేడవ ప్రకరణము

మధుపుర మంత గొప్పపట్టణము గాదు. అట్టి చిన్న నగరములో నొక్క రాత్రివేళ రెండుహత్యలు జరిగినవి! అట్టిస్థితిలో నూరంతయు సంచలించిపోవుచుండె ననుటలో నాశ్చర్య మేమున్నది? హత్య గావింపఁబడిన వారిరువురునుగూడ గొప్పవారును, విశేషించి యా పట్టణమునం దెల్లవారికిని బరిచితులు నై యుండిరి. ఆ పురమునందలి యాబాలవృద్ధవనితలునుగూడ వారి నెఱుంగుదురు. ఆ వర్తకుఁడు చాల ధనవంతుఁడును ధర్మాత్ముఁడు నై యుండెను. రమేంద్రనాథుఁడో — పరోపకారపారీణుఁ డగుటచే నందఱకును బ్రియుఁడై యుండెను. సర్వజనోపకారియు, సాధుచరిత్రుఁడును, దీనదయాపరుఁడునగు డాక్టరు రమేంద్రనాథుని భయంకరహత్యంగూర్చి యూరివారందఱునుగూడ మిగుల విచారించుచుండిరి. అందుచేఁ బట్టణమందంతటను గందర గోళముగా నుండెను. నిన్నరాత్రి మొదలుకొని యింతవఱకును నగరమునం దేమూలఁ జూచినను నీ ఘోరహత్యలంగూర్చినమాటలే వినవచ్చుచుండెను. ఊరంతయు నట్టుడికిన ట్లుడికిపోవుచుండెను.

ఏదురాత్ములు ధనవంతుఁడగు నా వర్తకుని వధించియుండిరో వారే నిశ్చయముగా డాక్టరు రమేంద్రబాబునుగూడఁ జంపియుందురని మొట్టమొదట నెల్లవారును భావించి యుండిరి. కాని యా వర్తకుని యొద్దనున్న సమస్తవస్తువులును ధనమునుగూడ దోఁచుకొని పోఁబడియెను. ఆతనిం జంపినవారే రమేంద్రబాబునుగూడఁ జంపి యుందురని నిశ్చయించినచో రమేంద్రునికడనున్న యొకవస్తువైనను

దొంగిలింపఁబడ కుండుటకుఁ గారణ మేమి ? రమేంద్రబాబు జేబులోని బంగారుగడియారమును, ఆతనివ్రేలియందలి వజ్రపుటుంగరమును, చొక్కాలోపలి జేబులోని కొన్నిరూపాయలనోట్లునుగూడ నట్లే యున్నవి. అందేవియు నపహరింపఁబడనేలేదు ! దీనినిబట్టి బాగుగ నాలోచింపఁగా ధనము దోఁచుకొనవలయు ననునాశచే నాతని నెవ్వరును జంపియుండలేదని తోఁచుచుండెను. ధనలోభముచేతనే రమేంద్రబాబును జంపుట తటస్థించినచో హంతకు లాతని విలువగల వస్తువులను హరింపకుండ నెందులకు వదలివైచియుందురు ? ఇట్లనేక విధములుగాఁ దర్కవితర్కములు జరగినపిమ్మట వర్తకుని జంపిన దొంగలును, రమేంద్రబాబును వధించిన హంతకులు నొక్కరే యై యుండరనియు, రమేంద్రనాథుని వధించినవారు వేఱొకరై యుందు రనియు నందఱికిని నిశ్చయమైపోయెను. కాని యంతమాత్రమున నేమిలాభము ! అట్లాతని హత్య గావించినహంతకు లెవ్వరు ? ఊరక యాతని జంపివైచుటకుఁ గారణమేమైయుండును ? ఈమధుపురమునం దెచ్చటను నాతనికి శత్రువనువాఁ డొక్కఁడును లేఁడు ! ఎవ్వఁడైన, నేయూరినుండియైన వచ్చి యీవిధముగా రమేంద్రబాబును జంపివైచి పాఱిపోయియుండునా ? అని యీ విధముగాఁ దర్క వితర్కములుచేసి కొనుచు మధుపురమునందలి ప్రతివీథియందును, ప్రతి ఘట్టమునందును, ప్రతిగృహమునందునుగూడఁ బ్రజలెల్లరును దమకుఁ దోఁచినరీతిని సిద్ధాంతపూర్వపక్షములను జేయ నారంభించిరి. రమేంద్రబాబు ఘోర మరణమున కానగరమునందు దుఃఖింపనివా రొక్కరును లేరు.

పోలీసువారు రమేంద్రబాబు పడియున్నచోటికి వచ్చి యా ప్రదేశమును, ఆతనిమృతశరీరమును బాగుగఁ బరీక్షించిరి. ఎవ్వఁడో దురాత్ముఁ డాతనివెనుకపాటున వచ్చి దుడ్డుగఱ్ఱతో నాతనితలపై

బలవంతముగా మోదియుండు ననియు, ఆయాఘాతము చేతనే ఆతఁడు గిఱ్ఱున దిరిగి యావీథి ప్రక్కనే తిన్నెమీఁదఁ బడిపోయియుండు ననియు, తలపై బలముగాఁ దగిలిన యాకఱ్ఱదెబ్బచేతనే రమేంద్రబాబు మరణించి యుండు ననియు, ఆతఁ డాదెబ్బచేఁ జచ్చిపోయెనో, యింకను జీవించి యుండెనో యని తెలుసుకొనుటకైనను వెనుదిరిగి చూడకుండఁగనే యాహంతకుఁడు తత్క్షణమందే పాఱిపోయియుండు ననియు నూహలను బట్టి నిశ్చయింపఁబడియెను.

అచ్చటి ప్రదేశమంతయును నల్లత్రాయివలె నతికఠినమై ఉండెను. అందుచే నచ్చట నడుగుజాడలను గుర్తించుట కవకాశ మేమియును లేకపోయెను. ఆ కారణముచేతనే రమేంద్రుని జంపవచ్చిన హంతకు లెందఱైయుండురో యెవ్వరెవ్వరేవిధముగా నెచ్చటెచ్చట నిలిచి యుండిరో తెలిసికొనుట కుపాయము గానరా దయ్యెను !

తరువాతఁ బోలీసువారు రమేంద్రబాబు సేవకుని బిలిచి యెల్ల సంగతులను దెలిసికొనిరి. ఆ సేవకుఁడు తన యజమానునిరాకకై యెదురుచూచుచు. జాలరాత్రివఱకును మేల్కాంచియే యింటఁ గూర్చుండియుండెను. రాత్రి పదిగంటలవేళ నాతనికి వీథిలో నేదియో చప్పుడైనట్లు వినఁబడియెను. కాని యాతఁ డప్పుడు చీకటిలోఁ ద్రోవను బోవుచున్నవారెవ్వరో కాలుజాఱిపడియుందు రని భావించుటచే నది యేమియో తెలిసికొనుటకై యంతగా లక్ష్యము చేయలేదు. మఱి కొంతసేపటికి దారుణహత్య గావింపఁబడినగొప్పవర్తకుని జూచివచ్చుటకై రమేంద్రబాబునుగూడ వెంటఁబెట్టుకొని పోవలయునని కొందఱు పెద్దమనుష్యు లింటియొద్దకు వచ్చి పిలిచిరి. అప్పటికిని రమేంద్రబాబిల్లు చేరుకొననేలేదు. క్రమముగా రాత్రి పండ్రెండుగంటలుకూడ నయ్యెను. రమేంద్రనాథుఁ డింకను నింటికి రాకుండుటం గాంచి

యా సేవకుఁడు భయసంశయావిష్ట హృదయముతో లేచి యొక లాంతరును జేతఁ బట్టుకొని యాతని వెదకుటకై బయలుదేఱి పోయెను. ఆతఁడు వీథులన్నియును దిరిగి శోధించెనుగాని డాక్టరుబా బెచ్చటను నగపడలేదు. తుదకాతఁడు విఫలప్రయత్నుఁడై యింటికిఁ దిరిగివచ్చుచుండెను. ఆతఁ డట్టింటిగుమ్మమునొద్దకుఁ జేరినతోడనే యెవ్వఁడో యొకమనుష్యుఁడు వీథిప్రక్కతిన్నెపైఁ బడిపోయియున్నట్లు లాంతరు వెలుఁగులో నాతని కగపడియెను. తోడనే యాతఁడు లాంతరును పైకెత్తి బాగుగఁ బరీక్షింపఁగా నింకేమున్నది ? ఆతనియజమానుఁడే !- అప్పుడు భయభ్రాంతుఁడై యాతఁడు పిచ్చికేకలు వైవ నారంభించెను. ఆ కేకలనాలకించి యిరుగుపొరుగువారందఱును లేచివచ్చి యా ఘోర కృత్యముఁగాంచి భయవిస్మితులై పోయిరి.

ఇక్లే పోలీసు వారాహత్యలంగూర్చి రహస్యభేదనము గావించుటకై యనేకవిధములఁ బ్రయత్నములు సేయుచుండిరి. ఉద్యాన మందిరపాలకునకును సతీశునకును జరిగిన సంభాషణములనుబట్టి తనకుఁ దెలిసినవిషయమును ప్రఫుల్లకుమారుఁ డందఱకును జెప్పుచుండెనని నేఱుగ వ్రాయనక్కఱలేదు ఆతనికిఁగూడ రమేంద్రుని హత్యారహస్యమును గనిపెట్టవలయునని పట్టుదలగా నుండెను. ఆ యుద్యాన మందిరపాలకుఁడగు వృద్ధుని నెల్లవారు నెఱుంగుదురు. ఆతని విషయమున నెవ్వరికిని సందేహము లేకుండెను. అనుమానించుటకుఁ గారణము గూడ లేదు. అమాయకుఁడగు నాతనిపూటయం దెవ్వరికినిగూడ నవిశ్వాసము గలుగలేదు. ఇఁక సతీశుఁడుమాత్రమో—ఆతఁడును గొప్పజమీందారుఁడు. మిగుల గౌరవము గలవాఁడు. ఆతఁడు కొలఁది దినముల క్రిందటనే యీ మధుపురమునకు వచ్చియున్నను నగరములోని పెద్దమనుష్యులకందఱకును బరిచితుఁడయ్యెను. అందఱు నాతని

గౌరవించుచుండిరి. ఆ కారణముచే నాతనిమాటగూడ నసత్యమని యెవ్వరును భావింపఁజాలకపోయిరి. కాని సతీశుఁడును, ఉద్యానమందిర పాలకుఁడును చెప్పినమాటలలోఁ బరస్పరవిరుద్ధభావ మగపడుచుండుట వలన నందఱికిని గొలఁదిగనో గొప్పగనో విస్మయము గలుగుచుండెను. అట్లుపరస్పరవిరుద్ధముగా మాటలాడుటకుఁ గారణమేమైయుండునో యెవ్వరును స్థిరపఱుపఁజాలకపోయిరి.

ఏమైననేమి ?—పోలీసువారుమాత్రము నిశ్చింతులై యూర కుండలేదు. ఆ ఘోరహత్యలు రెండిటింగూర్చియు ననుసంధానము సేయుటకై యనేకవిధములఁ బ్రయత్నించుచుండిరి. ఈ విధముగా మూఁడుదినములైన తరువాత వర్తకుని హత్యగావించిన యిరువురు హంతకులు పోలీసువారిచేఁ బట్టుపడిరి. ఆ యిరువురు నతిక్రూరులును మహాబలవంతులును, దుష్టవర్తనులునై యుండిరి. దొంగతనములు బందిపోటులును గావించుటయే వారివృత్తి. ఏకారణములేకుండఁగనే పోలీసువారు వారిని బట్టుకొనలేదు ! మరణించిన యా గొప్పవర్తకుని యొద్ద నపహరించి యెత్తుకొనిపోయిన వస్తువులన్నియును బోలీసువారికి వారియొద్ద నగపడినవి. ఇంతేకాక వారే హంతకులని నిశ్చయించుట కింకను ననేకకారణములు గానఁబడియెను. ఆ యన్నింటింగూర్చియు సవిస్తరముగా నిచ్చట నుల్లేఖించుటవలన నంతప్రయోజనం బేదియును లేదు.

కొన్నిదినములనుండి దుష్టప్రవర్తనులగు నీ హంతకు లిరువురును మధుపురమునందు దిరుగుచున్నట్లును, వీరితోఁగూడ దామనుఁడను పేరుగల యింకొక్క దుష్టుఁడు గలసియున్నట్లును పోలీసువారి కను సంధానమువలనఁ దెలియవచ్చెను. కాని యిప్పు డా దురాత్ముఁడు తప్పించుకొని యెక్కడకుఁ బాఱిపోయెనో తెలియుట లేదు ; పట్టుపడిన యా హంతకుల ననేకవిధముల బాధించి యడిగిరిగాని యా దామనుఁ

జెచ్చ...కేc బాఱిపోయెనో మాకెంతమాత్రమును దెలియనే తెలియదని వారు చెప్పిరి.

ఆ వర్తకుఁడును డాక్టరురమేంద్రబాబునుగూడ నొక్కసమయమునందే హత్య గావింపఁబడియుందు రని యొకవిధముగా నిశ్చయమయ్యెను. అందులకుఁ దగిన ప్రమాణములుగూడ నగపడుచుండెను. కాని వర్తకుని వధించిన హంతకులచేతనే రమేంద్రుఁడుగూడ వధింపఁబడి యుండుననను విషయమున నెవ్వరికిని విశ్వాసము గలుగకుండెను. ఆతనిఁ జంపినవారు మఱియొకరై యుందురనియే యెల్లవారును భావించుచుండిరి.

పోలీసువారు వర్తకునిఁ జంపినహంతకుల నిరువురను బట్టుకొని చెఱసాలయందు బంధించిరి. ఇఁక రమేంద్రునిహంతకులను బట్టుకొనుటకై వారెన్నియోవిధములఁ బ్రయత్నములు చేయుచుండిరి. రాఁబోవు నాదివారము నాఁ డీవిషయముంగూర్చి యిన్స్పెక్టరుగారు విచారణ చేయుదు రనుసంగతి యెల్లయెడలఁ బ్రచారితమయ్యెను.

ఈ సమయమునందు వృద్ధురాలగురమేంద్రనాథునితల్లి తన దేశమునుండి బయలుదేఱి సూమఘపురమునకు వచ్చెను. ప్రఫుల్లకుమారుఁడు మొదలుగాఁగల రమేంద్రుని మిత్రులనేకు లామెను దమయింటికివచ్చి యుండవలయు నని ప్రార్థించిరి. కాని యామె యెవ్వరియింటికినిబోక మృతుఁడైన తనపుత్రునియింటికే పోయి యచ్చట నుండెను.

## పదునేనిమిదవ ప్రకరణము

డాక్టరు రమేంద్రబాబును జంపినవారెవ్వరై యుందురని సూక్ష్మబుద్ధితో నించుక యాలోచించినచో నెట్టివానికైనను సతీశచంద్రుని యెడల విశేషించి యనుమానము గలుగకమానదు. కాని యామధుపురమునందు సాధారణముగా నాతనివిషయమున నెవ్వ రనుమానింపఁ గలరు? — ఏమనిన — రమేంద్రనాథునకును సతీశచంద్రుని భార్య యగు హేమాంగికిని జిన్నతనమునుండియుఁ బరిచయమున్నదను సంగతి గాని, సతీశచంద్రుఁడు రమేంద్రుని ననుమానించుచు నాతనియెడల నీర్ష్యాపరవశుఁడై యుండె నను సంగతిగాని యానగరమునం దెవ్వరికిని దెలియదు. అందుచేతనే యించుకసందేహకారణ మగపడుచున్నను సతీశచంద్రునిపైఁ బ్రజలకుఁ గలుగుచున్నయనుమాన మంతగా దృఢపడుట లేదు.

అప్పుడు మధుపురమునందలి ప్రజ లందఱిలోనను హేమాంగి యొక్కతెమాత్రమే—ఆమె యొక్కతెయే తనహృదయయేశ్వరుఁ డగు సతీశునిహృదయభావమును, రమేంద్రునియెడల నాతనికిఁగల భయంకరమగు నీర్ష్యయు, విజాతీయమగు దారుణక్రోధమును సంపూర్ణముగా నెఱింగి యుండెను. ఇంతేకాదు—సతీశచంద్రుఁ డొకనాఁడు క్రోధావేశపరవశుఁడై రమేంద్రున కెప్పటికైనను దగినశాస్తి చేయుదునని హేమాంగితోఁ జెప్పి బెదరించి యుండెను—మఱియు రమేంద్రుఁడు మరణించిన నాఁటిరాత్రి సతీశచంద్రుఁడు చాలసేపటివఱకు నింటికి రాలేదు! తొమ్మిదిగంటలరాత్రికి వచ్చినను దొంగవానివలె దొడ్డి

త్రోవనే లోపలఁ బ్రవేశించి యింట నెవ్వరితోడను మాటాడకుండఁ గనే తన పడకటింటిలోపలఁ బ్రవేశించి చటాలునఁ దలుపు మూసి కొనియెను—తరువాతఁ జాలసేపటివఱకును వెలుపలికి రానేలేదు. వచ్చినను వెనుకటిదుస్తులను ధరించి వదలివైచి క్రొత్తదుస్తులతో బయటికి వచ్చెను–ఏమైననేమి ! ఇన్ని సందేహకారణములు స్పష్టముగా నగపడుచున్నను సతీశునివిషయమున ననుమానించుట కవకాశము లేకుండెను. ఏమనిన—ఆతఁడు మంచివిద్యావంతుఁడు—మంచినడవడి గలవాఁడు—మంచివంశమున జన్మించినవాఁడు—మంచివాఁడని ఎల్ల వారిచేతను బ్రశంసింపఁబడుచుండువాఁడు—పెద్దమనుష్యుఁడు ! ఇన్నిటి కంటెను బ్రధానముగా నాతఁడు హేమాంగికిఁ బ్రాణేశ్వరుఁడై యుండెను. ఆతఁడు క్రూరహంతకుఁడై యుండునని పరమపతివ్రతా తిలకమగు హేమాంగి సంశయింపఁగలదా ?—కాని—రమేంద్రబాబు హత్యగావింపఁబడియెనని సతీశుఁడు చెప్పినసమయమున కాఘోర హత్య జరిగినసంగతి మధుపురములో నొక్కరికైనను దెలియదు ! సరే కదా—అట్లు తెలియుటకుఁగూడ నెట్టియవకాశము లేదు. ఇట్టిస్థితిలో సతీశున కీహత్యావృత్తాంత మేవిధముగాఁ దెలియవచ్చినది ?— హేమాంగి తనలోఁ దానే యీ ప్రశ్నను గల్పించుకొని యాకాశము మొదలుకొని పాతాళమువఱకును నాలోచింపఁ దొడంగెను. ఆమె నయనపథమునం దీభూమండల మంతయును దేలిపోవుచుండెను. ఆమె హృదయ మనిర్వచనీయంబగు దుస్సహయాతనచేఁ బరితపించిపోవు చుండెను ; గుండె లతితీవ్రముగాఁ గొట్టుకొనిపోవుచుండెను.

అదిగాక సతీశచంద్రుఁ డిల్లువిడిచి షికారుపోవు సమయములం దెప్పుడును నలమైన తనచేతికఱ్ఱను దీసికొని మఱి పోవుచుండును. ఆనాఁడుగూడ నాతఁ డాకఱ్ఱను జేతఁ బట్టుకొనియే పోయెనో లేదో

హేమాంగి చూడలేదు. రాత్రి వచ్చినప్పుడుగూడ దొడ్డితోవనేవచ్చి యెవ్వరికి నగపడకుండ గదిలోఁ బ్రవేశించుటచే నప్పు డాతనియొద్ద నాకత్తి యున్నదో లేదో చూచుట కవకాశము లేకపోయెను. కాని యది మొదలుగా నిప్పటివఱకు నాతనియొద్ద నాచేతికత్తి యగపడుటయే లేదు. ఆకత్తి యింటిలోనే లేదు—ఇఁక నది యేమైపోయినది ? దాని నాతఁ డెచ్చటనైనఁ బాఱవైచి యుండునా ? ఏమిచేసినాఁడు? ఆరాత్రి రమేంద్రనాథుని వెనుకపాటుననే వచ్చి యెవ్వరో యాతనితలపై దృఢమైనకత్తితో మోది చంపివైచి యుందురని పోలీసువారు నిశ్చయించినట్లు హేమాంగి వినియుండెను ! దానికిఁ దోడుగా సతీశచంద్రునిచేతికత్తి యగపడుటలేదు. అంతటి ఘోరకృత్యము తననాథుఁడే కావించి యుండునా యని హేమాంగి కనుమానము గలుగుచుండెను. అతిభీషణంబగునట్టి యనుమానముచే నామెహృదయమునందు జాజ్వల్యమానంబగుదావానలము ప్రవేశించి యనిర్వాచనీయంబు లగు యాతనా పరంపరలలో నామెను ముంచివైవఁదొడంగెను. కాని యింతటి దారుణ కృత్యమును సాధుచరిత్రుఁడగు సతీశచంద్రునివంటివాఁడు గావించుటకు సాహసింపఁగలఁడా ? అట్టి రాక్షసకృత్యమును దనభర్తచేసి యుండు ననుమాట తలంచుకొనుటకుఁగూడ నాసాధ్వీమణి కసహ్యముగా నుండెను. కాని యతిదారుణంబులగు కారణపరంపర లామెకు స్వప్రమాణములుగాఁ గానవచ్చుచుండెను. ఇట్టిస్థితిలో నామెహృదయమునం దోఁచుచున్న సందేహము నిశ్చయముగా దృఢపడకుండఁ బోవుట కవకాశ మేమున్నది ? అయినను నామె తన ఘోరసంశయమును విశ్వసింపఁజాలకుండెను. ఆహా ! దాంపత్యధర్మ మెంతటిపవిత్రమైనది ! భార్యాభర్తల నేకరూపముగా బంధించిన యా యనంతప్రేమబంధ మెంతటి దివ్యమైనది ! సహధర్మిణియగు సాధ్వీమణి తనకన్నులనైనను

విశ్వసింపక యుండఁగలదు! ఇంతేకాక గురుజనముల యుపదేశముల నైనను దిరస్కరింపఁగలదు—ఇష్టదేవతల యాజ్ఞలనైనను ననమానింపఁ గలదు—కాని ప్రత్యక్షదైవత మగు ప్రాణేశ్వరుని యెడల మాత్ర మెన్నఁటికి నవిశ్వాసమును జూపఁజాలదు!

ఆ మఱునాఁడు సతీశచంద్రుఁ డెప్పటివలెనే షికారునకు వెడలి పోయెను. అప్పుడు హేమాంగి తననాథుని శయన గృహము నందుఁ బ్రవేశించి లోపలినుండి తలుపులను మూసివైచెను. ఆ ఘోరకృత్యము జరిగిననాఁడు సతీశచంద్రుఁ డే దుస్తులను ధరించి వీథిలోనికిఁ బోయెనో యా దుస్తు లింతవఱకు నగపడుటలేదు. ఆతఁ డెల్లప్పుడు నుపయోగించుకొనుచుండు చేతికఱ్ఱ కూడ నేమైపోయినదో తెలియుట లేదు. హేమాంగి యిప్పు డాసంగతి తెలిసికొనవలయు ననియే యున్మత్తురాలి వలె వెదకులాడు చుండెను. సతీశచంద్రుఁడు వాని నన్నిటి నీ గదిలోనే యెచ్చటనో దాఁచియుండు నని యామె కనుమానముగా నుండెను— ఒకవేళ నాతఁ డట్లు చేయవలసి యున్నయెడల నా వస్తువులను దన పెట్టెలోనే దాఁచి యుంచును. ఈ సంగతి యెంతవఱకు నిజమో తెలిసి కొనునంతవరకు నామె హృదయావేగము నడంచుకొనఁ జాలకుండెను. అట్టి సందిగ్ధావస్థలో నింకను నాలస్యము చేసి యూరకున్నచో నిశ్చయముగా నామె పిచ్చిది యైపోవును. ఆమె యట్లు తలుపులు మూసుకొని యింట నొంటిగానున్నది గాని యా సమయమునం దెవ్వరైనఁ జూచుటయే తటస్థించినచో నప్పటికే యామె యున్మాదిని వలెఁ గానఁబడి యుండును!

హేమాంగి తలుపులు మూయఁబడి యున్న యా గదియం దంతటను వెఱ్ఱిదాని వలెఁ బరిభ్రమించుచు నాలుగు మూలలను వెదక నారంభించెను. కాని తాను వెదకఁదలచిన వస్తు వామె కెచ్చటను

నగపడకుండెను. సాధారణముగాఁ జేతికఱ్ఱ యుంచుచుండు తావునఁ జేతికఱ్ఱ లేదు. మాసినబట్టలను వైచుచుండు బుట్టలో నా దుస్తులును లేవు! అట్లయినచో హేమాంగి హృదయమునందుఁ దోఁచినసందేహమే నిశ్చయమై యుండునా? సతీశచంద్రుఁడా నాఁడు ధరించిన దుస్తులను, జేతికఱ్ఱను నిజముగాఁ దన పెట్టెయందే యెవ్వరికి నగపడకుండ దాఁచి పోయి యుండునా?

సతీశచంద్రుఁడు స్వంతముగా నుపయోగించు కొనుచుండు పెట్టెలు మూఁడు నాలుగున్నవి. వాని తాళము లన్నియును గూడ నాతనియొద్దనే యుండును. హేమాంగి యప్పుడు తన తాళపుజేతులతో నా పెట్టెల నెట్లయినఁ దెఱచి చూడవలయు నని ప్రయత్నించెను. అట్లామె యెన్ని యోవిధములం బ్రయత్నించి చాలసేపటి కతికష్టముతో నొక పెట్టెను మాత్రము తెఱవఁ గలిగెను! కాని యా పెట్టెలో నాతని కఱ్ఱగాని, దుస్తులుగాని యగపడలేదు. తరువాత మఱియొక పెట్టెను దెఱచెను. అందైనను నవి కనఁబడలేదు. ఆమె సంశయ మతివేగముగఁ గొట్టుకొని పోవుచుండెను. సంశయ విచ్ఛేదము గావించుకొను వఱకు నామెహృదయము పరితపించిపోవు చుండెను—తుద కామె యెట్లో మూఁడవ పెట్టెను గూడఁ దెఱచెను—అది యేమి! ఆకస్మికముగా నామె సంశయ పగిలిపోవునంతటి ప్రబలావేగముతో ఘోరాఘాతం బైనట్లయ్యెను! ఆమె కన్నులు తెఱవఁబడి యుండఁగనే నలుదెసల గాఢాంధకారము క్రమ్ముకొని పోయెను!

ఆ పెట్టెలోపలనే యా చేతికఱ్ఱ యగపడియెను—అది విఱిగి పోయినది!—రెండుముక్కలై పోయినది!! ఆ కఱ్ఱపిడిమీఁద నేదియో నల్లనిడాగు గానవచ్చుచుండెను—దానిక్రిందనే యా నాఁడు సతీశుఁడు ధరించిపోయిన దుస్తులుగూడ నున్నవి! అవియన్నియును రక్తసలిల చిహ్నితములై యుండెను!—హా! ఎంతభయంకరమగు విషయము!

చూచినతోడనే హేమాంగి చటాలున మోకాళ్లపైఁ గూలఁబడి పోయెను! ఒక్కనిమిషములో నామెచూపులలోనను, దీర్ఘనిశ్వాసముల లోనను, రక్తనాళములలోనను, అస్థిసమూహములలోనను నొక విధమగు సతీత్వవ్రతమవిద్యుత్ప్రవాహము ప్రవహింప నారంభించెను. ఆమెసకలాంగకములును గడగడ వణఁకిపోవుచుండెను. ఇఁక నేమున్నది! ఆమెనాథుఁడే నిశ్చయముగా నరహంతకుఁడు! ఆమె స్వామియే యథార్థముగా నమాయకుఁడగు రమేంద్రునిఘోరహత్య గావించి నాఁడు!

హేమాంగి యాలోచనాశక్తి యంతయు నొక్కసారిగా లోపించిపోయెను. అట్లే ఆమె చాలసేపటివఱకును స్తంభితయై కూలఁబడి యుండెను. ఆహా! ఆమె యిప్పు డెంతటితప్పుపని చేసినది! ఈ సంగతి యామె భర్తకుఁ దెలిసినచోఁ గొంప మునిఁగిపోదా? పోనిమ్ము! ఇంతపని జరిగినతరువాత నిఁకఁ దెలిసిననేమి? ఆమె కిఁక సంసారమునం దెంతమాత్రము నాశ లేకుండఁబోయెను—నిమిషములో నామెకుఁ దననింద్యజీవితమునందలి మమతయంతయును వదలిపోయెను—దివ్య ప్రణయపాశముచేఁ గూర్పఁబడిన యామెహృదయగ్రంథి యంతటితో విచ్ఛిన్నమైపోయినది! ఆమెకిప్పు డొకతనయుఁడును దనయయునుండి బాధించుచున్నారు గాని వారే లేకయున్నచో నీదుర్భరస్థితియం దామె యేమిచేసి యుండునో, యేమైయుండునో, వేఱుగ వ్రాయ నక్కఱలేదు!

సరిగా నాసమయముననే యెవ్వరో వచ్చి తలుపుతట్టిరి. తోడనే హేమాంగి శరాహతయగు హరిణింబోలి యదరిపడి యొక్కయుదుటున లేచి నిలువఁబడియెను. సతీశుఁడే వచ్చియుండునని ఆమె భయపడియెను.

ఎంతధైర్యము తెచ్చుకొందమనుకొన్నను స్త్రీహృదయముగదా! ఏమిచేయుటకు, నేమనుటకుఁ గూడ నామెకుఁ దోఁచకుండెను. అప్పుడు పెద్దదాసి వెలుపలనుండియే "అమ్మా! ఎవ్వరో గాని మీదర్శనమునకు వచ్చియున్నారు?" అనియెను.

ఏమని ప్రత్యుత్తర మీయవలయునో స్వయముగాఁ దోఁచుట లేదు. ఆమెకిప్పు డాత్మజ్ఞానమే నశించిపోయెను. ఇంతలో దాసి మరల నుచ్చైస్స్వరముతో "అమ్మా! ఎవరో వచ్చినారు! వారికేమి చెప్ప మందురు?" అనియెను.

వడఁకిపోవుచున్న చేతులతో హేమాంగి యప్పు డాపెట్టెల నన్నిటిని చప్పున మూసివైచి యేదోయొకవిధముగా హృదయావేగము నడఁగించుకొని మెల్లమెల్లఁగాఁ బోయి గదితలుపులను దెఱచెను. అప్పుడు దాసి యామెం గాంచి "అమ్మా! ఎవ్వరోగాని యొకముసలి యామె మిమ్ము దర్శింపవలయు నని వచ్చియున్నది. ఆమె యెవ్వరో నేనిదివఱ కెన్నఁడును జూచియుండలేదు—అదియేమమ్మా! అట్లు న్నారు? మీశరీరమునం దనారోగ్యముగా నున్నదా యేమి? కన్నులు గుంటలు వడినవి. మొగమంతయును విలక్షణముగా నగపడుచున్నది! ఏమి?" అనియెను.

హేమాంగి కేవలము నస్పష్టం మగుమృదుస్వరముతో "ఏమియును లేదు. తలయేమో చాలభారముగా నున్నది!—సరే—ఆ వచ్చినవా రెవ్వరు? నాకు జబ్బుగా నున్నదని చెప్పి పంపివేయుము! ఏమోకాని చాల నస్వస్థతగా నున్నది" అనియెను.

ఇట్లామె చెప్పుచుండఁగనే యాదాసివెనుకవైపునుండి "అమ్మా! పనియేమియును లేదు. నీతో నొకటిరెండుమాటలాడి పోవలయు నని వచ్చితిని. అంతే—శ్రమయిచ్చినందులకు క్షమించి యించుకసేపు సమయ మీవలయును!" అనుమాటలు వినఁబడియెను.

ఆ వెంటనే వృద్ధురాలొకతె దానిని దప్పించుకొని హేమాంగి యెదుటఁ బడియెను. చూచినతోడనే యామె యెవ్వరై యుండునో హేమాంగి నిశ్చయముగా గ్రహింపఁగలిగెను. ఆమెను జూచుటవలన హేమాంగి హృదయ మింకను నతితీవ్రముగఁ గొట్టుకొని పోవఁ దొడంగెను; ఆమె కన్నులు చీకటులు గ్రమ్ముచుండెను. ఆ వృద్ధురాలిం గాంచినతోడనే యామె రమేంద్రనాథుని తల్లియై యుండు నని హేమాంగి నిశ్చయించుకొనెను.

కలకత్తాలో నున్నప్పు డొకసారి మాత్రము రమేంద్రుని తల్లిని హేమాంగి చూచియుండెను. ఈ ప్రపంచమునందు నిరుపేదరాలగు నీ తల్లికంటె రమేంద్రున కాత్మబంధువు లితరు లెవ్వరును లేరు. రమేంద్రనాథుఁడు తన తల్లియొద్ద నెట్టి ముఖ్యవిషయము నైనను రహస్యముగా నుంచువాఁడు గాఁడు. అతఁడు హేమాంగికిని దనకును గల ప్రణయసంబంధము నంతను విస్పష్టముగాఁ దల్లి కెఱింగించియే యుండెను. అందుచేతనే యా వృద్ధురాలు పూర్వ మొకసారి హేమాంగిని జూచి పోవలయునని కలకత్తాకు వచ్చియుండెను. ఆనాఁటి నుండియు హేమాంగి యామె యనిన నెంతయో భయపడుచుండెను. కాని యట్లు భయపడుటకుఁ గారణము మాత్ర మామె కేమియును దెలియనే తెలియదు.

అప్పుడు హేమాంగి యించుక మనసు కుదుటపఱచుకొని రుద్ధకంఠస్వరముతో "అమ్మా! ఎప్పుడు వచ్చితిరి? రండు! దయచేసి కూర్చుండుఁడు!" అనియెను.

రమేంద్రనాథుని తల్లి నిట్టూర్పులు విడుచుచు మెల్లఁగా లోపలఁ బ్రవేశించి మంచముపైఁ గూర్చుండెను. పెద్దదాసి యటనుండి వెడలిపోవువఱకు నా వృద్ధురా లేమియును మాటాడలేదు. హేమాంగి

కేమి మాటాడుటకును శక్తియే లేకుండఁ బోయెను. కొంతసేపటివరకు నిరువురును నిశ్శబ్దముగనే యుండిరి.

దాసి వెడలిపోయెను. అప్పు డా వృద్ధురా లతిగంభీరభావముతో నతిమృదులంబగు కంఠస్వరముతో మెల్ల మెల్లఁగా "అమ్మా! మా రమేంద్రు నా విధముగా ఘోరహత్య గావించినవా రెవ్వరై యుందురో తెలిసికొని పోవలయు నను నాశతో నేను నీ యొద్దకు వచ్చి యుంటిని. చెప్పెదవా తల్లీ?" అని యడిగెను.

హేమాంగి కప్పుడు తన కాలిక్రింది భూమి యంతయును మెల్ల మెల్లఁగా దిగఁజాఱిపోవుచున్నట్లు దోఁచుచుండెను. వెనుకపాటున నెవ్వరో వచ్చి బలవంతముగా రెండుచేతులతోఁ దన దనగొంతు నొక్కి వైచుచున్నట్లామె కనుభవ మగుచుండెను! ఉండదా మఱి? ఇప్పు డా వృద్ధురాలి యెట్టయెదుటనే—ఆ పెద్దపెట్టెలోనే—ఆమె కుమారుని జంపివైచిన హంతకుని సప్రమాణముగా నిరూపించుటకుఁ దగిన సాధనము లన్నియును దాపఁబడి యున్నవి! అక్కటా! అది తలంచుకొనుట కెంతటి భయంకర విషయము! ఎంతటి ఘోరకృత్యము!— ఆ మాట యనుకొనుటకుఁ గూడ హేమాంగి సహింపఁ జాలకుండెను! ఏమియును మాటాడఁజాలక యప్పుడు హేమాంగి ఱాతిబొమ్మ వలె నట్లే నిలువఁ బడిపోయెను.

రమేంద్రనాథుని తల్లి నిశ్చలదృష్టితో నామెవంకఁ జూచుచు దృఢ గంభీరస్వరముతో "నిశ్చయముగా నీవే నా కుమారుని జంపి వైచితివి! నీ మూలముననే నా యేకపుత్రుఁడు ముసలితనమునందు నా కెట్టి యాధారమును లేకుండ దిక్కుమాలినదానిగాఁ జేసి పోయినాఁడు!" అనియెను.

హేమాంగి యిఁక నెంతమాత్రమును సహింపఁజాలకపోయెను. హృదయాంతరాళమునఁ బ్రజ్వలించిపోవుచున్న సంతాపదావానల జ్వాలల నామె తనహృదయమునందే ఇఁక నడఁచుకొనఁజాలకపోయెను! అబలయగునామె యింకేమిచేయఁగలదు ? చిన్నబాలికవలె గోలు గోలున నేడువఁదొడంగెను. ఆమె యట్లే కొంతసేపటివఱకు నేడ్చి యుష్ణాశ్రు ధారాసంసిక్తంబులగు నయనంబులతో, గడగడ వడఁకుచు " నేనాతని జంపివైచితినా ? నీవిప్పుడు నాయొద్దకు వచ్చుట యీమాట చెప్పుటకేనా ? " అనియెను.

రమేంద్రునితల్లి గంభీరస్వరముతో " నాకుమారుఁ డేరీతిగా నరహతుఁడయ్యెనో యాసంగతు లన్నియును స్పష్టముగాఁ దెలిసికొనియే వచ్చితిని. అంతక్రూరముగా నాతని హత్యగావించినవా రెవ్వరై యుందురా యని రేయుంబవలు నేనాలోచించుకొనుచున్నాను. ఈ యూరిలోనివారందఱును నాతని కిష్టులేగాని యాతని కొక్కరును విరోధులు లేరని చాలమంది నాతోఁ జెప్పియున్నారు—నీవీయూరికి వచ్చియున్నసంగతి నాకీదినముననే తెలియవచ్చినది. ఈమాటవిన్న తోడనే నాకంతయు నాకస్మికముగా నవగతమైపోయినది—నాకన్న కుమారుఁడు—నాబంగారుతండ్రి — నాకన్నులకరవ్వారాంజనము—నా చక్కనిచందమామ—నానోముపంట — నాసర్వస్వము—ఏనిర్దయుని యీర్ష్యానలజ్వాలల కాహుతియైపోయెనో నాకొక్కనిమిషములోఁ దెలిసిపోయినది!—నీవు స్వయముగా నీచేతులతో నాతని జంపియుండుదు వని నేననుకొనలేదు—ఎట్టిదురవస్థలోనైనను నీయంతనీ వంతటిఘోర కృత్యమును జేయుటకు సాహసింపఁజాలవు ! కాని యితరులచే నట్టి దుష్కార్యమును జేయించుటకు నీవు కారణము గాఁగలవు ! అంతేకాక అట్లే జరిగినదా ? " అనియెను.

శిలావర్షముంబోలిన యాపరుషవచస్సముదాయముచేఁ దన సర్వాంగకములును గందిపోవుచుండ హేమాంగి యాదారుణబాధను సహించుచు మౌనముతో నాలకించుచుండెనే గాని యించుకంతయును గోపగింపఁజాలదయ్యెను. అట్లు హేమాంగి దుస్సహవేదన ననుభవించుచు మిగుల వినయముతోడను, దీనస్వరముతోడను వృద్ధురాలింగాంచి "అమ్మా! అతికర్కశంబులగునీకటువచనంబులచే నూరక నన్నేల వేధించెదవు? తల్లీ! వినుము! నాప్రాణముల నర్పించినచో నీకుమారుఁడు జీవింపఁగలఁడని తోఁచునేని నేనట్లు చేయుటకైనను సంసిద్ధముగా నున్నదానను!" అనియెను.

రమేంద్రునితల్లి తీక్ష్ణదృష్టితో హేమాంగి సకలాంగకములును దహించివైచుచున్నట్లుండెను. ఆమె మఱికొంతసేపైనతరువాత "నీవే నాకుమారుని సుఖజీవితమున కొకప్పుడు శాంతిభంగమును గావించి యుంటివి! నీవాతనిప్రాణమునకు నిశ్చయముగా శనిగ్రహస్వరూపిణి వైతివి! అందుచేతనే యాతఁడింతటిఘోరమరణమునకుఁ బాలుపడి పోయెను. సహజముగనే నాకు మీయం దనుమానము గలుగుటకుఁ గూడ నదియే కారణము!" అనియెను.

అట్టిభాషణోక్తులచే నావృద్ధురాలు తన్నావిధముగా నవమానించుచున్నను, హేమాంగిమాత్ర మించుకంతయును గోపము తెచ్చుకొనలేదు. ఆమె యపవాదభయముచేతను, అవమానదుఃఖముచేతను, సిగ్గుచేతను నిలువునఁ గ్రుంగిపోవుచుండెను. ఆ భావముతోనే యామె బాష్పగద్గదస్వరముతో "అమ్మా! ఈమాటలన్నియు నిప్పుడెందులకు! ఎన్నాళ్ళక్రిందటనో జరగిపోయిన విషయములంగూర్చి యెత్తిపొడుచుచు నిదివఱకే యుడికిపోవుచున్న నా హృదయమునందు భీషణదావానల జ్వాలలను రగులుకొల్పెద వెందులకు? ఈ నగరమునందు డాక్టరుపని చేయుచున్న నీకుమారుఁడు చచ్చిపోవుటకు సిద్ధముగానున్న నాకుమారుని

ప్రాణములను రక్షించియున్నాడు. అట్టి మహోపకారియగు నీ కుమారుని విషయమున నంతటిఘోరకృత్యమునకు నేను చేయగలుగుదునా?" అనియెను.

ఈసారిమాత్రము రమేంద్రునితల్లి కంఠస్వరము మఱియొక విధముగా మార్పు చెందెను. ఆమె మృదుస్వరముతో "అదియేమమ్మా! అట్లగపడుచున్నావు! అస్వస్థతగానున్నదా యేమి? పైకిఁ జూడఁగా నేమియు జబ్బుచేసినట్లు దోఁచుటలేదు. మనోవ్యాధివలె నగపడుచున్నది! ఎందుచేతనమ్మా!" అనియెను.

అప్పుడు హేమాంగి సరళహృదయముతో "అమ్మా! నీ యెదుట రహస్య మెందులకు? సత్యము చెప్పుచున్నాను. నీ కుమారుఁడు దుష్టులచేఁ జంపఁబడెనను ఘోరవార్త నాకస్మికముగా నాకర్ణించి నప్పటినుండియు నతిదుస్సహంబగు శోకసంతాపముచే నిరంతరమును బాధపడిపోవుచున్నాను! నిశ్చయముగా నామాట నమ్ముము! ఆతని నెవ్వరు చంపిరో నాకేమియును దెలియదుతల్లీ! అనియెను.

వృద్ధు : సరే! నీ కేమియును దెలియకపోవచ్చును! అనగా— నీవేమియును జేసియుండకపోవచ్చును—కాని నా కుమారునిఁ జంపిన వాఁడు నీ నాథుఁడు గాఁడా?

హేమాంగి యదరిపడి "నా నాథుఁడా? ఆయనకు రమేంద్రునిఁ జంపవలసిన యావశ్యక మేమున్నది?" అనియెను.

ఆ యవస్థలో హేమాంగిహృదయ మేవిధముగాఁ గొట్టుకొని పోవుచున్నదో యథారూపముగా నెవ్వరు వర్ణింపఁగలరు? అప్పుడామె ప్రాణవాయువులు హృదయమును బగులగొట్టుకొని పైకెగసిపోవునా యనునట్లుండెను—కొన్నినిమిషముల క్రిందటనే హేమాంగి రక్తవిలసితములగు తననాథునివస్త్రములను, భగ్నమైపోయిన చేతికఱ్ఱను గాంచి

రమేంద్రుని వధించినహంతకుని గుర్తించుటకుఁ దగినముఖ్యప్రమాణ
ములను దెలిసికొని యుండెను. వానిని బట్టిచూడఁగా నట్టిఘోరనర
హంతకుఁ డెవ్వఁడు? తన ప్రాణేశ్వరుఁడగునాథుఁడు! తనపుత్రికా
పుత్రకులజనకుఁడు! — అట్టిదారుణ నృశంసునితోఁ జిరతరంబును,
దృఢతమంబునగు నాత్మసంబంధముగల హేమాంగి యెట్టయెదుట
నిప్పుడు దుర్మరణమునకుఁ బాల్పడిపోయిన రమేంద్రునితల్లి కూర్చుండి
యున్నది! అక్కటా! హేమాంగిహృదయమునందలి దురవస్థ
యనుభవైకవేద్యమే గాని వర్ణించుటకు సాధ్యమైనది గాదు. అప్పుడామె
యుచ్ఛ్వాసనిశ్వాసములు కట్టువడిపోయెను. ఆకస్మికముగా నామెకు
బాహ్యజ్ఞానము నశించిపోయెను. నిశ్చేష్టయై శిలాప్రతిమవలె నట్లే
నిలువఁబడిపోయెను.

కొంతసేపైనతరువాత హేమాంగి యొకతెఱుంగకుండఁగనే
"అమ్మా! నేను నీకుమారున కెన్నఁడైన ననిష్టముం గల్పింతునని
నీ హృదయములో నెప్పుడును భావింపవలదు! అట్లగుట యెన్నఁటికి
నసంభవమని యెఱుంగుము!" అనియెను.

ఆమాట విని రమేంద్రునితల్లి మంచముపైనుండి చటాలున
లేచి నిలువఁబడియెను. హేమాంగి నిర్వీర్యపడిపోయెను. అప్పుడా
వృద్ధురాలు తీవ్రదృష్టిం గాంచుచుఁ దీవ్రస్వరముతో "హేమాంగీ!
నీవు చాలకాలముక్రిందటనే యొకప్పుడు నా సుఖమునకును, శాంతికిని
వినాశకురాలవైతివి. నీ మూలముననే నాకుమారుఁడింతకాలమువఱకును
బెండ్లిచేసికొనక బ్రహ్మచారియై యున్నాఁడు—పూర్వమొకప్పుడు
నేను నిన్నుఁజూచుటకై కలకత్తాలో మీయింటికి వచ్చితిని. నీతో
నేనప్పుడే చెప్పితిని! ఏమని?—ఎప్పటికైన నీ జీవితము దుఃఖములు,
యాతనలు, కష్టములు మొదలగువానితోఁగూడిన శ్మశానక్షేత్రముగా

మాఱుటయే తటస్థించినచో నప్పుడే నీస్వయంకృతాపరాధమునకు, బుద్ధిపూర్వకముగాఁ జేసినపాపమునకు—దగినశాస్తి కాఁగలదు!" అని చెప్పితినిగాదా? జ్ఞాపకముగా నున్నదా? ఇప్పుడుకూడ నామాటయే చెప్పుచున్నాను—నామాట నీకు బాగుగ ననుభవములోనికి వచ్చుచున్నదా?" అనియెను.

హేమాంగికిఁ గంఠరోధమైపోయెను. ఆ వృద్ధురాలు చెప్పినట్లు నిశ్చయముగా నిప్పుడు హేమాంగి విజ్ఞానకృతంబగు తనపాపమునకుఁ దగినశిక్ష ననుభవించుచున్నది! అప్పుడే యామెకోమలహృదయమున భయంకరనరకయాతన యారంభమైనది—ఆబ్బా! అది యెంతఘోరతరమైనది!

రమేంద్రుని తల్లి యట్లు మాటాడుచునే ద్వారమువఱకును బోయి యతిగంభీరస్వరముతో "హేమాంగీ! అట్లయినచో నాకుమారునిహత్య గావించినహంతకు లెవ్వరో నీకుఁ దెలియునే తెలియదా?" అనియెను.

హేమాంగి యతిక్లిష్టముగా దీర్ఘనిశ్శ్వాసమును విడుచుచు "నేనాఁడుదానను! వీథిమొగమెఱింగినదానను గాను! ఇట్టిచో నాకీసంగతు లన్నియు నెట్లు తెలియునని కొంటివి?" అనియెను.

రమేంద్రునితల్లి మఱియేమియును మాటాడకుండఁగనే యటనుండి వెడలిపోయెను. ఆమెతోఁ గొంతదూరమువఱకును బోయి సాగనంపి సెలవుగైకొని మరలివచ్చుట హేమాంగివంటి యుత్తమగృహిణి కుచితమైనపని! అట్లుచేయుట మర్యాద—కాని హేమాంగి యప్పుడు తనగృహిణీధర్మమును నిర్వర్తించుటకు సాహసింపఁజాలకపోయెను. ఆ వృద్ధురాలు పోయినంతనే హేమాంగి యచ్చట గూలఁబడిపోయెను.

ఆమెకన్నులలో నీప్రపంచమంతయును గిఱ్ఱున దిరిగిపోవుచుండెను. మహాకోలాహలమయంబులగు భయంకరమస్స్వప్నములు జాగ్రదవస్థయందే యామెకన్నులయెదుటఁ దాండవమాడుచుండెను !

## పందొమ్మిదవ ప్రకరణము

ఇంతలో హేమాంగి కాయింటి వెలుపల నెవ్వరిదో యడుగుల చప్పుడగుచున్నట్లు వినవచ్చెను. ఆశబ్దము విన్నంతనే యామెప్రాణవాయువు లొక్కసారిగాఁ జలించిపోయెను. రమేంద్రనాథునితల్లి వెనుదిరిగి మరల వచ్చుచుండెనేమో యని యామె భయపడియెను.

లేదు——ఈసారి యామె రాలేదు! హేమాంగి యొక్కదీర్ఘశ్వాసమును విడిచి గుండెలు కుదురుపఱచుకొని చటాలున లోపలికిఁబోయెను. ఆవచ్చినయామె హేమాంగి పినతల్లియే——

ఆమె తిన్నగా హేమాంగిచెంతకుఁ బోయి నిలువఁబడియెను. కాని హేమాంగి యామెతో నేమియును మాటాడఁజాలకపోయెను. పినతల్లి నిర్వ్యాజపడుచు నామెపార్శ్వమునకుఁ బోయి కూర్చుండెను. కొంతసేపటివఱకు నామెయును మాటాడలేదు. తుద కామె మెల్లగా "అమ్మా! అదియేమి యట్లున్నావు ? అనారోగ్యముగా నున్నట్లు తోఁచుచున్నది——ఏమమ్మా !" అనియెను.

అప్పుడుగూడ హేమాంగి మాటాడలేదు. మాటాడుటకుఁ గూడ నామెకు శక్తి లేకుండెను. క్షణక్షణమునకు నామె హృదయకుహరమునఁ బ్రచండచింతానలము ప్రజ్వరిల్లిపోవుచుండెను. ఆ భీషణ సంతాపముచే నామె సకలాంగకములును దహింపఁబడిపోవుచుండెను.

హేమాంగిపినతల్లి మరల మెల్లమెల్లఁగా "అమ్మా! ఈఘోర హత్యంగూర్చి యీ నగరమునందలి ప్రజలలో ననేకులనేకవిధములుగాఁ జెప్పుకొనుచున్నారు—అమ్మా! నాకుఁగూడ సంశయము తీఱుట లేదు. నిన్నొకటిరెండుమాట లడిగి తెలిసికొనవలయునని యనుకొనుచున్నాను!" అనియెను.

పినతల్లి యిట్లడుగుచున్నను హేమాంగి యేమియును మాటాడుట లేదు. ఆమెదృష్టియంతయును బినతల్లిచూపునందే నిశ్చలమై యుండెను. నోట మాటమాత్రము లేదు!

ఆ స్థితిగతులం గాంచి పినతల్లి సంభ్రమించుచు "అమ్మా! ఇటు వినుము! లోకభీకరంబగు నీ ఘోరహత్య నెవ్వరు గావించి యుందురో, యెవ్వరి కీసంగతి యించుకంతయును దెలియదో యను విషయముంగూర్చి నేనిప్పుడు నిన్నడుగరాలేదు. మనసతీశుఁ డారాత్రి మనతోఁ జెప్పినమాటలును, ప్రఫుల్లకుమారుని యెదుట మన సతీశునకును మందిరపాలకునకును జరగిన సంవాదమునుగూడ నీయూరి వారందఱికిని దెలిసిపోయినది. దీనింగూర్చి యీ నగరమునం దొక్కొక్క రొక్కొక్కవిధముగాఁ జెప్పుకొనుచున్నారు. రమేంద్ర నాథుని హత్యజరగిన ట్రీయూరిలో నెవ్వరికిని దెలియకుండఁగనే రమేంద్రుఁడు చంపఁబడియెనని యంతఱికంటెను ముందుగా మనసతీశుఁ డెట్లు చెప్పఁగలిగినాఁడు? కేవలము చంపఁబడియెనని చెప్పుటయే గాదు—ఏరీతిగా వధింపఁబడియెనో యా సంగతు లన్నియును

స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు—అమ్మా! సతీశుఁ డివిషయమంతయును మనకుఁ జెప్పకయే యున్నచో నెంతియో బాగుగా నుండును! తెలివితక్కువదాననగు నేనైనను వెనుకముందు లాలోచించుకొనఁ జాలకపోయితిని—ప్రఫుల్లబాబు మనయింటికి వచ్చినప్పుడు ప్రాస్రగుచ్చి నట్లన్ని సంగతులును నాతనితోఁ జెప్పివైచితిని. ఇప్పుడేమనుకొన్న నేమిలాభము? మనమాఁడువాండ్రము—కేవలము మూర్ఖురాండ్రము—వ్యవహారజ్ఞానశూన్యలము—మనకుఁ దూరదృష్టి యనునది యించుకంతయు నుండదు! అందుచేతనే స్త్రీబుద్ధి ప్రళయంకరీ" అను సత్యవచనము చిరకాలమునుండి లోకమునందుఁ బ్రతిధ్వనించి పోవుచున్నది "అమ్మా! ఏమిచేయుదును! జరిగిపోయినదానికై యిప్పుడెంతవిచారించినను లాభము లేదు. తెలివితక్కువతనముచే మనము చేసినపనివలన ముందునుండెట్టి యాపదయును రాకుండఁ జేసికొనుటకై యేదేనొకయుపాయము నాలోచించుకొనవలయును" అనియెను.

ఆ మాటలు విన్నంతమాత్రముననే మందభాగ్యురాలగు హేమాంగిప్రాణములు నిలువునన నెగసిపోయినట్లయ్యెను. నడఁకిపోవుచున్న కంఠస్వరముతో నామెనోటినుండి "అయ్యో! దేవుఁడా!" అనుమాట వెలువడియెను.

అప్పుడు పినతల్లి తత్తరముతో నామెను గౌఁగిలించుకొని "హేమా! భయపడకుము! నాకొకయుపాయము దోఁచుచున్నది" అనియెను.

హేమాంగి నిట్టూర్పులు విడుచుచు వికలహృదయముతో "ఇంతపని జరిగినతరువాత నింకను తప్పించుకొనుట కుపాయ మేమున్నది!" అనియెను.

పినతల్లి : ఉపాయ మున్నది తల్లీ ! సమయము వచ్చినపు డీ విషయములో నేనును, మన సుధాంశుఁడునుమాత్ర మించుక అసత్యము చెప్పవలసి యుండును—ఒకవేళ పోలీసువారు మనయింటికి వచ్చి మిమ్ము బ్రశ్నించుటయే తటస్థించినయెడల—నిశ్చయముగా నీయభియోగ ములో వారు మమ్ములను విచారణ సేయకుండ విడిచిపెట్టరు లెమ్ము!— ఆ సమయమునందే మేమిరువురమును గొంచెము మాటమార్చి చెప్ప వలయును. సతీశుఁడు మనతోఁ జెప్పినట్లే చెప్పినచోఁ గొంప మునిఁగి పోవును—మనమిప్పు డాలోచించుకొన్నరీతినే సతీశునిచేఁగూడఁ జెప్పింపవలయును—ఇంతపని జేసినఁగాని మనమర్యాద దక్కదు.

హేమాం : ఇదివఱకే మనమాట లన్నియును లోకమునఁ బహిర్గతమునవిగాదా ? ఇప్పుడు మరల నేమి చెప్పుట కవకాశ మున్నది ?

పిన : అవకాశమున్నది తల్లీ ! మన సుధాంశుఁడు గిరిధీనుండి యీరాత్రి బయలుదేఱి మనయింటికి వచ్చుచున్నట్లును, ఆతఁడు డాక్టరు రమేంద్రునియింటియొద్దకు వచ్చునప్పటి కచ్చటఁ జాలమంది జనులు గుంపుగూడి యున్నట్లును, ఆతఁడుగూడఁ గొంతసేపచ్చటనే నిలువఁబడి యున్నట్లును, అప్పుడు రమేంద్రునిమృతదేహమును జూచి యనేకవిధముల సంభాషించుకొనుచు విచారించుచున్న వారింగాంచి యదియేమని సుధాంశుఁ డడిగినట్లును, జరిగినవృత్తాంత మంతయును వారాతని కప్పుడు తెలిపినట్లును, ఆ ఘోరవార్త నాలకించి సుధాంశుఁడు మనయింటికి వచ్చినతరువాత మనకందఱకును జెప్పినట్లును పోలీసువారి యొద్ద సుధాంశుఁడు చెప్పవలయును.

హేమా : కాని యట్లు జరిగినదా ? ఊరక యట్లు చెప్పుట యసత్యము గాదా ?

హేమాంగి యవర్ణనీయంబగు హృదయతాపముచే బరితపించి పోవుచుండెను. ఆమె మనసుమనసులో లేదు—ఒడలిలో చైతన్యము లేదు—అప్పు డామె యస్పష్టంబగు గద్గదస్వరముతో "ఔను—అట్లే చెప్పవలయును—అంతకంటె — అయ్యో! పరమేశ్వరా! ఈ నిర్భాగ్యురాలి లలాటమునందీ వ్రాతగూడ వ్రాసితివా? హా!—" అనియెను.

పీన : ఇప్పు డీమాట లన్నియు నెందులకు తల్లీ! ఏమనుకొని యేడ్చినను నీకేమి ప్రయోజనములేదు. ఏవిధముగా మనసతీశుడు రక్షింపబడునో, ఏయుపాయముచే మర్యాద దక్కించుకొని మన మందఱము బ్రదుకుదుమో యదియే మనమిప్పుడు చేయవలసినపని! వట్టి సంశయములను గల్పించుకొని యూరక దేవులాడుటవలన నెంత మాత్రమును లాభము లేదు—మానప్రాణములను రక్షించుకొనుటయే మనకిప్పు డవశ్యకర్తవ్యము! ధర్మదైవతములంగూర్చి తరువాత జూచుకొందము!

హేమా : సరే—కాని—సుధాంశుడు—ఆతం డట్లు అసత్యము చెప్పుటకు—

పిన : నీకాసంశయ మక్కఱలేదు. నీవాతనివిషయమున నిశ్చింతురాలవై యుండుము! సుధాంశు డంత తెలివితక్కువ పిల్లవాడు గాడు! సమయమెటువంటిది! ధర్మదైవతములను లెక్కించు కొనుచు మూర్ఖపుబట్టుపట్టుకొని కూరుచున్నచో గొంపలు మునిఁగి పోవా? నేనిదివఱకే యాతని కెల్లసంగతులను జెప్పియున్నాను—తప్పక యాతడట్లే చెప్పితీరును! నీవాతనికొఱ కేమియును భయపడ నక్కఱలేదు. ఇంతవఱకు మనమందఱము నదృష్టవంతులమే—ఆరాత్రి సతీశుడు మనతో నీ సంగతు లన్నియును జెప్పుచున్నప్పుడు మనదాస దాసీజనులెవ్వరును దగ్గఱ లేకపోవుట యెంతయో యుపకారమైనది.

వారు కూడ నచ్చటనే యుండి యంతయును వినియున్నారో? నిక మనకు గత్యంతరమేమైన నుండునా?

హేమాంగి యిక నేమియును మాటాడలేదు. మౌనముతో నట్లే కొయ్యబొమ్మవలె కూర్చుండి యుండెను. అప్పుడు పినతల్లి యామెనోదార్చి మెల్లగా "అమ్మా! ఇప్పుడు మనమాలోచించు కొన్న సంగతులన్నియును సతీశుడు వచ్చినతరువాత నాతనితోఁ జెప్పుము—మనమనుకొన్న రీతిగా నాతఁడు కూడఁ జెప్పినచో నిదవఱ కాతనిమాటలవలన లోకులకందఱకును సతీశునియెడలఁ గలిగిన యనుమాన మంతయును నొక్కసారిగా వదలిపోవును. మనమందఱమును బ్రదికిపోవుదము. గందరగోళమంతయును సమసిపోవును" అని చెప్పి యటనుండి వెడలిపోయెను.

పినతల్లి యట్లు వెడలిపోయెను గాని హేమాంగి యింకను నచ్చటనే చెక్కిటఁ జేయి చేర్చుకొని శూన్యహృదయముతోఁ బాషాణప్రతిమవలెఁ గూర్చుండి యుండెను. అప్పు డామె తల పగిలి పోవునేమో యనునంతటిబాధగా నుండెను. వేడినిట్టూర్పు లతి తీవ్రముగా వెలువడుచుండెను. ఆమె భయసంశయానూన దుఃఖములచే నుక్కిరిబిక్కిరియై పోవుచుండెను. చాలసేపటివఱకు నట్లే కూర్చుండి తుద కామె యటనుండి చటాలున లేచి చిన్నబాబు పరుండియున్న గదిలోనికిఁ బోయి యాతని మంచముపై శయనించెను.

ఆమె పినతల్లి సతీశునితోఁ జెప్పవలయునని హేమాంగికిఁ గొన్నిమాటలు చెప్పి పోయియుండెను. సరళస్వభావయు, సంతప్తహృదయయు నగు నామె యామాట లాతనితో నెట్లు చెప్పఁగలదు? అట్లు సాహసించి చెప్పుట యామెవంటి నిర్మలప్రకృతికి సాధ్యమగునా? ఆమె పలువిధముల నాదినమంతయును భావించుకొనుచునే యుండెను.

సతీశచంద్రుఁ డప్పుడింటిలో లేఁడు. ఆతఁడు బయటికిఁ బోయియుండెను. హేమాంగి యప్పు డొంటిగా మంచముపైఁ బరుండి యావిషయమును గూర్చియే యాలోచించుకొనఁ దొడంగెను—యెంతయాలోచించినను—ఆలోచనలతో దినమంతయును గడచిపోయెను గాని యామె యేమి చేయుటకును స్థిరపఱుచుకొనఁజాలకయేపోయెను.

సాయంకాలమైనది. సతీశుఁడు తిరిగితిరిగి యింటికి వచ్చెను. వచ్చినవెంటనే యాతఁడు గదిలోనికిఁ బోయి మంచముపై శయనించి యున్న సతీమతింగాంచి సంభ్రమముతో "అదియేమి యట్లుపరుండి యున్నావు? ఏమైనను జబ్బుచేయలేదు గద!" అని పలుకరించెను.

హేమాంగి యేమని చెప్పఁగలదు? ఇప్పు డామెకుఁ గలిగిన దుస్సహమగు మనోవ్యాధి యిట్టిదని నిర్దేశించుటకు సాధ్యమైనదా? అప్పు డామె హీనస్వరముతో "ఔను—కొంచె మస్వస్థముగా నున్నది" అనియెను.

సతీ: ఆలాగా? అట్లయినచో నిచ్చటఁ బరుంటివేమి? నీగది లోనికిఁ బోయి హాయిగా నిద్రింపఁగూడదా? అచ్చట విశ్రాంతిగా నుండును.

హేమాం: అక్కఱలేదు. కొంచెముసేపిచ్చటనే పరుండెదను. నాకిక్కడనే సుఖముగా నున్నది.

సతీశుఁ డప్పుడు ప్రేమమయహృదయముతో మందహాసము చేయుచు సమీపమునకు వచ్చి యించుక వంగి ప్రియురాలి ప్రశస్త లలాటఫలకమునఁ జుంబనమాచరించుట కుద్యుక్తుఁ డయ్యెను—అదిచూచి యామె యర్ధస్ఫుటం బగుగద్గదస్వరముతో నేడ్చుచుఁ దిలగడతో మొగము మూసివైచుకొనియెను. అప్పటికప్పుడే ప్రొద్దు గ్రుంకిపోయినది. ఆగదియందు నాలుగుమూలలనుగూడ నంధకారము

వ్యాపించుచుండెను. సతీశుఁ డాయంధకారములోఁ [illegible] యం బును, దుఃఖాశ్రుధారాసంసిక్తంబులు, అ[illegible] యతిమ్లానంబునగు నవ్వాననము? [illegible] యుండునా?

సతీశచంద్రుని ముఖము [illegible] సంధ్యారాగబంధురమైపోయెను. అప్పుడాతఁడు [illegible]స్వరముతో [illegible]భావముతో “హేమా! నీవేదియో వెఱ్ఱి యనుమానమును మనసులోఁ బెట్టుకొని యుంటివి గాఁబోలును! ఇదిగో! నేను సత్యముగాఁ జెప్పుచున్నాను— నీవూహించుకొనుచున్నదంతయుఁ గేవలము [illegible]!—వట్టి యనుమానము—” అనియెను.

సతీశుఁ డిట్లు స్పష్టముగాఁ జెప్పి మఱియేమియును మాటాడకుండఁగనే యాగదినుండి యవ్వలికి వెడలిపోయెను. ఇఁక నొక నిమిషమైన నచ్చట నిలువఁబడుట యాతని కిష్టము లేకపోయెను.

క్రమముగా సంధ్యాకాలము అతిక్రమించుచుండెను. ఒక్కొక్క అడుగుచొప్పున నీప్రపంచమునంతను గాఢాంధకార మాక్రమించుకొనఁ దొడంగెను. అదే సమయమని యాలోచించుకొని పినతల్లి హేమాంగి యొద్దకువచ్చి “అమ్మా! ఏమి. చెప్పితివి? సతీశునితో నామాట లన్నియును జెప్పితివా?” అని ప్రశ్నించెను.

హేమాంగి యతిఖిన్నంబును, గంపితంబునగు కంఠస్వరముతో “పిన్నీ! నీవే చెప్పుము! ఇట్టిమాట లన్నియును నేనాయనతోఁ జెప్పుటకు సాహసింపఁజాలకున్నాను” అనియెను.

పినతల్లి కొంతసేపటివఱకు నేమియు మాటాడక యట్లే నిలువఁబడి తరువాత మెల్లమెల్లఁగా “తుట్టతుదకు నీవిట్లే యుందువని నేనప్పుడే యనుకొంటిని—ఇఁక నేనే యాతనితోఁ జెప్పవలసియుండును నని

యూహించుకొనుచున్నాను. ఎట్లయిననేమి ! ఈ సమస్తవిషయములును సతీశునకుఁ దెలిసియుండుట చాలమంచిది ! ” అనియెను.

అప్పుడు హేమాంగి హృదయాంతరాళమునం దతిఘోరముగా జరగిపోవుచున్న దేవాసురులద్వంద్వ యుద్ధ కోలాహలము నెవ్వరు గ్రహింపఁగలరు ? “ ఆ ఘోరనరహంతకుఁడు నా భర్తయే !— కాదుకాదు ! ఆతఁ డెన్నఁటికైన నంతటిదారుణకృత్యమును జేయఁ గలఁడా ?—చేయకున్నచో నీ భయంకరహత్య యెట్లు జరగినది ! తగిననిదర్శనములు స్పష్టముగా నగపడుచున్నవే ! నాకన్నులార నేనే కనుఁగొంటినే—కాదుకాదు — వానికన్నిటికి నితరకారణములేవైన నుండి యుండును ! ఆయన యంతటి దుష్కృత్యమును జేయఁజాలరు— అని యీ విధముగా నిశ్చయాంతసందేహములచేతను, సంశయాంత నిశ్చయములచేతను నామెహృత్పిండము పగిలి బ్రద్దలైపోవుచుండెను.

# ఇరువదియవ ప్రకరణము

మరునాటి యుదయమునందు, ఇన్‌స్పెక్టరుగారు డాక్టరురమేంద్రనాథుని హత్యంగూర్చి విచారణ గావించుట కారంభించెను. ఆయన మొట్టమొదట రమేంద్రుని సేవకునిం బిలిపించి విచారించెను. ఆ సేవకుఁ డెప్పు డేస్థలమునందు దనయజమానుని మృతదేహము నే యవస్థలోఁ

గాంచి యుండెనో క్రమక్రమముగా సమస్తవృత్తాంతమును స్పష్టముగాఁ జెప్పివైచెను. రమేంద్రనాథుఁడు సేవకునియెడల విశేషప్రీతిగలవాఁడై యుండెను. అందుచే నాసేవకుఁడు రమేంద్రుని ఘోరమరణముం గూర్చి చెప్పునప్పుడు గోలుగోలున నేడువ నారంభించెను. అతని గండస్థలములనుండి దుఃఖాశ్రుధార లెడతెగకుండఁ బ్రవహింపఁ దొడంగెను.

రైల్వేకంపెనీవారి డాక్టరు రమేంద్రబాబు మృతదేహమునప్పుడు పరీక్షించి యుండెను. అతఁడుకూడ నిప్పుడు వచ్చియుండుటచే ఇన్‌స్పెక్టరుగా రాతనిం గాంచి "రమేంద్రబా బేవిధముగా హత్య గావింపఁబడియెనని మీరు కనుపెట్టఁ గలిగితిరి!" అని ప్రశ్నించెను.

అప్పుడు డాక్టరు సహజగంభీరస్వరముతో "ఎవ్వరోగాని రమేంద్రబాబు వెనుకపాటున వచ్చి బలవంతముగా మోటుకఱ్ఱతో నాతని తలపై మోదియుండును. ఆ యొక్క దెబ్బతోనే పాపమాతఁడు గిఱ్ఱున దిరిగి క్రిందఁబడిపోయినాఁడు—తరువాతఁ గొంచెసేపటిలోనే యాతఁడు మరణించి యుండును" అని చెప్పెను.

తరువాత నచ్చటినుండి ఇన్‌స్పెక్టరు తిన్నఁగా సతీశునియింటికి వచ్చెను. ఆయింటి దాస దాసీ జనులవలన నానాఁటిరాత్రి యించుమించుగా నెనిమిదిగంటలవేళ నటనుండి రమేంద్రనాథుఁడు వెడలిపోయిన ట్లాతనికిఁ దెలియవచ్చెను. ఆమాట హేమాంగికూడ నంగీకరింపకపోలేదు. ఇన్‌స్పెక్టరామె యొద్దకుఁ బోయి యడుగఁగా నామె యానాఁడు జరగిన యెల్లసంగతులను సవిస్తరముగాఁ దెలుపుచు "ఇంచుమించుగా రాత్రి యెనిమిదిగంటలవేళ రమేంద్రబాబు మాయింటినుండి వెడలిపోయెను" అని చెప్పెను.

అటుతరువాత సుధాంశునివిచారణ జరిగెను. అప్పుడు సుధాంశుడు "ఆనాడు నేను సికింద్రాబాదు రైలుబండిపై బయలుదేఱి రాత్రి చీఁకటిలో మధుపురము స్టేషనునందు బండిదిగి యూపీధిగుండ మాబావ యగుసతీశుని యింటికి వచ్చుచుంటిని. అప్పటికిఁ జాల రాత్రియైనట్లు బోధ యగుచుండెను. ఎల్లయెడల గాఢాంధకారము క్రమ్ముకొని కన్నులు గానరాకుండెను. అప్పటి కించుమించుగా నొంటిగంటరాత్రి యైయుండును. నేనప్పుడు సరిగా డాక్టరురమేంద్రబాబు నింటియొద్దకు వచ్చునప్పటి కచ్చటఁ జాలమంది ప్రజలు గుంపుగూడి యుండిరి. ఆగుమ్మమునొద్దఁ జాలగందరగోళముగా నుండెను. అది యంతయుం గాంచి మహాశ్చర్యయుతుఁడనై సంగతి యేమో తెలిసికొని మఱిపోవుద మని తలంచి నేనాగుంపులోఁ బ్రవేశించి యం దొకమనుష్యునింజూచి "ఏమిజరిగినది ? అని ప్రశ్నించితిని. ఇచ్చట నీయింటియజమాని యగు డాక్టరుబాబు నెవ్వరోదుర్మార్గుడు చంపిపఱవైచిపోయిరని యాతఁడు నాతోఁ జెప్పెను. క్రొత్తగా మధుపురము ప్రవేశించియుఁ బ్రవేశింప కుండఁగనే యిట్టిఘోరవార్త విననలసివచ్చినదాయని యప్పుడు నా హృదయము చాలఁ బరితపించిపోయినది. తరువాత నేనింటికిఁబోయి యీ దారుణవృత్తాంతమంతయును మాసతీశచంద్రునకుఁ దెలియఁ జేసితిని. ఆ సమయమునం దీయింటిలోనివా రందఱు నిచ్చటనే ఉన్నారు" అని చెప్పెను.

కుమారుఁడుచెప్పినమాటల నన్నిటిని క్రమముగా సమర్థించుచు నాతనితల్లియును జెప్పెను. ఇన్స్పెక్టరుగా రామెను బ్రశ్నించినతోడనే "అయ్యో ! ఆరాత్రి మాసుధాంశుఁ డూరినుండి బయలుదేఱి వచ్చునని మేము తలఁకొనియుండలేదు. కాని యాకస్మికముగా నీతఁ డంత రాత్రివేళ నింటికి వచ్చుటచే నెట్టికష్టము తటస్థించెనో యని నేను చాల భయపడిపోయితిని. అతఁడు వచ్చినతోడనే గిండీలో నాతనిపినతండ్రి

లేకపోవుటచే వెంటనే తిరుగుబండిలో బయలుదేఱి వచ్చితినని చెప్పెను. తరువాత నాతఁడు "స్టేషనునుండి వచ్చుచుండఁగా వీధిలోనే యొకయింటియొద్ద నరహత్య జరిగియుండఁగాఁ జూచితిని. అచ్చటివారి నందఱిని విచారింపఁగా నట్లు చంపఁబడినవాఁ డీనగరమునఁ బనిచేయుచున్న డాక్టరనియు, నాతనిపేరు రమేంద్రుఁడనియు దెలియ వచ్చెను." అని చెప్పియున్నాఁడు. ఈ గ్రామములో నిట్టి ఘోర హత్య జరిగెనని యాకస్మికముగా విని యప్పుడు మేమందఱమును భయాశ్చర్యనిమగ్నులమై పోయితిమి!" అని చెప్పెను.

ఆమె యింతవఱకుఁ జెప్పి యూరకున్నంతనే యిన్స్పెక్టరు నవ్వుచు నాశ్చర్యకరమగు కంఠస్వరముతో "అమ్మా! మీరిప్పు డిట్లు చెప్పితిరి గాని యిదివఱకు ప్రఫుల్లకుమారబాబుతో నీవిధముగాఁ జెప్పియుండలేదు. రమేంద్రబాబు హత్యగావింపఁబడిన వృత్తాంతము మొట్టమొదట సతీశచంద్రుఁడే మీతోఁ జెప్పిన ట్లాతనికిఁ జెప్పియున్నారు. కాని యిప్పు డాసంగతియే మఱియొకవిధముగాఁ జెప్పుచున్నారు. ఇట్లు చెప్పుటకుఁ గారణ మేమి?" అని ప్రశ్నించెను.

అప్పు డావృద్ధురాలు మరల గంభీరస్వరముతో "అయ్యా! ఆ రాత్రి రెండుహత్యలు జరిగెననుసంగతి మాకిప్పటి కేమియును దెలియనే తెలియదు. ఇంతేకాక యతిభయంకరమగు నిట్టిఘోరవార్త యాకస్మికముగా నాలకించుటచే భయాశ్చర్యములచే నామనసు చెదరిపోయినది. అందుచేతనే పొరపాటుపడి ప్రఫుల్లకుమారునితో నప్పుడు నేనట్లు చెప్పితిని. ఆ తరువాతనే సుధాంశుఁడు వచ్చి జ్ఞాపకము చేయుటవలన నేను పొరపాటు పడితిననియు, రమేంద్రుని హత్యా వృత్తాంతమును మొట్టమొదట మాకందఱకును జెప్పినవాఁడు సుధాంశుఁడే యనియు నప్పుడు నాకు స్మృతికి వచ్చినది!" అనియెను.

ఇట్లింతటివిచారణయు ముగిసినపిదప సతీశునివిచారణ ప్రారంభ మయ్యెను. అప్పుడు సతీశచంద్రుడు ఇన్‌స్పెక్టరుగారితో "అయ్యా! నేనారాత్రి యీవీధినే పయనించుచు రాత్రిలోనికి వచ్చుచుండగా త్రోవలో త్రొక్కియున్న దేవాలయమునందలి మందిరపాలకుడును, కోటపాలుడును నాకగపడిరి. వారు లాంతరుపట్టుకొని పరుగులెత్తిపోవుచుండిరి. అది యేమని నేనడుగగా మందిరపాలకుడు డీవీధినొక ఘోరహత్య జరిగినదని నాకు జెప్పియున్నాడు. ఆమాటవిని భయభ్రాంతుడనై యతిత్వరిత ముగా నింటికి వచ్చితిని. పిమ్మట రెండుజాములరాత్రియైన తరువాత సుధాంశుడు మాయింటికి వచ్చి డాక్టరురమేంద్రనాథుడు దొంగరిచేతనో వధింపబడెనని చెప్పెను. అంతటిఘోరవార్తను రెండుపర్యాయము లాలకించుటచే నాహృదయమంతయును గలగిపోయినది. అందుచేత రమేంద్రనాథునిహత్యంగూర్చి మందిరపాలకుడే మొట్టమొదట నాతో జెప్పినట్లు పొరపాటుపడితిని. ఏమనిన—త్రోవలో మందిరపాలుడు హత్యజరిగెనని చెప్పెను. తరువాత సుధాంశుడు వచ్చి రమేంద్ర నాథుడు చంపబడియెనని చెప్పెను. ఆకారణముచే మందిరపాలుడు కూడ రమేంద్రనాథుడు హతుడయ్యెననియే చెప్పియుండునని అను కొంటిని. ఆరాత్రియే రెండుహత్యలు జరిగిపోయెననుసంగతి నాకప్పటి కెంతమాత్రమును దెలియనే తెలియదు. ఇద్దఱివలన రెండుపర్యాయ ములు వినుటయు హత్యయొక్కటియే యనిభావించుటయు—ఇవియే నేనట్లు పొరపాటుపడుటకు ముఖ్యకారణములు!" అని చెప్పెను.

ఇన్‌స్పెక్టరు విచారణచేయునిమిత్తమై సతీశచంద్రునియింటికి వచ్చినసమయమునందు ప్రఫుల్లకుమారబాబు మొదలగు పెద్దమనుష్యు లనేకు లాతనితోగూడ నచ్చటికి వచ్చియుండిరి. విచారణయంతయును ముగిసి ఇన్‌స్పెక్టరు వెడలిపోయినతరువాత ప్రఫుల్లకుమారుడు

మందహాసము చేయుచు సతీశచంద్రుని మొగముదంక నిశ్చలదృష్టిం గాంచి "మిత్రమా! ఈవిషయముంగూర్చి నీవొకవిధముగను, మందిర పాలకుండు మఱియొకవిధముగను జెప్పుటచే నందు సత్యమేదియో, యసత్యమేదియో నిశ్చయించుకొనఁజాలక యింతవఱకు మేమందరమును గూడ నెంతయో గందరగోళమునఁ బడిపోవుచుంటిమి. ఈవ్యవహా రకారణముచేఁ గలిగినదో యిప్పటికింతవఱకును బోధపడినది! నిజమే! ఇట్టిఘోరవార్త లాకస్మికముగా నాలకించినప్పుడెట్టివారికైనను మనసు చెదరిపోకమానదు! అది యంతయాశ్చర్యము గాదు! మధుపురము వంటిచిన్న నగరములో నొక్కరాత్రివేళ రెండుఘోరహత్యలు జరిగెనని విన్నప్పుడెవ్వరు తల్లడిల్లిపోనక యుండఁగలరు?" అనియెను.

సతీశచంద్రుఁ డప్పుడు ప్రఫుల్లకుమారునిమాట కడ్డము వచ్చి "ఏదియో యొకహత్య జరిగినట్లు మందిరపాలకునివలన నేనిప్పుడు వినియుంటిని. తరువాత నర్ధరాత్రివేళ సుధాంశుఁడు వచ్చి డాక్టరు రమేంద్రబాబు హంతకులచే వధింపఁబడియెనను భయంకరవార్తను జెప్పెను! అప్పుడు నేను మందిరపాలకుఁడుగూడ రమేంద్రనాథుఁడు హత్య గావింపఁబడియె ననియే చెప్పియుండు నని యనుకొంటిని. అప్పటివఱకు రెండుహత్యలు జరిగినట్లు నాకుఁ దెలియకపోవుటచే మందిర పాలకుండు చెప్పినహత్యావృత్తాంతమును, సుధాంశుఁడు చెప్పిన హత్యసమాచారము నొక్కటియే యని నేను భావించుకొంటిని" అనియెను.

ప్రఫుల్లకుమారుఁడు తలయూఁచుచు "ఏమైననేమి? ఇప్పటికి గందరగోళమంతయును వదలిపోయినది. ఇదియే నాకు సంతుష్టిగా నున్నది" అనియెను.

ఇట్లు చెప్పి ప్రఫుల్లకుమారుఁడు పరకుండుటయు సతీశుఁడాతనిం గాంచి "రమేంద్రుని హత్యవిషయమై పోలీసువారెట్లు భావించు చున్నారు? దుష్టప్రవర్తకులగు బందిపోటుదొంగ లాతని జంపియుండరని వారభిప్రాయపడు చున్నారఁట గాదా?" అని ప్రశ్నించెను.

ప్రఫు: ఔను—బందిపోటు దొంగలవలన రమేంద్రుని హత్య జరగియుండు ననుటకుఁ దగిననిదర్శనము లేవియు నగపడుట లేదని పోలీసువారి యుద్దేశము. అట్టిహంతకులు కేవలమును ధనముకొఱకు నరహత్యలు గావించుచుందురు. కాని యీహత్య యందునిమిత్తమై జరగినట్లు లేదు. ఏమనిన — రమేంద్రుని బంగారుగడియారమును, గొలుసును, ఆతని వజ్రపుటుంగరమునుగూడ దొంగిలింపఁబడి యుండ లేదు. మృతదేహమును బరీక్షించినప్పు డవియన్నియు నగపడినవి!

సతీశచంద్రుఁ డన్యమనస్కుఁడై "ఆలాగా? వానిలో నేది యును బోనేలేదా? అట్లయినచో రమేంద్రు నావిధముగా నూరక వధించిపోవుటకుఁ గారణ మేమై యుండును?" అనియెను.

ప్రఫుల్లకుమారుఁ డించుక సేపాలోచించి "ఆ విషయమును గుఱించియే యీనగరములోని పోలీసువా రెవ్వరు నిదమిత్థమని యాలోచించి నిశ్చయింపఁజాలకున్నారు. సతీశబాబూ! ఇట్లూరకున్న లాభములేదు స్నేహితులమగు మనమందఱమును గలసి చందాలు వేసికొని కొంతధనములు ప్రోగుచేసి రమేంద్రనాథుని ఘోరహత్యం గూర్చి సప్రమాణముగా హంతకుని నిరూపింపఁగలవారి కాధన మంతయును బహుమాన మిచ్చునట్లు ప్రకటింపవలయును. అట్లు గావించినఁగాని యీ దారుణహత్యారహస్య మెన్నఁటికిని బయలుపడ నేరదు" అనియెను.

సతీశచంద్రుఁ డామాటవిన్నతోడనే చటాలున లేచి నిలువఁబడి "ప్రఫుల్లబాబూ! నేనుగూడఁ జందా నిచ్చుటకు సిద్ధముగా నున్నాను. ఎట్లయిన రమేంద్రబాబును వధించినహంతకుని బట్టుకొనువిషయములో

నన్నెంతసొమ్ము చందా నిమ్మందువో చెప్పుము. నీవెంత చెప్పిన నంతసొమ్మును నేనిచ్చివైచెదను—ఇంతఘోరముగా నొక్కరాత్రివేళ రెండుహత్యలు జరగుటవలన నీనగరమునందలి ప్రజలందఱును భయభ్రాంతులై పోవుచున్నారు. ఇట్టిగందరగోళములతో నిండియున్న యీపట్టణమునందిఁక నేనుండఁజాలనని నాభార్యకూడఁ జాల భయపడి పోవుచున్నది! సరే—దానికేమి? ఆ సంగతి తరువాతఁ జూచు కొందము—ఇప్పుడు నన్నుఁ జందాక్రింద నెంతసొమ్మియ్యమ్మందువు?" అనియెను.

ప్రఫు: ఈ నగరములో నంతగాఁ జందాల నీయఁదగిన పెద్ద మనుష్యు లెందఱో లేరు. అయినను—అందఱును గలసి తలకొక పదిరూపాయలను జందా యిచ్చినచో నించుమించుగా నైదువందల రూపాయలైనను ప్రోగుపడునని యూహించుచున్నాను.

ఆమాట విని సతీశచంద్రుఁడు మందహాసము చేయుచు "అయిదువందలరూపాయలనిన విశేషద్రవ్యము గాదు. ఆ మాత్రపు సొమ్మువలన నింతటిఘనకార్యము కొనసాగునని నాకెంతమాత్రమును ధైర్యము లేదు!" అనియెను.

ప్రఫు: ఈ మధుపురమువంటి చిన్నునగరములో నైదువందల రూపాయలచందాధనము ప్రోగుపడుటయే చాలగొప్ప—ఇంతకంటె నధికముగా నీయూర ధనము లభించునని నాకెట్టియాశయును లేదు. సరే—ఈ మాటలకేమి? నీమట్టునకు నీవెంతచందా నిచ్చెదవో చెప్పుము?

సతీశచంద్రుని కంఠస్వరము గంభీరమయ్యెను. "కేవలము నుత్సాహముతో నాతఁడు నేనైదువేలరూపాయలను చందాక్రింద నిచ్చెదను!" అనియెను.

అయిదువేల రూపాయలు! అప్పుడచ్చట నున్న ప్రఫుల్లబాబును, ఆతనితో వచ్చిన పెద్దమనుష్యులందరును గూడ దామెన్నఁడు నాసించియైన నెఱుంగనంతటి విశేషద్రవ్యము నొక్కఁడుమాత్రమే యిచ్చెదనని చెప్పుటచే విస్మయాక్రాంతహృదయులై సతీశుని మొగము వంక నిశ్చలనయనములతోఁ జూచుచుండిరి. ఔను! ఆశ్చర్యము గాదా? సతీశచంద్రునకును రమేంద్రునకును విశేషసంబంధ మేమున్నది? రమేంద్రుని హంతకుని బట్టుకొనుటకై సతీశుఁడంత ద్రవ్యము నేల వ్యయ పఱుపవలయును?

అప్పుడు సతీశచంద్రుఁడు చటనున్నవారందఱిమనోభావములను గ్రహించి "అయిదువేలరూపాయిలనిన నెంతయో హెచ్చుద్రవ్యము గాదు! అంతటిధనము నుపయోగించి ప్రయత్నించిన వో డాక్టరు బాబును హత్యగావించిన క్రూరహంతకుఁడు పట్టువడుటయే తటస్థించి నచోఁ బరమానందముతో నైదువేలరూపాయలను వెచ్చపెట్టుటకు నేను సిద్ధముగా నున్నాను" అనియెను.

అప్పటికే సాయంకాలమైపోవుటం గాంచి ప్రఫుల్లకుమారుఁడును దక్కిన పెద్దమనుష్యులును దమతమస్థానములకు వెడలిపోయిరి. కాని సతీశచంద్రుఁడుమాత్ర మచ్చటనే శిలావిగ్రహమువలెఁ గూర్చుండి పోయెను. అతని హృదయమునం దించుకంతయైనను శాంతి యనునది లేకుండెను. ఈప్రపంచమంతయును గాఢాంధకారపూరితమై యాతని కన్నులలోఁ దిరిగిపోవుచున్నట్లనుభవమగుచుండెను. అప్పుడాతనికి నలుదెసలయందును గేవలమసారమును, అనంతమును, విశాలమును, భీషణమునగు మహాశూన్యప్రదేశమే కానవచ్చుచుండెను!

# ఇరువదియొకటవ ప్రకరణము

సతీశచంద్రుఁ డావిధముగాఁ దనప్రేక్షకమందిరమునం దెంతసేపు గూర్చుండి యుండెనో నిశ్చయముగా నాతనికే తెలియలేదు! అకస్మాత్కముగా నాతనికేదియో తోఁచుటచే నాతఁడు చటాలున లేచి నిలువఁబడి—కొంతసేపటి కటునుండి యివలి మెల్లమెల్లఁగా లోపలఁ బ్రవేశించెను—క్రమక్రమముగా నాతఁ డంతఃపురమునకుఁ బోయి విచారింపఁగా హేమాంగి తనపడకగదియందే పరుండి యుండెననియు, నేఁడొక్కసారైనను లేవనే లేదనియు, నామెశరీరమునందు కేవల మస్వస్థతగా నున్నదనియుఁ దెలియవచ్చెను. ఆమాట విని సతీశుఁడు తనహృదయేశ్వరి నొకసారి చూడవలయునను నుద్దేశముతో మెల్ల మెల్లఁగా నామెపడకటింటిలోఁ బ్రవేశించెను.

అప్పుడు హేమాంగి యొకమంచముమీఁద నస్వస్థమనస్కయై గవాక్షమువంకఁ దదేకదృష్టితోఁ గాంచుచు శయనించి యుండెను. ఆ సమయమునం దాకస్మికముగా సతీశునియడుగులచప్పుడు వినవచ్చుటచే నామె యదరిపడి వికలహృదయముతోఁ దనచూపులను ద్వారము వంకకు మరలించెను. సతీశచంద్రునిచూపు లప్పుడు హేమాంగి ముఖమండలంబునఁ బ్రసరించెను. ఆ ముఖమండలమునం దేదియో విలక్షణ మగు నీలాకారముగలవిషాదచ్ఛాయ దట్టముగా నావరించుకొని యున్నట్లు సతీశున కనుభవ మయ్యెను. అందుచే సతీశునిహృదయము మఱింత చలించిపోయెను. తడఁబడుచున్న యడుగులతో నాతఁ డప్పుడు మెల్లమెల్లఁగా భార్యసమీపమునకుఁ జేరి "ఈదినమంతయును

నీవీమంచముననుండి యొక్కసారిస్తైనను లేవనేలేదని వినియున్నాను! కారణ మేమి? శరీరమునందు విశేషముగా ననారోగ్య మేమియును లేదుగద!" అనియెను.

కేవలమును శుష్కించి, పాలిబోయి, భరింపరానిహృదయ సంతాపముచేఁ బరిక్లిన్నంబై యున్న ముఖమండలము నించుక పైకెత్తి హేమాంగి తీక్ష్ణదృష్టితో నాథునిమొగమువంక నొకసారి కనుంగొని యెను. అప్పటి యాచూపునందలి యనిర్వచనీయంబగు తీక్ష్ణత్వమును సతీశచంద్రుఁ డెంతమాత్రమును సహింపఁజాలకపోయెను. అప్పు డాతఁడు తనచూపుల నవనతములుగాఁ జేసికొనియెను. హేమాంగి మాత్రము చాలసేపటివఱకు నట్లే భర్తమొగమువంకఁ జూచుచుఁ గొంతసేపటి కాకస్మికముగా "ఇంకను మీ రేమిచేయవలయునని స్థిరపఱచు కొన్నారు? నాకంతయును స్పష్టముగాఁ జెప్పుఁడు! ఇప్పుడు నాహృదయ మంతయును మండిపోవుచున్నది. గుండెలు పగిలి చూర్ణమైపోవునట్లున్నవి!" అనియెను.

ఆ మాటలను సతీశచంద్రుఁడు సరిగా నర్థముచేసికొనఁజాలకపోయెను. ఆకస్మికముగా హేమాంగి యిట్లు ప్రశ్నించుటకుఁ గారణ మేమైయుండును? సతీశచంద్రుఁడు విస్మయావిష్టంబులగు చూపులతోఁ గొంతసేపటివఱకు నూరక హేమాంగిమొగమువంకఁ జూచుచు నిలువఁ బడిపోయెను. అనంతర మాతఁడు మెల్లఁగా "ఇప్పుడు నీవుచెప్పిన మాటలయర్థ మేమో నాకు స్పష్టముగా బోధపడలేదు. "ఇంకను మీ రేమి చేయుటకు స్థిరపఱచుకొన్నారు?" అని నీవేయుద్దేశముతో నన్నుఁ బ్రశ్నించి యుంటివి?" అనియెను.

అప్పుడు హేమాంగి తనయధరమును దంతములచే నొక్కి కొనుచు హృదయమునందలి తీవ్రభావోద్రేకము నెట్లో యించుక

యడంచుకొని దృఢగంభీరస్వరముతో "అర్థమింకను దెలిసికొన వలసియే యున్నదా?—సరే—ఏమైననేమి—ఈ వ్యర్థసంభాషణము వలనఁ బ్రయోజన మేమియును లేదు—రమేంద్రుని హత్యగావించిన వారెవ్వరో నాకుఁ దెలిసిపోయినది!" అనియెను.

భార్య యీ విధముగాఁ బలుకుచుండ సతీశుఁడు విషాదసూచక మగుమందహాసము చేయుచుఁ దెల్లవోయెను. అతని మొగమునందంతటను నవ్వులో దేలిపోవుచున్న విచారచ్ఛాయ విద్యుద్వేగముగన వ్యాపించిపోయెను. అప్పు డాతఁడు సహజకంఠస్వరముతో "రమేంద్రుని హంతకుని నీ వెఱుంగుదువా? వట్టిమాట—నీకింతయును దెలియదు!" అనియెను.

హేమాంగికంఠస్వరము మఱింత గాఢ మయ్యెను. ఆమె యట్టి దృఢస్వరముతోనే "ఈ మాటల కేమి? నేనిప్పుడు మీతో వాదింపఁ దలఁచుకొనలేదు. అట్లు వాదించుటకు నాకంతసామర్థ్యమును లేదు. రమేంద్రుని జంపినవా రెవ్వరో మా పినతల్లియును, సునాంశుఁడును గూడ నెఱుంగుదురు! ఆ హంతకుని దెలిసికొనుటకుఁ దగిననిదర్శనము లన్నియు నీ యింటనే యున్నవి!" అనియెను.

హేమాంగి మాటలవలన సతీశుని ముఖమండల మంతయును వివర్ణమైపోయెను. ఆతఁడు కంపంచలితంబగు కంఠస్వరములో "నిదర్శనములా? ఎక్కడ నున్నవి? అవి యేమియో చూపింపుము!" అనియెను.

హేమాంగికి నిశ్వాసప్రశ్వాసములు తీవ్రముగ వెలువడఁ దొడంగెను. ఆమె యప్పుడు గుండెలు బ్రద్దలై పోవునంతటి దీర్ఘశ్వాసమును విడిచి "ఆమీ చేతికఱ్ఱ—విఱిగి ముక్కలై పోయినకఱ్ఱ—మఱియు రక్తజలచిహ్నితంబులగు—ఆమీ వస్త్రములు—" అనియెను.

ఆమాట వినినతోడనే క్రోధావేశముచే సతీశచంద్రుని కన్నులెఱ్ఱనైపోయెను. అతఁ డతికష్టముచే హృదయసంయమనము గావించుకొని కొంతసే పాఁగి యతికఠోరంబగు కంఠస్వరముతో "దొంగతనముగా నాపెట్టెను దెఱచి చూచినవా రెవ్వరు ?" అనియెను.

హేమాంగి యతిగంభీరస్వరముతో మెల్లఁగా "ఎవరా ? నేను—నేనే మీపెట్టెను దెఱచితిని. ఏమైన నేమి ? నిశ్చయముగా మీరే హంతకులు ! ఇంతటినుండి మీతోఁ గలసి నేనొక్కచో నుండఁజాలను—అట్లుండుట యసంభవము ! నాకొకమగబిడ్డయు, నాఁడుబిడ్డయు నాపాదములకు శృంఖలములై తగులుకొని యున్నారు గాని వారే లేకపోయినచోఁ జాలకాలమునకుఁ బూర్వమే నేను మీయింటిని బరిత్యజించి పోయియుందును. మీరు నాహృదయనాథులు—ఇహపరలోకములయందు మీరే నాకుఁ బ్రభువులు—అట్టి మిమ్మింతకంటె నేమియు ననఁజాలను ! కావున నేనిప్పుడు మిమ్ముల నతిదీనభావముతో వేఁడుకొనుచున్నాను — సాధ్యమైనంతశీఘ్రముగా మీరిచ్చటనుండి వెడలిపోవలయును !" అనియెను.

సతీశచంద్రుఁడు కొయ్యబొమ్మవలె నిశ్చేష్టుఁడై నిలువఁబడి భార్యమాటల నన్నిటిని నాలకించుచుండెను. తరువాత నాతఁడు విషాదసూచకముగా హసించుచు "నీవనుకొన్న దంతయును కేవలము పొరపాటు ! హేమా ! నీవు సద్వివేచకురాలవు—అట్టినీవు నీబుద్ధిశక్తి నీవిధముగాఁ బాడుచేసికొనకుము !" అనియెను.

హేమాంగి గండద్వయమునుండియు దుఃఖాశ్రుజలధారలు ప్రవహింప నారంభించెను. ఆమె యతిమందం బగుగద్గదస్వరముతో "నాథా ! నాయందు దయయుంచి నేనీమాట నెందులకుఁ జెప్పితినో వినుఁడు—...ఈ నాయొక్క విన్నపమును మన్నింపుఁడు మీరిప్పుడే

మీ గ్రామమునకు వెడలిపొందు! నేను నా బిడ్డలను వెంటఁబెట్టుకొని కలకత్తాలో నాతండ్రిగారియింటికిఁ బోయి యుండెదను" అనియెను.

సతీశచంద్రుఁడు దిగులుపడుచున్న హృదయముతో "హేమా! నామాటయందు నీకు విశ్వాసము లేదా? నీవు నిశ్చయముగాఁ బొరపాటుపడిపోవుచున్నావు!" అనియెను.

హేమా: నేను బాగుగ నాలోచించుకొని మనఃపూర్వకముగా నిదియే సత్యమని నిశ్చయించుకొన్నాను! నేను—నేను—

అని ఆమె యిఁకనామాటను పూర్తిగాఁ జెప్పఁజాలకపోయెను. దుఃఖావేశవేగముచే నామెకంఠస్వరము రుద్ధమైపోవుచుండెను—చటాలున నామె తలగడచే ముఖమండలమును మూసివైచుకొనియెను. అట్టుండి కొంతసేపైనతరువాత నామె కాతరకంఠస్వరముతో "నేనింతటి నుండి జీవన్మృతురాలను — అపహృతసర్వస్వను—ఆశ్రయవిహీనురాలను—అతివిశాలంబగు నీప్రపంచమధ్యమునం దీనిమిషమునుండి నేనేకాకినిని—మీరెక్కడఁ బట్టువడిపోవుదురో—మీ రెట్టిశిక్షలకుఁ బాల్పడి—అబ్బా! ఎంతకష్టమెంతకష్టము! తలఁచుకొనుటకుఁగూడ దుస్సహమైయున్న యట్టిమహావిపత్తు నిప్పటివఱ కెట్లో తప్పించుకొనఁ గలిగితిమి—కాని—కాని—"

అని హేమాంగి యిఁక మాటాడఁజాలకపోయెను. ఆమెకంఠము నెవ్వరో నొక్కివైచినట్లుండెను. సతీశుఁ డామెమాటలకడ్డము వచ్చి "హేమా! ఇఁక మాటాడకుము! నీవేమని యూహించి నిశ్చయించుకొంటివో యది యెంతమాత్రమును సత్యము గాదు—నేనంతటి దారుణమగు ఘోరహత్యను గావించినవాఁడను గాను—" అనియెను.

హేమాంగి కాతరకంఠస్వరముతో "ఇదిగో! మీరేమన్నను సరియే—నేను—నేనుమాత్రము—"

అని యింకను నేమో చెప్పఁబోవుచుండఁగా సతీశుఁ డడ్డము వచ్చి "సరే—దానికేమి! చాలును! ఇఁక నీవేమియును మాట లాడకుము! ఇప్పుడే నీకిచ్చటినుండి వెడలిపోవలయునని యున్నదా? కాక యీయింటి కెప్పటివఱకు మన మద్దెనిచ్చివైచితిమో యన్ని దినములవఱకు నిచ్చట నుండెదవా?" అని యడిగెను.

హేమాంగి నాథుని మొగమువంకఁ దెల్లపోయి చూచెను. ఇంత శీఘ్రముగా సతీశచంద్రుఁడు తనవిన్నపము మన్నించునని యామె భావించుకొని యుండలేదు. కొంతసేపటివఱకు నామె యట్లే స్వామి ముఖమండలమువంక నూరక చూచుచుండెను. ఏదియో చెప్పవలయు నని యనుకొనుచుండెను గాని దుఃఖావేశమువలనఁ గంఠము బిగిసికొనిపోవుటచే నామె నోటినుండి యొక్కమాటయైనను వెలువడ దయ్యెను. దుఃఖవిహ్వలదృష్టితో నామె నాథుని మొగమువంక వెఱ్ఱి దానివలె నట్లే యూరక చూచుచుండెను.

అప్పుడు సతీశచంద్రుఁడు మృదులస్వరముతో "హేమా! ఊరక యీ విధముగా మనసు చెదరఁగొట్టుకొనకుము! సుధాంశుఁడు నీకు సాయముగా నుండఁగలఁడు. మాపిన్నతల్లిగారు నిచ్చటనే యున్నది—మఱియుఁ గావలసినపను లన్నియుఁ జేయుటకు దాసదాసీ జనులున్నారు గదా—ఎన్నాళ్లవఱకు మన మీయింటికద్దె నిచ్చి వైచితిమో యన్నాళ్లవఱకును నీవిచ్చటనే యుండుము! నేను నేఁటి రాత్రియే బయలుదేఱి కలకత్తాకు బోయెదను—ఇంతయాకస్మికముగా మనమందఱమునుగూడ నిటనుండి లేచిపోయినచోఁ గేవలము నీయూరి వారలపదలికిని సందేహము వృద్ధియగుటయే గాని యంతకంటె విశేష మేమియు నుండదు" అనియెను.

సతీశచంద్రుని యీ మాటలు కాళ్ళసమానములవలెఁ గుసుమ కోమలంబగు హేమాంగి హృదయమును దీవ్రముగా వేధించివైచెను. ఆమె తన నాథునిమాటలకుఁ బ్రత్యుత్తరముగా నొక్కమాటయైనను జెప్పఁజాలకపోయెను. తలవంచి వెక్కి వెక్కి యేడువఁ దొడంగెను. అబలలకు సతీమణులకు భరింపరాని కష్టసమయములందు రోదనముకంటె నితరాధార మేమున్నది? ఆమె యంతకంటె నింకేమి చేయఁగలదు? ఆత్మహత్యయా? — అతిదారుణంబులగు దుస్సహ క్లేశముల సహనయించుకొనుటకై యాత్మహత్య మహాపాతకమఘోరంబును, అమోఘంబును నగు దివ్యౌషధమువంటి దనుమాట నిశ్చయమే— కాని పవిత్రచరిత్రయు, బతివ్రతయునగు నామె సాధారణస్త్రీ యువతులవలె సాహసించి యాత్మహత్య యెట్లు చేసికొనఁగలదు? మహత్తరంబగునే పాపఫలముచే నింతటి దారుణమనోవ్యథ తనకు సంభవించినదో యామె నిశ్చయముగా నెఱుఁగును! ఆ పాపఫలమును సంపూర్ణముగా ననుభవింపవలసినదే గాని యూరక యాత్మహత్యచే దానిని దప్పించుకొనఁ బ్రయత్నించుట కేవలము మూర్ఖత్వమేగాని వేఱుగాదు. అట్లు గావించినచో నొకకష్టానుభవముపై మఱింతకష్టమును జేతులారఁ దెచ్చిపెట్టుకొన్నట్లగును. కేవలము దేహమును బరిత్యజించినంత మాత్రమున సంపూర్ణముగాఁ గర్మఫలమను భవింపకుండఁ దప్పిపోవునా? అట్లు తప్పిపోను సరిగదా—పైపెచ్చుగా నాత్మహత్యా మహాపాపఫలముగూడ ననుభవింపవలసి యుండును. హేమాంగి పవిత్రజీవిత మిఁక విరామములేని దుఃఖభారముతో వేగింపవలసి యుండెను—ఆమెజీవిత మిప్పు డతిదారుణక్లేశ భూయిష్ఠమైపోయెను. మృత్యువుమాత్ర మంతకంటె భయంకరమైనదా?

* * * * * *

సతీశచంద్రుఁ డింతసహజముగా నింతశీఘ్రముగా భార్యను, గన్నబిడ్డలను, పరివారమునుగూడఁ బరిత్యజించి మధుపురమునుండి పాఱిపోవుచున్నాఁ డనుచేత ! ఉరికంబమునుండి యెట్లయినఁ దప్పించుకొనుట కీవిధముగాఁ బలాయితుఁ డగుటయే యేకమాత్రపరమోపాయ మని యూహించుకొనియెను గాఁబోలును ! ఆనాఁడు—ఆరాత్రి—ఆ దుష్టముహూర్తమునందు—రమేంద్రనాథుని హత్యం గూర్చి యందఱికంటె ముందుగనే తనకుఁ దెలియవచ్చిన ట్లాతఁడు చెప్పకయే యూరకున్నచో నాతనివిషయమున ననుమానించుట కెవ్వరికైన నవకాశముండునా ? కేవలమును మూర్ఖునివలె—ఉన్మత్తునివలె—ఆతఁ డీ యవివేకకృత్యము నేల గావింపవలయును ? దీనికంతకు నొక్కటియే సమాధానమున్నది—"సర్వాకషా భగవతీ భవితవ్యతైవ" అనుమాట నేఁటిమాట గాదుగదా ! విధాతృనిలలాటలిఖితము నెవ్వరు తుడిచివైచుకొనఁగలుగుదురు ? జరుగవలసిన దేదియో యెప్పటికైనను జరిగి తీరవలసినదే—విధివిధానము నతిక్రమించుటకు మానవుఁ డన నెంతటివాఁడు !

సతీశుఁ డటనుండి బయలుదేఱిపోవునప్పుడు మరల హేమాంగిం గాంచి "రమేంద్రునిహత్యచేసినవాఁ డెవ్వఁడో తెలిసి పట్టుకొనఁగలవానికై మువందలరూపాయలు బహుమానముగా నిచ్చెద నని చెప్పియున్నాను !" అనియెను.

తన్నుఁ బరిహాసము చేయుటకే సతీశచంద్రుఁ డీమాటలను జెప్పుచున్నాఁ డని హేమాంగి భావించుకొనియెను. నిజముగా నామాట లామె కురిసినపుండుపై నుప్పు వెట్టినట్లుగా నుండెను. విన్నమాత్రమున నామె గుండెలు గుభిల్లుమనిపోయెను. సతీశచంద్రుఁ డిఁక నేమియును మాటలాడలేదు. విషాదపూరితమగు దృష్టితో నొక్కసారి

మాత్ర మామెమొగముకంకఁ జూచి యూయిల్లు విడిచి యవ్వలికిఁ బోయెను.

అదివఱకే జడీభూతురాలై యున్న హేమాంగిహృదయము నాథుఁ డింటినుండి వెడలిపోయినంతనే, మఱింత యుదసన్నమై దహించుకొని పోవుచున్నట్లుండెను. ఆమెకు సృష్టిప్రపంచమంతయు గాఢాంధకార పూరితమైపోయినట్లు తోఁచుచుండెను. అప్పటి హేమాంగి దుస్సహావస్థను పినతల్లి గ్రహింపఁగలిగెను. పతిసుఁ డిల్లు వెడలిపోయిన మఱికొంతసేపటి కామె హేమాంగి చెంతకు వచ్చి యామె పార్శ్వమునందుఁ గూర్చుండెను. కాని యేమియును మాటలాడలేదు. అప్పుడు హేమాంగిశరీరము నందు చైతన్యమున్నదో లేదో—ఆమె జాగ్రదవస్థయందే యున్నదో నిద్రించుచున్నదో—జీవించి యున్నదో మరణించినదో—అని సందేహింపఁదగిన సందిగ్ధావస్థలో నుండెను.

## ఇరువదిరెండవ ప్రకరణము

ఆనాఁటిరాత్రియే బయలుదేఱి సతీశచంద్రుఁడు కలకత్తాకుఁ బోయెను. ఇఁక నామఘుపురమునం దుండుట కాతని కెంతయో కష్టముగా నుండెను. ఏవంకఁ జూచినను నాతనికి భయంకరదృశ్యములే

కానవచ్చుచు నిరంతరముసు హృదయమును గలంచివైచుచుండుటచే నొకనిమిషమైనను శాంతి యనుమాటయే లేకుండఁబోయెను. అందు చేతనే యాతఁడెట్లకైనను బోయి యించుక శాంతి నందవలయునని యాసించి—ఒక్కనిట్టూర్పు విడిచి విచారమును మఱచియుండవలయు నని యుద్దేశించి—హేమాంగి మాటలవలన వసంతనే కలిగిన యవ కాశము నాధారము చేసికొని యా మనుపురమును విడిచిపోయెను.

సాధ్యమైనంత శీఘ్రముగ దానుకూడ మనుపురమును బరిత్య జించి పోవలయునని హేమాంగికూడ భావించుకొనుచుండెను. కాని దురదృష్టవశమున నామెకంతను నట్టియవకాశము లభించినది గాదు. మఱునాఁ డామె కతిప్రచండముగా జ్వరము తగిలెను. ఆ జ్వరము క్రమక్రమముగా హెచ్చిపోవుటచే నామెకుఁ బరాకుమాటలుకూడఁ బుట్టెను. ఇంటిలోనివారలందఱు నప్పటి హేమాంగియవస్థం గాంచి చాల గందరగోళము పడిపోవుచుండిరి. అట్టిసమయమునం దామె పినతల్లియు, సుధాంశుఁడు నచ్చట లేకుండుటయే తటస్థించినచో నామెగతి యేమి కావలసియుండునో కేవలము భగవంతునికే యెఱుక?

ఇఁక డాక్టరు రమేంద్రబాబు లేఁడుగదా—జాగ్రత్తగాఁ బరిశీ లించి మందిచ్చుట కంతయంత యభిమానముగలవైద్యు లాయూర నింకెవ్వరున్నారు? ఇఁక గత్యంతరములేక రైల్వేకంపెనీవారి డాక్టరును బిలిపించిరి. ఆతఁడే వచ్చి యామెకు వైద్యము చేయుచుండెను. ఆమె మొగమంతయు నతివికృతముగా నుండెను. ఆ పరాకుమాటలలో నామె రమేంద్రనాథుని హత్యంగూర్చి యేమైన మాటాడునేమో, ఆ మాట లెవ్వరైన వినిపోవుదురేమో యను భయముచే నామెపినతల్లి సాధారణముగా నెవ్వరినిగూడ హేమాంగిచెంతకుఁ బోనిచ్చుట లేదు. ఎల్లప్పుడునుగూడఁ దానో, తనకుమారుఁడగు సుధాంశుఁడో యామె

నెడఁబాయకుండఁ జూచుకొనుచుండిరి. వాస్తవముగా నీ విషయమునం దావృద్ధురాలు అపూర్వప్రతిభాయంబగు బుద్ధిశక్తి నుపయోగించి యాభిజాత్యగౌరవము గల పురంధీరత్నములు చేయఁదగినకార్యమును గావించి యుండెను.

ఏవియోకొన్ని గృహకృత్యములను దీర్చుకొనవలసిన యావశ్యకముగలుగుటచే నొకనాఁడామె తనకుమారుఁడగు సుధాంశుని హేమాంగికడనుంచి కొంతసేపుమాత్ర మా రోగమందిరమును విడిచి యవ్వలికిఁ బోయి యుండెను. ఆమె యా యింటిని వదలివచ్చుచుండుటం గాంచి పెద్దదాసి హేమాంగి చెంతకుం బోయి యటఁ గూర్చుండి యుండెను. అప్పుడు హేమాంగికి జ్వరాతిరేకముచే నొడలు తెలియుట లేదు. ఆ జ్వరతీవ్రతచే నామె క్రమక్రమముగా రమేంద్రబాబుపేరెత్తి మాటాడ నారంభించెను. ఈ గందరగోళమంతయుం గాంచి సుధాంశుఁడు చాల భయపడిపోవుచుండెను. జ్వరప్రకోపముచే నామె కేవలమును రమేంద్రుని పేరుమాత్రమే యుచ్చరించుచు నంతటితో నూరకున్నచో నిబ్బంది లేదు. కాని క్రమముగా నాతనిహత్యతో సంబంధించిన యనేక విషయములం గూర్చి కూడ నప్పుడప్పుడు కొన్నిమాట లామెనోటినుండి వెలువడుచుండెను. ఆమె ప్రక్కనే పెద్దదాసి కూర్చుండియున్నది. చిరకాలమునుండి యింటిలోనిదానిగనే చూచుచున్న యా దాసినిప్పు డవ్వలకుఁ బొమ్మని చెప్పుట కవకాశ మేమున్నది? ఇట్టి యవస్థలో నేమాట వలన నేమిపుట్టిమునుఁగునో యని శంకించుచు సుధాంశుఁడు తత్తరపడి పోవుచుండెను.

ఆ సమయమునకు సరిగా నాతనితల్లి యింటిపనులను జక్కఁ బఱచుకొని యా లోపలికి వచ్చి ప్రవేశించెను. ఆమెం గాంచినంతనే పెద్దదాసి లేచి నిలువఁబడి "అమ్మా! అమ్మగారు జ్వరప్రకోపముచేఁ

గేవలమును డాక్టరురమేంద్రబాబుమాటయే తలపెట్టుచున్నారు. ఆ డాక్టరుబాబునకును, మనబాబునకును జాలవిరోధముగదా ! ఇట్టిస్థితిలో నీమెకు తఱచుగా నాతనిమాట యెత్తవలసినపని యేమున్నది ? ఆ బాబులకిరువురకును విరోధ మన్నమాట మనకందఱకును దెలిసిన విషయమే గాదా ?" అనియెను.

ఆదాసిమాటలవలన హేమాంగిపినతల్లిహృదయ మంతయును గలఁగిపోయెను. కాని మంచిలోకానుభవముగల బుద్ధిమంతురాలగు నామె యతిప్రవీణురాలగు గృహిణివలెనే తనమనోభావములు మనసు నందే యడంచుకొని గంభీరస్వరముతో "ఆరాత్రి మనయింటినుండి బయలుదేఱి పోవుచుండఁగనే త్రోవలో రమేంద్రబాబు హంతకులచే వధింపఁబడిపోయెను. అందుచేతనే మనహేమ జాలిపడి జ్వరతీవ్రతచేఁ గలుగుచున్నపరాకుమాటలలో నాతనిపేరే తఱచుగా నుచ్చరించు చున్నది. ఇంతజ్వరములో నొడలెఱుంగక యున్నసమయమునం దామె యాతనినామమును దలపెట్టుచుండె ననుటలో నాశ్చర్యముగాని, యసంభావ్యముగాని యేమియును లేదు. జ్వరప్రకోపమువలన రోగు లనేకవిధములుగాఁ బరాకుమాట లాడుచుందురు. వానికన్నిటికిని సందర్భముగాని సమన్వయముగాని యేమైన నుండునా ? ఒడలు తెలియ కుండఁ బలుకుచున్నమాటల కర్థ మేముండును ?—ఇదిగో ! నీవు విన్నావా ? మనసతీశుఁడు డాక్టరుబాబును వధించిన హంతకులను బట్టుకొన్నవారి కైదువేలరూపాయలు బహుమానముగా నిచ్చెద నని చెప్పి యున్నాఁడఁట! ఈసారి యతిశీఘ్రకాలములోనే యాహంతకుఁడు దొరకిపోవు నని నాకుఁ జాల నమ్మకముగా నున్నది" అనియెను.

దాసి యప్పుడు తనమొగము నించుకవికృతముగాఁ జేసికొని "పోనఁట! అందఱునుగూడ నట్లే యనుకొనుచున్నారు—నిశ్చయముగా

నీఘోరహత్య బాదిపోటుకొంగల గుంపువారివలననే జరిగి యుండును ! నాకదియే నమ్మకము! అమ్మా! ఈ విషయమునందు మీయభిప్రాయ మేమి ? " అనియెను.

సుధాంశునితల్లిగూడ దాసిమాటల నంగీకరించుచు " ఔను— నాకుగూడ నట్లే తోచుచున్నది—అట్టి క్రూరకర్మలు లేకయే యుండి నచో నీప్రపంచమునం దిట్టిదుష్కృత్యములు జరుగవు ! " అనియెను.

కొంతసేపటివఱకు నాయిరువురిలో నెవ్వరును మాటాడకుండ మౌనముగానుండిరి. ఆకస్మికముగా దాసి నుడుల నారంభించి " అమ్మా! అమ్మగా రింతటిభయంకరజ్వరముతో బాధపడిపోవుచుండఁగా బాబు గారింకను గలకత్తాలోనే యున్నారు—ఆయన యిచ్చటికి రారా? ఇట్టి యాపత్సమయమునందు దీమె నిటవిడిచి యచ్చట నొక్కరు నెట్లుండఁ గలిగిరో మహాశ్చర్యముగా నున్నది ! " అనియెను.

ప్రత్యుత్పన్నమతి యగు హేమాంగిపినతల్లి యప్పుడు దాసిం గాంచి " ఈమె కింతజబ్బుచేసినదను సమాచారము సతీశుబాబునకుఁ దెలియనే దెలియదు ! " అనియెను.

దాసి మఱింత యాశ్చర్యముతో " అదేమమ్మా ! ఆయన కీసమాచారమే తెలియదా ! అమ్మగా రింతటి జీవితసంశయావస్థలో నుండఁగా బాబుగారికిఁ దెలియనేలేదా ? " అనియెను.

హేమాంగిపినతల్లి తడవుకొననుండక వెంటనే గంభీరస్వరముతో " ఇప్పు డాతనికిఁ దెలియఁజేయుటవలన లాభ మేమున్నది ? విచార కరమగునీవార్త వినుటచే గుండెచెదరి యాతనికిఁగూడ జబ్బు చేయ వచ్చును. అందుచేతనే యాతని కీవిషయమున నెట్టియుత్తరమును వ్రాయవలదని నేనే సుధాంశునితోఁ జెప్పితిని. హేమకుఁ గొంచెము

నెమ్మదిగలిగిన తరువాత నాతనికి క్షేమసమాచారమును దెలుప వచ్చును ” అనియెను.

ఇట్లు చెప్పుచు నామె హేమాంగిచెంతకుఁ బోయి యామె ప్రక్కను గూర్చుండెను. అందుచే దాసి యిఁక నేమియును బ్రశ్నింపకుండ మౌనముతోఁ గొంతసేపటివఱకు నచ్చట నిలువఁబడి పిదపఁ దన పనులను నిర్వర్తించుకొనుటకై పోయెను. అప్పుడు సుధాంశునితల్లి కుమారుసిం గాంచి “ నాయనా ! స్థితిగతు లన్నియు నొకనాఁటికంటె నొకనాఁడు ప్రతికూలములుగా మాఱిపోవుచున్నవి—ఏవంకఁ జూచుకొన్నను నాకు ధైర్యము నిలుచుటలేదు. ఏనిమిషమున కేమగునో యను భయముచే రేయుంబవలు నా గుండెలు కొట్టుకొనిపోవుచున్నవి. సతీశుఁడు—” అని కొంతవఱకుఁ జెప్పి యూరకుండెను.

సుధాంశుఁ డింతవఱకును నొక యింగ్లీషుపుస్తకమును దనలోఁ దానే చదువుకొనుచు గూర్చుండి యుండెను. అప్పు డాతఁడు తల్లిగారి మాటల నాలకించి “ అమ్మా ! నీవు చాలబుద్ధిమంతురాలవు ! నీకుఁ దెలియరానివిషయ మేదియును లేదు. కాని నేనుగూడ నాకుఁదోఁచినది యొక్క-మాట చెప్పుచున్నాను—ఇఁక నీ విషయముంగూర్చి ప్రతి నిమిషమునకును మనసు చెదరఁగొట్టుకొనుటవలనఁ బ్రయోజనము లేదు. దీనింగూర్చి యేమియు నాలోచింపక చల్లగా నూరక చూచుచుండుటయే మంచిదని నా యభిప్రాయము. ఏది జరుగవలసియున్నదో యది జరుగక మానదు—భవిష్యమునుగూర్చి భావించుకొనుచు భయముచేఁ జచ్చిపోవుట కేవల మవివేకము ! ” అనియెను.

తల్లి యొక్క-దీర్ఘశ్వాసమును విడిచి మొండిధైర్యముతో గూర్చుండి యుండెను. సుధాంశుఁడు మరలఁ దనపుస్తకమును జదువుకొనుటయందు మగ్నుఁడయ్యెను.

* * * * * *

హేమాంగి యీ విధముగా సన్నిపాతజ్వరముచేఁ బీడింపఁబడు చుండెను. ఆమె యిఁక జీవించునని యాశకూడ నెవ్వరికిని లేకుండఁ బోయెను. ఈ జ్వర మతిదారుణ మైనదనియు, ఈ వికృతవ్యాధివలన నీమె జీవించుట చాలదుర్ఘటమనియు, డాక్టరుగూడఁ జెప్పియుండెను. అందఱును జాలభయపడి పోవుచుండిరి—కాని కొల్లగింజంత యాయు వున్నచోఁ గోటిరోగములు వచ్చినను నేమియుఁ జేయఁజాలవు! అట్టి యదృష్టము గలుగుటచేతనే పాపము హేమాంగి యీ వికృతజ్వరము నుండి విముక్తురాలయ్యెను. ఆమెకుఁ గ్రమక్రమముగాఁ గొంచె మారోగ్యము గలుగుచుండెను. కాని యింకను సంపూర్ణముగాఁ గలుగ లేదు అయిదాఱుదినములనుండి మాత్రము జ్వరముతగులుట మానివైచినది.

అట్టిసమయమునం దొకనాఁ డామె పినతల్లిని గాంచి యేడ్చుచు "పిన్నీ! ఇఁక—నన్ను—నన్నిచ్చటినుండి యెటకైనను దీసికొని పొమ్ము!—ఇఁక నేనీయూరిలోనుండి జీవింపఁజాలను—ఆనాఁడు—ఆ రాత్రి—ఆ ఘోరహత్యయే రేయుంబవలు నాకన్నులఁ గట్టిన ట్లగ పడుచున్నది. పిన్నీ! నేను నీ పాదములపైఁ బడి వేఁడుకొనుచున్నాను. సాధ్యమయినంత శీఘ్రముగా నన్నీస్థానమునుండి తప్పించివేయుము!" అనియెను.

పినతల్లి యతికరుణంబగు కోమలస్వరముతో "అయ్యో! వెఱ్ఱితల్లీ! ఎందుల కింతకంగారుపడియెదవు? ఇంత యస్థైర్యసమట వలన గూడ మఱింత జబ్బు చేయునమ్మా! నీకింకను బాగుగ నారోగ్యము కలిగినతోడనే నిన్నిటనుండి తీసికొనిపోయెదను." అనియెను.

మఱికొన్నిదినములు గడచిపోయెను. హేమాంగి పథ్యము తీసి కొనియెను. ఇఁక నామెకు మధుపురమునం దొక్కనిమిషమైన నుండ

వలయు నని లేదు. అప్పుడామె పినతల్లిం బిలిచి "పిన్నీ ! ఇంక జాగును చేయవలదు. రేపే మనప్రయాణము సాగునట్లేర్పాటు చేయుము !" అనియెను.

పినతల్లి కొంచెము సంశయించుచు "అమ్మా ! నీకింకను రైలులోఁ బ్రయాణము చేయునంతటి యారోగ్యము గలుగలేదనియు, నింకను నైదాఱుదినములు చూచుకొని తరువాత బయలుదేఱుట కభ్యంతర ముండదనియు డాక్టరుగారు చెప్పియున్నారు" అనియెను.

ఇంకగత్యంతరము లేకపోవుటచే సీతమాంబికి మఱికొన్ని దినముల వఱకును మధుపురమునందే యుండవలసివచ్చెను. ఎప్పుడీయూరు వదలి పోవుదునా యని ప్రతినిమిషమునకును నామెహృదయము తొందరపడి పోవుచుండెను. ఈ నగరమునం దున్నంతవఱకు నామెహృదయమునందు రమేంద్రుని ఘోరహత్యంగూర్చిన యాలోచనలే తోఁచుచు దుస్సహబాధం గల్పించుచునే యుండును. ఆమాట తలఁపునకు వచ్చినంతనే యామె కున్మాదము మెత్తిపోవుచుండును. ఈయూరు దాఁటి మఱి యెక్కడకైనఁ బోయినంతమాత్రమున హృదయశాంతి గలుగుననునాశ యామెకుఁ గలుగుట లేదు. కాని యీనగరమునందుండుట యామెకుఁ జాలబాధాకరముగా నుండెను. అతిదారుణమగుహృదయసంక్షోభముతోడను, నతిభయంకరదుస్స్వప్నములం బోలిన యాలోచనలతోడను నామెజీవితము గడపవలసియుండెను. సతీశచంద్రుఁ డెప్పుడు పట్టుపడి పోవునో—ఎప్పు డాతని న్యాయస్థానమున నిలువఁబెట్టి విచారణ చేయుట తటస్థించునో—ఎప్పు డాతనికి మరణదండనము విధింపఁబడునో—ఏనాఁటి కెట్టిదుర్వార్త వినవలసివచ్చునోయని నిత్యమును భయపడి పోవుచు నతిఘోరసంశయములతో నామె యెంతకాలమో తనజీవితమును వేగింపవలసియుండెను ! ఇంక నామెమనశ్శాంతి యెక్కడిది ?—

ఇంతేకాక యట్టిదురవస్థయే సామాన్యముగాఁ బట్టియుండినచోఁ బ్రజలందఱు నామెం గాంచినప్పుడెల్ల [illegible] ప్రకటింపను బడిపోయెనని చెప్పుకొనుచుందురు. మఱియు నోరెత్తుకొని యామె పుత్రికాపుత్రకులం గాంచి నమస్కారము చేసి మరణసంకటమునకుఁ బాల్పడిపోయిన యాసతీమణిని సంతప్రదిమే యని వ్రేలుపెట్టి చూపించుచుందురు. అతిదుర్భరంబగు నట్టియవమానదుఃఖము ననుభవించుచు నామె యెంతకాలము జీవితముకంటె మరణబాధను బడవలసియుండెనో- ఇట్టి భయంకరాలోచనములచే నిరంతర మామెహృదయము తీవ్రపరితాపము నందుచుండెను.

దీనికేమి ? ఇదియంతయును బాహ్యవిషయము ! హేమాంగి హృదయాంతరాళమునం దనుదినమును నట్టిదుస్సహమగు నరకయాతన హాలాహలమువలె విజృంభించుచున్నదో యథార్థరీతిగా నెవ్వరు వర్ణింపఁ గలరు ? దురారోగ్యంబగు వ్యాధిపీడితులను శరీరమునందలి యర్ధానార్ధభాగము దారుణవిషయమైపోయినప్పుడు నాభాగమును ఖండించి వైచుటకంటె మఱియొకవిధముగాఁ జికిత్సచేయుట కెట్టియవకాశమును లేదని డాక్టరులు చెప్పినప్పుడట్టిరోగిహృదయమునం దెట్టిబాధపుట్టునో, అట్టిబాధను, అట్టిరోగమును ననుభవించినవారుమాత్రమే యిప్పటిమన హేమాంగిహృదయసంక్షోభమును సంపూర్ణముగా గ్రహింపఁగలిగి యుందురు.

అంతటిభీషణయాతన హేమాంగియంతరంగమును దహించివైచుచుండెను. అది యామె సకలాంగకములను భస్మీభూతములుగాఁ జేసివైచుచున్నట్లుండెను. కాని యది యేమియును బైకిఁ గానవచ్చుట లేదు. ఆమెయంతరంగమునందలి యాదుఃఖానలమునెదుట దావానలము గూడఁ జందనసేకమాత్రమే యని చెప్పవచ్చును. ఆమెభర్తయే

హంతకుఁ డైనట్లు తగిననిదర్శనముల నామెయే కన్నులారఁ జూచి యుండెను. లోకవినిందితంబును, గర్హ్యంబును నగునంతటిదుష్కృత్యమును గావించినవాఁడు నిశ్చయముగాఁ దనభర్తయే యని యామెకు బోధ యగుచుండెను. ఇంతేకాక యాతఁడు తాను గావించినదుష్కృత్యమునకుఁ బశ్చాత్తాపపడవలసి యుండియు నదియేమో గాని యించుకంతయు నట్టిభావమును సూచించుటయే లేదు——

అట్టినిర్దయుఁడగు క్రూరహంతకుఁ డామెభర్త ఇహపరలోకముల యందామెకు దైవతము——ఆతఁడేనా యిట్టిదుష్కృత్యముం గావించిన వాఁడు ? — నిజముగా నాతఁడేనా ? కాఁడు ! ఆతఁ డంతటిఘోర కార్యము నెన్నటికిని జేయఁజాలఁడు ! ఇట్టియాలోచనలతో హేమాంగి హృదయమంతయును సంక్షుభితమై పోవుచుండెను. ఒక్కొక్కప్పు డామెకుఁ జైతన్యమే లేకపోవుచుండెను.

అంతలో నొక్కొక్కప్పు డామెహృదయమునందుఁ బ్రేమయును, విశ్వాసమును బొడసూపి మధురమోహనంబగు కంఠస్వరముతో "ఎన్నఁటికి నట్లు గానేరదు !—అట్టిసాధుస్వభావుఁ డెప్పుడు నిట్టి దుష్కృత్యమును జేయఁజాలఁడు ! సతీశచంద్రుఁడు సామాన్యుఁడా ? ఆతఁ డెంతటి యుత్తమవంశమున జన్మించినవాఁడు ! ఎంతబుద్ధిమంతుఁడు ! ఎంతటివిద్యావంతుఁడు ! అనింద్యచరిత్రుఁడగు నాతఁ డఖిలజనపూజనీయుఁడు ! ఇన్నిటికంటె నధికముగా నాతఁడు నీ నాథుఁడు !—నిన్నే తన ప్రాణములకంటె నధికముగాఁ బ్రేమించుచున్నవాఁడు ! అట్టియుత్తముఁ డింతటిదౌర్జన్యము గావించు ననుట యసంభవము గాదా ? ఇట్టిసంశయము—ఇట్టిదురభిప్రాయము—నీవంటి సతీమణిహృదయమునందుఁ దోఁచవలసినదా ? నిశ్చయముగా నీకన్నులే నిన్ను మోసగించి వైచినవి ! నీవు పొరపాటుపడిపోవుచున్నావు !" అని బోధించుచుండెను.

అంతలోనే సురల సంశయప్రవాహములు శతముఖములై యుదయించి యేకమై ప్రవహించుచు నొక్కయుదుటున నామె ప్రేమ విశ్వాసభిత్తికలను బగల్చివైచుచుండెను. అప్పు డామెహృదయాంత రాళమునం దతిదారుణముగ జరిగిపోవుచున్న దేవాసురయుద్ధమువలన హేమాంగి యవిరామంబు లగుదుస్సహబాధల ననుభవించుచుండెను. మఱియు నామె వర్షాప్రభంజనాహతులచే నాకాశమువఱకు నెగసి పడుచున్న భీకరతరంగములవలన సంక్షోభితం బగు మహాసాగరవక్షంబు నందు మునింగి తేలిపోవుచుండెను! క్రమముగా నిదియంతయు నేవిధ ముగాఁ బరిణమించునో యొక్కయంతర్యామియే యెఱుంగునుగాని యితరు లెట్లూహింపఁగలరు?

## ఇరువదిమూఁడవ ప్రకరణము

హేమాంగిపినతల్లి స్నానము చేసి యాహ్నికకృత్యమునుదీర్చి కొనుటకై పోవుచుండెను. ఆ సమయమునం దొకసేవకుఁడు వచ్చి "అమ్మా! ప్రఫుల్లకుమారబాబుగా రొకసారి మిమ్ము దర్శింపఁగోరు చున్నారు" అని చెప్పెను.

వృద్ధురాలామాట విన్నంతమాత్రముననే యదరిపడి యా భృత్యునిం గాంచి "నన్ను దర్శింపవలయుననియా! ఎవరు ? ఆయనా! ప్రఫుల్లకుమారబాబా ?" అనియెను.

సేవకుఁడు తలయూఁచుచు "ఔనమ్మా! ఏదియో యొక ముఖ్యవిషయముంగూర్చి మీతో మాటలాడవలసి యున్నదఁట!" అనియెను.

మాటాడవలసిన ముఖ్యవిషయము! ఆ వృద్ధురాలిగుండెలు దడదడఁ గొట్టుకొనిపోవుచుండెను. కొంతసేపటివఱకు నేమియు మాటాడకుండ సేవకుని మొగమువంకఁ జూచుచు నిలువఁబడి తుదకు "నాతో మాటాడవలసినపని యేమున్నది ? సరే—నేనచ్చటికి వచ్చెదనని చెప్పుము!" అనియెను.

ఆ వెంటనే సేవకుఁడు చిత్తమని వెడలిపోయెను. తరువాతఁ గొంతసేపటికామె సందిగ్ధహృదయముతో ప్రఫుల్లకుమారబాబు గృహమునకుఁ బోయెను. ప్రఫుల్లబాబప్పుడు వీధిగదిలోనే యొకపడక కుర్చీపైఁ గూర్చుండి యుండెను. ఆతఁడు లోపలఁ బ్రవేశించుచున్న హేమాంగి పినతల్లిం గాంచి "అమ్మా! సతీశబాబుభార్యకు బాగుగ నారోగ్యము గలిగినదని విని చాల సంతోషించితిని. ఆమెతో నొక మాట చెప్పవలసియున్నది. ఈ యవస్థలో నామెనడుగుట యుచితముగా నుండునో యుండదో తెలిసికొనవలయునని నిన్నిటకుఁ బిలిపించితిని ?" అనియెను.

ఈ మాటలు వినుటవలన వృద్ధురాలిగుండెలు మఱింతతీవ్రముగాఁ గొట్టుకొనిపోవఁదొడంగెను. అప్పుడామెమృదుస్వరముతో "ఆ సమాచారమేమి — క్రొత్తదేమియును — సతీశునిగూర్చి—" అనియెను.

ప్రఫుల్లకుమారుఁడు తల యూఁచుచు "కాదు—కాదు— అది యేమియును గాదు — ఇంతకాలమునకు రమేంద్రుని జంపిన హంతకుఁడు పట్టువడినాఁడు!" అనియెను.

వృద్ధురాలికన్నులు చీకటులు గ్రమ్మిపోయెను. అట్లయినచో పోలీసువారు సతీశుని బట్టుకొన్నారు కాఁబోలునని యామె కొయ్యవడిపోయెను? ఆమె నోటినుండి మాట లేదు. ఆమె నిశ్చేష్టయై, యనిమేషనయనయై యూరక ప్రఫుల్లబాబు మొగమువంకఁ జూచుచు నిలువఁబడిపోయెను. అప్పుడు ప్రఫుల్లబాబు మృదుస్వరముతో "నేనే స్వయముగా వచ్చి యీ సమాచారము మీకుఁ దెలుపవలయునని తలంచితిని. సతీశబాబు బహుమానముగా నైదువేలరూపాయల నిచ్చెద నని చెప్పియుండుటచేతనే యీ హత్యారహస్యమంతయును బయలు పడినది." అనియెను.

అప్పు డావృద్ధురాలికంఠస్వరము కంపితమై పోవుచుండెను. ఆమె సందిగ్ధహృదయముతో గలఁగిపోవుచు ప్రఫుల్లబాబుం గాంచి "ఆ హంతకుఁ డేవిధముగా దొరకిపోయినాఁడు?" అని ప్రశ్నించెను.

ప్రఫు: మన సతీశచంద్రుఁడు కలకత్తాకుఁ బోయినతరువాత నచ్చట నపరాధపరిశోధకాధ్యక్షుఁడగు నొకదొరగారిని సందర్శించి యాతని రమేంద్రబాబు హత్యంగూర్చిన యెల్లవిషయములు నెఱింగించి యీ హత్యావ్యాపారమును బయటఁబెట్టిన ప్రవీణునకు నేనైదువేల రూపాయలు బహుమానముగా నిచ్చెదనని కూడఁ జెప్పియుండెను. అప్పు డాదొరగారు బాగుగ నాలోచించి మంచిసమర్థుఁడగు నొక యపరాధపరిశోధకునిం బిలిపించి యీ హత్యంగూర్చిన యెల్లరహస్యములను గనుపెట్టి హంతకుని బట్టుకొనవలయునని యాజ్ఞాపించి యీ పట్టణమునకుఁ బంపించెను. ఆతఁ డిచ్చటికి వచ్చి కొన్నిదినములు శ్రమపడి ప్రయత్నించి మిగులనైపుణ్యముతో హంతకుని బట్టుకొనియెను.

ఆ హంతకుఁ డెవ్వఁడనుకొన్నావు ? దొంగలగుంపులోనివాఁడే ! ఆ క్రూరకర్ముని పేరు దమనుఁడు. ఆరాత్రి మఱియిద్దఱుదొంగ లావర్తకుని జంపివైచి యాతనికడకున్న వస్తువులను ధనమునుగూడ నపహరించుకొని పోవలయు నని యొకమూలఁ జీకటిలో నక్కి యుండిరి. ఆసమయమునం దాదమనుఁడు తానుగూడ స్వాయముగా నింకొకదొంగతనము చేసి దినవెచ్చమును సంపాదింపవలయు ననునుద్దేశముతో డాక్టరురమేంద్ర బాబును వెంబడించిపోయెను.

ప్రఫుల్లబా బిట్లు చెప్పుచుండెను గాని యావృద్ధురాలామాట లను సంపూర్ణముగా విశ్వసింపఁజాలకుండెను. ఆమె తనమనసులో పోలీసువారు నిశ్చయముగాఁ దప్పుత్రోవను బడిపోయి యాదమనుఁడే హంతకుఁడని యెంచి వాని బట్టుకొనిరని భావించుకొనియెను. రమేంద్ర బాబును జంపినవాఁ డాతఁ డెంతమాత్రమును గాఁడని యామెకు నమ్మకముగానుండెను. అప్పు డామె ప్రఫుల్లబాబుం గాంచి "ఆదనునుఁ డనుహంతకుఁడే రమేంద్రబాబును జంపినట్లు పోలీసువా రెట్లు తెలిసి కొనఁ గలిగిరి ?" అని ప్రశ్నించెను.

ప్రఫుల్లబాబు గంభీరభావముతో "ఆయపరాధపరిశోధకుఁడు దొంగలగుంపులోని యొకకుఱ్ఱవానిని వశపఱచుకొని యాతనికి వేయి రూపాయలనిచ్చెద నని యాశపెట్టెను. డబ్బునందలియాశచే వాఁడు సమస్తవిషయములును పత్తేదారునకుఁ జెప్పివైచెను. వాఁడు దొంగల గుంపులోనివాఁడే. కాని కొంచెము చిన్నవాఁడు. ఆరితేరినవాఁడుగాఁడు ఆతనికిఁ బదునాఱు, పదునేడువత్సరములకంటె నెక్కువవయసుండదు. హంతకుఁ డగుదమనుఁ డెక్కడకుఁ బోయి దాఁగియుండెనో యాసంగతి కూడ నాతఁడు సవిమముగాఁ జెప్పివైచెను. ఆతనిమూలముననే

పత్తేదారు పోలీసువారి సాహాయ్యమును గైకొని పోయి యాహంతకుని బట్టుకొనఁగలిగెను.

ఇంతస్పష్టముగాఁ జెప్పినను గూడ నీవిషయమునం దావృద్ధురాలికి విశ్వాసము గలుగదయ్యెను. ఆమె మరల మృదుస్వరముతో "అలాగా ! దమనుఁ డనుహంతకుఁ డారాత్రి రమేంద్రబాబును హత్య చేయుచుండఁగా దొంగలగుంపులోని నాకుజ్జువాఁడు స్వయముగాఁ జూచినట్లు చెప్పినాఁడా ?" అని ప్రశ్నించెను.

ప్రఫుల్లబా బంగీకారసూచకముగా తలయూఁచుచు "వాఁడట్లు చెప్పెనో లేదో నాకంతబాగుగాఁ దెలియలేదు—నేనీవిషయమై ప్రశ్నించియుండలేదు" అనియెను.

వృద్ధు : అట్లయినచోఁ గేవలమును దొంగలగుంపులోనికుజ్జు వానిమాటలనే యాధారము చేసికొని పోలీసువా రాదమనుని హంతకుఁడుగా భావించిపట్టుకొన్నారా ?

ప్రఫు : ఔను—ఇప్పటి కింతవఱకే జరిగినది—తరువాత నింకను నిదర్శనములను గనుఁగొందురు.

ఇట్లింకను మఱికొంతసేపు సంభాషణ జరిగినతరువాత హేమాంగి పినతల్లి యింటికి వెడలిపోయెను. కాని యామె యింకను నిశ్చింతురాలై యుండఁజాలకపోయెను. ఏమనిన—రమేంద్రుని జంపినహంతకుఁ డెవ్వఁడో యామె స్పష్టముగా నెఱుఁగును గాదా !—కాని యెవ్వఁడో యొకమనుష్యుఁడు హంతకుఁడుగా నిశ్చయింపఁబడి పోలీసువారిచేఁ బట్టుకొనఁబడినందులకుమాత్ర మామె యించుక సంతుష్టురాలయ్యెను. ఆపట్టువడినవాఁడు దోషియైన నేమి కాకయున్న నేమి—ఇఁక నీహత్యవిషయమునఁ బోలీసువారికిఁగాని, ప్రజలకుఁగాని యెన్నటికైనను సతీశునియెడల ననుమానము గలుగుట కవకాశము లేదుగదాయని యామె కించుక ధైర్యము గలిగెను.

* * * *

పోలీసువారు దమనుని బట్టుకొని మధుపురమునకుఁ దీసికొని వచ్చిరి. ఊరిలోనివారందఱును హంతకుని జూడవలయునని గుంపులు గుంపులై వచ్చుచుండిరి. ఊరంతయును జాల గందరగోళముగా నుండెను.

యథాసమయమునందు దమనుఁడు న్యాయస్థానమునకుఁ గొని పోఁబడియెను. న్యాయాధికారి సమ్ముఖమునందు దొంగలగుంపులోని యా బాలకుఁ డీవిధముగా సాక్ష్యమిచ్చెను—

"మా గుంపువారందఱు నొకనాఁ డొక పెద్దవర్తకుని హత్యచేసి యాతని యొద్దనున్న వస్తువులను ధనమును దొంగిలించుకొని పోవలయునని నిశ్చయించుకొని యందుకొఱకు వీధిప్రక్కను జీకటిలో దాఁగికొని యుండిరి. అప్పుడు దమనుఁడు వారింగాంచి "ఆ వర్తకునిపని గావించుటకు మీరెరువురును జాలుదురు, నేను శాస్త్రరుపని చూచుకొందును. ఆతఁడు ప్రతిదినమును రాత్రులయందుఁగూడ బయటికిఁ బోవుచుండును. ఆతనియొద్ద నెల్లప్పుడును బంగారుగడియారము, గొలుసు, కొంచెము డబ్బునుగూడ నుండును." అని చెప్పి యాతఁడు డాక్టరు రమేంద్ర బాబునింటిమొగముగా వెడలిపోయెను. తరువాతఁ గొంతసేపటిలోనే డాక్టరుబాబు తన యింటిసమీపమునకు వచ్చెను. ఇంక నొక నిమిషములో నాతఁ డింటిలోనికిఁ బోవును. సరిగా నా సమయమునందు దమనుఁ డాతనివెనుకపాటున వచ్చి తలపగిలిపోవునట్లుగా చేతికఱ్ఱతో నాతని తలపై మోదెను. ఆ దెబ్బతో డాక్టరుబాబప్పుడే క్రిందఁబడి పోయెను. ఆ వెంటనే దమనుఁడు డాక్టరుబాబు జేబులోనున్న బంగారు గడియారమును దీసికొనఁ బోవుచుండఁగా నింతలో నెవ్వరో యొక మనుష్యుఁ డచ్చటికి వచ్చెను. ఆతఁడు తన దుష్కృత్యమంతయుం జూచి యుండుననను భయముచే దమనుఁ డప్పుడు చటాలున లేచి

యా మనుష్యునిపైఁ బడియెను. ఆ వచ్చిన మనుష్యునిచేతిలోఁగూడ నొకకత్తి యుండెను. అప్పు డామనుష్యులు కత్తులతోఁ గొట్టుకొనుట కారంభించిరి. ఆ కొట్లాటలో క్రొత్తగవచ్చిన మనుష్యునిచేతిలోని కత్తి ముక్కలై పోయెను. దమనుని చేతికత్తి యింకను విఱుగలేదు గాని యా వచ్చిన మనుష్యుఁడు మిగుల బలవంతుఁడుగా నగుపడుటచే నాతనితోఁ బోరాడి జయించుట కష్టమని భయపడి కష్టపడి చేసినపని యంతయు వ్యర్థమై పోయెనని చింతించుచు దమనుఁ డయ్యంధకార ములో నతివేగముగఁ బాఱిపోయి నిముసమాత్రంబున తన రహస్యస్థానమును చేరి దాఁగియుండెను. దమనునకుఁ గేవలమును డాక్టరుబాబును జంపవలయు ననునుద్దేశము లేదు. ఆతనికడ నేమైన దొరకినచో నపహరించుకొని పోవలయుననియే యాతఁ డాశపడి వచ్చెను”

ఆ దొంగకుఱ్ఱవాఁడు చెప్పినట్లుగనే యెల్లసంగతులును జరిగి యుండెను. ఇది యంతయు నాలకించి ప్రేక్షకులాదఱును నిట్టూర్పులు విడువసాగిరి. అప్పుడు దమనుఁడుగూడఁ దన కిఁక నెట్టిరక్షణోపాయమును లేదని నిశ్చయించుకొనియెను. అందుచే నాతఁడు స్వయముగా “నేనే హంతకుఁడను” అని యంగీకరించెను. ఆతఁడు తానుచేసినపనియంతయు దన నోటిమాటలతో నిట్లు చెప్పెను :—

“డాక్టరుబాబుకడ దొరకినసొమ్ము నపహరించికొని పోవలయు ననియేకాని నాకాతని వధింపవలయునను నుద్దేశ మించుకంతయును లేదు. ఒక్కకత్తిదెబ్బచేతనే యాతఁ డెట్లు చచ్చిపోయెనో నేనిప్పటికిఁ గూడ నూహింపఁజాలకున్నాను! డాక్టరుబాబు పడిపోయిన వెంటనే నేనాతని జేబులోని వస్తువులను సొమ్మును దీసికొనవలయునని ప్రయత్నించుచుండఁగా నెవ్వఁడో గాని వెనుకపాటున వచ్చి నన్నాక్ర మించెను. అప్పు డాత్మరక్షణమునకై చటాలున నేనుగూడ నాతని నెదిరించితిని. కొట్లాటలో నాతని చేతికత్తి విఱిగిపోయినదిగాని

నేనాతనితోఁ జాలనేనని భయపడి తుదకాయంధకారములోఁ బాఱి పోయితిని ”

అని యీవిధముగా హంతకుఁ డగు దమనుఁడు చెప్పుటయు న్యాయాధికారి యాతనింగాంచి “ అప్పుడు నిన్నడ్డుకొనినమనుష్యుఁ డెవ్వఁడు ? ఇప్పుడు మరల నొకసారి చూడఁగలిగినచో నాతని నీవాన వాలు పట్టఁగలవా ? ” అని ప్రశ్నించెను.

దమనుఁ డశ క్తిసూచకముగాఁ దలత్రిప్పుచు “ ప్రభూ ! నేను గు ర్తింపఁజాలను—ఆరాత్రి గాఢాంధకారము—పొగమంచు గ్రమ్ము కొని వుండెను. నాకాతఁడు బాగుగ నగపడనేలేదు–అయినను గొంతెము లీలగా బోధయగుచున్నది—అతఁ డొకగొప్పయింటిబంగాళాబాబువలె నగపడినాఁడు ” అని చెప్పెను.

న్యాయాధికారి యీవ్యవహారము నంతను బరిశీలించి దమనునకు ద్వీపాంతరవాసశిక్ష విధించెను. ఈసంగతి యంతయు సతీశచంద్రుని యింటిలోనివారి కందఱకును దెలియవచ్చెను. అప్పు డందఱును దల యొకవిధముగను భావించుకొనిరి. కాని యప్పుడుగూడ హేమాంగి పినతల్లి రమేంద్రుని జంపినవాఁ డెంతమాత్రమును దమనుఁడై యుండఁ డనియే భావించుకొనియెను. నిజమే—సతీశుఁడు రమేంద్రునిహంతకుఁ డైనట్లామెకు స్పష్టముగాఁ దెలిసియుండఁగా నెంతశిక్ష బడియున్నను దమనుఁడు హంతకుఁ డైనట్లామె యెట్లు విశ్వసింపఁగలఁడు ? ఆమె యింటిపెద్దదాసిని బిలిచి “ ఓసీ ! ఈసమాచార మంతయును హేమతో మాత్రము చెప్పకుము ! ఆమె కింకను బాగుగ నారోగ్యము కలుగ లేదు—ఆమె యిట్టిగందరగోళపువిషయములను వినఁదగినంతటి అవస్థలో లేదు. పాపము ! జబ్బుగా నున్నదిగాదా ? ” అనియెను.

కాని యామాట లాకర్ణించి దాసిమాత్రము మఱియొకవిధము గనే భావించుకొనియెను. హేమాంగికి రమేంద్రనాథునిమొదట పతి

గౌరవమును, ప్రేమయుఁగూడ నున్నది, అందుచే రమేంద్రుఁడని జంకిన హంతకుఁడు పట్టువడి శిక్షింపఁబడియె ననుమాట నాలకించినచో నామె కానందముగా నుండును. కాని యట్టిసంతోషము గలిగించుట కిష్టము లేకయే యీయామె యిట్లు నిషేధించుచున్నదని దాసి భావించు కొని హేమాంగి కీసంగతి యంతయు నెప్పుడు చెప్పుదునా యని మంచి యవకాశమున కెదురుచూచుచుండెను.

## ఇరువదినాలుగవ ప్రకరణము

నేఁటి రాత్రి బండిమీఁద హేమాంగి యిటనుండి బయలుదేఱి కలకత్తాకుఁ బోవును. ప్రాతఃకాలమునుండియు దాసదాసీజను లింటిలోని వస్తువుల నన్నిటిని మూటలు గట్టుచుండిరి. హేమాంగి యింకను నీరసముగనే యున్నది. కాని యామె శక్తి తెచ్చుకొని యన్ని పనులను జూచుకొనుచుండెను. ఎట్లయిన నిచ్చటినుండి వెడలిపోయినచో నించుక మనశ్శాంతి గలుగు నని యామె యాశపడుచుండెను. ఇక్కడిగొడవలన్నియు నామెకుఁ జాల ప్రాణసంకటములుగా నుండెను.

హేమాంగి తనపెద్దదాసిని బిలిచి "సామానంతయును మూటలు గట్టినారా ? ఏదియును మఱచిపోలేదుగద !" అని ప్రశ్నించెను.

దాసి : అంతయు రెండుజాములలోపుగానే పూర్తి యగును. పనివాండ్రందఱును బనిచేయుచునే యున్నారు—మఱి—

దాసి యింకను నేమియో మాటాడఁదలఁచి యూరకుండుటం గాంచి హేమాంగి వికలహృదయముతో "ఏమే — ఏదియో మాటాడఁదలఁచి నట్లున్నావు ?" అనియెను.

దాసి యదియొక విధమైన కంఠస్వరముతో "ఆతఁడు దొరకి పోయినాఁడుసుమీ !" అనియెను.

హేమాంగి యాత్రముతో దాసిమొగమువంకఁ దదేకదృష్టిం గాంచుచు అతఁ డెవ్వఁడు ?" అని యడిగెను.

దాసి : హంతకుఁడు ! ఆ రాత్రి డాక్టరు రమేంద్రబాబును జంపివైచిన హంతకుఁడు !—

హేమాంగి యదరిపడి కేవలమునస్పష్టమగు కంఠస్వరముతో "ఎవఁడు ?—ఎవఁడు ?—ఆ హంతకుఁ డెవ్వఁడో తెలిసిపోయినదా ?" అనియెను.

దాసి : ఆ. తెలిసినది. వాఁడు దొంగలగుంపులోనివాఁడే— వానిపేరు దమనుఁడఁట—వాఁడే స్వయముగాఁ దాను రమేంద్రుని జంపివైచితినని న్యాయస్థానమునం దంగీకరించినాఁడు !

హేమాంగి ,వికలహృదయముతో, సంచలితకంఠస్వరముతో "పిన్నీ !" అని పిలిచి దాసింగాంచి "ఓసీ ! పిన్ని నొకసారి తీసికొని రమ్ము !" అని పంపించెను.

దాసి పోయి పిన్నిని దీసికొనివచ్చెను. హేమాంగి యామెం గాంచి జరగినవృత్తాంతమంతయును సవిస్తరముగాఁ జెప్పవలయునని యడిగెను. ఆమె తాను విన్నవిషయము లన్నియును గ్రమక్రమముగా హేమాంగికిఁ దెలియఁజేయుచుండెను. ఇట్లు చెప్పుచుండఁగనే

హేమాంగి యాకస్మికముగా నర్థస్ఫుటస్వరముతో గేకలువైవ నారంభించెను—ఎదుట ద్వారమునొద్ద సతీశచంద్రుఁడు నిలువఁబడి యుండెను!

పరిశీలింపఁగా సతీశుఁ డప్పుడే రైలునుండి దిగివచ్చినట్లగపడు చుండెను. ఆతని దుస్తులన్నియును మాసి యున్నవి. ఆతఁడుగూడఁ జాల నలఁగి యుండెను. ఆ స్థితిలో నాతఁడు హేమాంగి సమీపమునకు వచ్చి "హేమా! ఇప్పటికైనను నీ సంశయము వదలిపోయినదా? ఇప్పటికైనను నీకు నా మాటయందు నమ్మకము గలిగినదా?" అనియెను.

హేమాంగి యేమని విశ్వసింపఁగలదు?—హంతకుఁడు సతీశుఁడు గాని, మఱియొకఁ డెట్లగును?—అప్పు డామె యతివ్యాకులితంబులు, నతివిషణ్ణంబులు, నతివిస్ఫారితంబులు నగునయనములతో నాథుని మొగమునంక నూరక చూచుచు నిలువఁబడిపోయెను. ఔరా! ఏమి యా చూపు! అతిదారుణంబగు శోకయార్తనాద మా చూపులను బద్దలుగఁ జేసికొని యతిఘోరముగ వెలువడుచున్నదా యన్నట్లుండెను!

అప్పుడు హేమాంగి పినతల్లి సంభ్రమముతో "సతీశా! సతీశా! నీవే చెప్పుము!—నిజముగా నీవే చెప్పుము! నీవు—ఆ రమేంద్రుని—"

అనుచుండఁగనే సతీశుఁ డడ్డమువచ్చి "అత్తా! నీవుగూడ నన్నింతటి క్రూరపాపుఁడనిగ నే భావించితివా? ఎంతపాపము! అట్లైనన్న టికిని గావమ్మా! ఆ రాత్రి నేనింకొకనిమిషము ముందుగనే యచ్చటికి వచ్చియున్నచో ఆ దొంగముండకొడుకు రమేంద్రునిజంపఁగలఁడా? ఏమి లాభము! అంతపనియును జరగిపోయినతరువాత నేనుపోయితిని. నన్నుఁ జూచుటచేతనే యా దొంగ నూతికడనున్న వస్తువులను దోఁచుకొనఁ జాలక పాఱిపోయినాఁడు! ఏమైననేమి? అంతయును వృథయైనది. అత్తా

హేమతోఁ గొంచెము మాటాడవలసి యున్నది. నీవించుక నేపీగది నుండి యవ్వలకుఁ బొమ్ము !" అనియెను.

ఆమాట విని హేమాంగిపినతల్లి నిష్కారణముగాఁ దాను సతీశునియెడల ననుమానపడినందులకుఁ జాల విచారించుచు మెల్లమెల్లఁగా నటనుండి వెడలిపోయెను. అప్పుడు సతీశచంద్రుఁడు భార్యచెంతకుఁ బోయి నిశ్శబ్దముగా నిలువఁబడియెను.

హేమాంగి రుద్ధకంఠస్వరముతో "ఏమిది ? మీరిప్పుడు చెప్పిన సంగతి యంతయు నిజమేనా ?" అని ప్రశ్నించెను.

సతీ : నిజమేనా యని యింకను నీవు నన్నుఁ బ్రశ్నించుచుంటివా ? నేనొక్కప్పుడైన నసత్యము పలికితినా ?

హేమాం : కాని — అట్లయిన వో — మీరీసంగతి నాతో మొట్టమొదటనే యేల చెప్పలేదు ?

సతీ : ఇప్పుడు నీవడిగినప్రశ్నకుఁ బ్రత్యుత్తరము చెప్పుటకు ముందుగా నేను నిన్నొకమాట యడుగవలసి యున్నది. ఒకవేళ నేనప్పుడే యీమాట నీకుఁ జెప్పియుందు ననుకొందము. అట్లయినచో నివాసమయమునందు నామాట సత్యమే యని విశ్వసింపఁగలవా ?

అప్పు డేమిచెప్పినను విశ్వసించుట యసంభవమే అని హేమాంగికిప్పుడు బోధపడియెను. ఆమెహృదయమునం దింతకుఁబూర్వము పాతుకొనియున్న యనుమానము సతీశుఁడు వేయిశపథములు చేసి యెన్నిమాటలు చెప్పినను దీఱునది గాదని యామె తెలిసికొనఁగలిగెను. హేమాంగి యప్పుడు కేవలము మహాశ్చర్యావిష్టయై శిలాప్రతిమవలె నిలువఁబడిపోయెను. ఆమెహృదయ మంతయును జడీభూత మైపోయెను.

అప్పుడు సతీశచంద్రుఁడు "హేమా! నేనప్పు డెన్నివిధముల నచ్చఁజెప్పినను నీమనసులోని సంశయము నించుకంతయైనను గదపఁ జాల నని యెఱుంగుదును! అందుచేతనే నేనప్పుడు విశేషించి యేమి యును మాటలాడ లేదు. కేవలము నేనప్పుడు "హేమా! పొరపాటు పడి విశ్వాసమును బోఁగొట్టుకొనకుము" అని మాత్రమే చెప్పితిని. తరువాతఁగూడ నేనిచ్చట నుండక వెడలిపోయి కలకత్తాలో ఘన ప్రయత్నము చేసి యీహత్యారహస్యము బయలుపడునట్లు చేసితిని. రమేంద్రుని హత్యచేసినవాని రహస్యము బయటపెట్టినవాని కైదువేల రూపాయలు బహుమాన మిచ్చెద నని యిచ్చటనే ప్రకటించి పోయితిని. కలకత్తాకుఁ బోయి పోలీసువారిసాహాయ్యమును బడసి యిచ్చటి కొక పత్తేదారును బంపు నేర్పాటు చేసితిని. అప్పటినీయున్మత్తప్రలాపము లను నేనెంతమాత్రమును లక్ష్యము సేయలేదు. నీమాటలవల్లనే నిన్నును, బిడ్డలను, పరివారమును, సర్వస్వమునుగూడఁ ద్యజించి భయ భ్రాంతునివలెఁ బాఱిపోయితిని" అనియెను.

ఈమాటలు—ఇప్పుడు సతీశుఁడు చెప్పినమాట లెంతమాత్ర మును అపరాధి చెప్పుకొను విన్నపములు గావు—ఈమాటలచే నింత వఱకును హేమాంగికన్నులను నావరించుకొనియున్న సంశయకరాళచ్ఛా యయంతయు నొక్కసారిగా నపసారితమైపోయెను. ఇఁక నామె యేమియును మాటాడఁజాలకపోయెను. నాథునివిశాలవక్షమునందు నెమ్మొగము నుంచుకొని కేవలమును వెక్కివెక్కి యేడువనారం భించెను.

సతీశచంద్రుఁ డప్పుడు తనప్రాణేశ్వరిని బిగికౌఁగిటం జేర్చుకొని హత్యజరిగిననాఁటిసంగతు లన్నియును సవిస్తరముగాఁ దెలియఁజేసెను.

ఆనాఁటిరాత్రి హేమాంగిచెంత రమేంద్రనాథుఁడు కూర్చుండి మాటాడుచుండఁగాఁ గిటికీలోనుండి కన్నులారఁ గాంచి సతీశచంద్రుఁడు కేవల మున్మత్తప్రాయుఁడై పోయినమాట సత్యమే. కాని యెంత

కోపము వచ్చినను రమేంద్రుని జంపివేయవలయునను నంతటి దురుద్దేశ మాతనిహృదయమునం దించుకంతయును గలుగనే లేదు. ఈ దినము మొదలుకొని నీవిఁక నెన్నఁడును మా యింటికి రావలదనియు, ఇఁక నెప్పుడును నా భార్యకడకుఁ బోయి యామెతో మాటలాడవలదనియు స్పష్టముగా రమేంద్రనాథునితోఁ జెప్పవలయునని నిశ్చయించుకొని సతీశచంద్రుఁడు రమేంద్రుని యింటియొద్దకుఁ బోయి యాతఁడు వచ్చువఱకును ద్వారముకడ నిలువఁబడి యెదురుచూచుచుండెను. ఇట్లుండఁగాఁ గొంతసేపటి కాతని కొక చప్పుడును, దానితోఁగూడ నస్ఫుట మగు నార్తనాదమును వినవచ్చుటచే సతీశుఁడు పరుగెత్తుకొని యా వైపునకుఁ బోయెను. అప్పు డెవ్వఁడో యొకమనుష్యుఁడు పడిపోయిన డాక్టరు జేబునుండి గడియారమును దీసికొనిపోవుటకు సంసిద్ధుఁడై యుండెను. చూచినంతనే సతీశుఁ డాతనిపైఁ బడియెను. ఆతఁడుగూడఁ దత్తరముతో సతీశు నెదిరించెను. అప్పు డాయిరువురును గొట్లాటలో సతీశునిచేతికఱ్ఱ విఱిగిపోయెను. అంతలో హంతకుఁడు తాను దొరకిపోవుదునేమో యనుభయముచే నవకాశము చూచికొని యా గాఢాంధకారములో నెచ్చటికో పలాయితుఁడై పోయెను. ఆ చీకటిలో నిఁక నాతనిఁబట్టుకొనుట యసాధ్యమని భావించి సతీశుఁడు వాని ననుసరింపలేదు. అప్పుడు సతీశుఁడు తనజేబులోని యగ్గిపెట్టెను దీసి యగ్గిపుల్లను వెలిఁగించి చూచెను. అప్పటికే రమేంద్రనాథుఁడు చచ్చి పడియుండెను. ఇట్టియవస్థలో నితరు లెవ్వరైనఁ దన్నుఁ జూచుట తటస్థించినచో నేమని యనుమానింతురో యని సంశయించి సతీశుఁ డట నొకనిమిషమైన నిలువక వెడలిపోయెను. కాని గాఢాంధకారము క్రమ్ముకొని యుండుటచేఁ [illegible] యాతఁడు త్రోవ దప్పిపోయి [illegible] నదీ[illegible]ంబులఁ బడిపోయె[illegible] [illegible]ంమచే నాఁడు ధరించిన

దుస్తులన్నియును దడిసిపోయెను. ఈ స్థితిలో నింటివారికైనను దన్నుఁ జూచినచో నసుమానము గలుగకమానదని యెంచి యూతఁడు దొడ్డి త్రోవనే లోపలఁ బ్రవేశించి జలసిక్తములై రోఁడుముట్టించేఁ గళంకిత ములై యున్న తనదుస్తులను, ఇటికపోయిన చేతికఱ్ఱముక్కలను తన పెట్టిలో దాచి దానికి జాగ్రత్తగాఁ దాళమును వైచి తనయొద్దనే యుంచుకొనియెను.

ఈ చరిత్ర మంతయును జరగినది జరగినట్లు సతీశుఁడు తన సతీమణికిఁ దెలియఁజేసెను. హేమాంగి యాతనివక్షమునఁ దల నుంచు కొని నాథునివచనామృతము గర్ణరసాయనముగా నాస్వాదించు చుండెను. ఆమె నయనద్వయమునుండియు నవిరామముగా నశ్రుధారలు ప్రవహించుచుండెను. కాని యవి యతిదారుణశోకోత్తప్తంబులును, మర్మదాహకంబులునగు నుష్ణాశ్రుధారలు గావు. సుశీతలంబులును సర్వసంతాపనివారకంబులును, నయనసారంబులు నగు నానందాశ్రు ధారలు! హేమాంగి కేవలము నేడ్చుచునే యుండెను. కాని యా యేడు పెంత సుఖకరమైనది! అది యెంతయూరటను గూర్చు చున్నది! వేయివిధములగు నరకబాధలైనను దానియెదుట నిలువఁ జాలవు. చిరకాలమునుండి యామె సకలాంగకములయందును నెలకొని యున్న సంతాపసమూహమంతయు నొక్కసారిగా మాయమైపోయెను. ఆమె హృదయకుహరమునం దింతవఱకును బొదుకొనియున్న యసూయాపిశాచ మిప్పు డెక్కడకుఁ బాఱిపోయెనో గాని యద యుందుతావునం దిప్పుడు దివ్యాకృతులందాల్చి ప్రేమవిశ్వాసము లధిష్ఠించి యున్నవి! ఆ ప్రేమవిశ్వాసదేవత లిప్పుడు పవిత్రానందాశ్రు ధారలచే నభిషిక్తము లగుచుండెను. కుసుమవల్లిక మరలఁ దరుశాఖా శ్రయమును గాంచి శోభిల్లుచున్నది—పతిపరాయణయు, సహధర్మిణియు నగు హేమాంగి ప్రాణేశ్వరుని యంకతలమున మరలఁ బ్రతిష్ఠితయై విరాజిల్లుచున్నది!

# ఇరువదియైదవ ప్రకరణము

చాలసేపటివఱకును నాథుని వక్షస్థ్సలంబున నానందాశ్రు ధారలను విడుచుచుఁ జాలసేపటికు హృదయశాంతి నలవఱుచుకొని హేమాంగి సురల నంతలోనే యెప్పటివలె వ్యగ్రకంఠస్వరముతోఁ మీరీసకల వృత్తాంతమును నాతో మొట్టమొదటనే యేల చెప్పలేదు? రమేంద్రబాబు బట్టి దుష్టులచేఁ జంపఁబడి పడియుండగాఁ గన్నారఁ గాంచియు నప్పుడిరుగుపొరుగువారలతోనైనఁ జెప్పక యూరక యేల వచ్చితిరి? అంతఘోరకృత్యము జరిగినప్పుడందఱితోడను జెప్పక యూరకుందురా? ఇంతటి నిష్ఠురత్వముం బూనియుండుటకుఁ గారణ మేమి? గుండెలను బగల్చివైచునంతటి ఘోరవార్తను మనసునందే యడఁచిపెట్టుకొనుట మీ కెంతో కష్టముగా దోఁచలేదా?" అనియెను.

అప్పుడు సతీశచంద్రుఁడు మృదులస్వరముతో "హేమా! నేనట్టి వ్వరికిని దెలియఁజేయకుండుటకుఁ గారణమేమో నేనిదివఱకే నీతోఁ జెప్పియున్నాను. నేనే హంతకుఁడనని లోకులనుమానింతురేమో యను భయముచేతనే యీ సంగతి నేనితరుల కెవ్వరికిని దెలుపుటకు సాహసింపఁజాలనైతిని. నేనింటికి వచ్చుచుండఁగా మందిరపాలకుఁడు నాకగపడి హత్యజరిగె నని చెప్పుటచే నాతఁడీ రమేంద్రునిహత్యను గూర్చియే తెలిపియుండునని భావించితిని. అందుచేతనే మనవంట వాఁడు రాత్రి వచ్చియొక నర్తకుఁడు హత్యగావింపఁబడెనను వార్త చెప్పి నప్పుడు ఆతఁడు పొరపాటుగా వినియుండు నని నేనభిప్రాయపడితిని.

వర్తకుఁడు గాఁడు; రమేంద్రుఁడు చంపఁబడియె నని నేనప్పుడు చెప్పి యుంటిని" అనియెను.

హేమాం : అయ్యో ! మీరీవిధముగా నేల ప్రవర్తించితిరి ? అందుచేతనే—మాకందఱకునుగూడ మీయెడల ననుమానము గలిగి నది ? అందువలన నేనెంతగా బాధపడిపోయితినో మీకుఁ దెలియునా?— మీరు నాప్రాణనాయకులు—నాయిహపరజీవితములకుఁ బరమాశ్ర యులు — నాధర్మార్థకామమోక్షస్వరూపులు — నాసర్వస్వములు మీరేగదా ! అట్టిమీరు హంతకులై యుందురని యనుమానించుచుం డుటవలన నాకెంతబాధ గలుగుచుండెనో, వేయిదారుణమరణములవలన నైనను నంతబాధ యుండదు—నేనాఘోరబాధపడఁజాలక చావవలయు ననియే యనుకొంటిని—కాని బిడ్డలమూలమున నాకట్టిరాజమార్గము లభించినది గాదు—అప్పటి నాదురవస్థంగూర్చి యేమని చెప్పఁగలను ! నేనుప్రాణములతో నుండియు మృతప్రాయనైపోయితిని—జ్ఞానముతో నుండియు సంజ్ఞావిహీనురాలనైపోయితిని—బుద్ధి చెడిపోయినప్పుడు, దుఃఖము ముంచుకొనిపోయినప్పుడు—జీవిత మెంతభయంకరముగా నుండునో మీరెఱుంగరా ?" అని చెప్పుచు హేమాంగి మరల నేడువ నారంభించెను.

సతీ : నేనిదియంతయు నెఱుంగుదును—కాని యాస్థితిలో నేమిచేయుట కవకాశ మున్నది ? ఇప్పు డీవిధముగా హంతకుఁడు పట్టు వడియెను గాని యతఁడే యింకను దొరకకయే యున్నచో నితరులమాట యట్లుండఁగా నీవుమాత్రము నామాటలను విశ్వసింపఁగలవా ? అందు చేతనే యంతయుఁ జూచుచు నేనిట్లూరకుండవలసివచ్చినది. ఇప్పు డంత యును వింటివిగదా—ఇంకను నీ కేమైన సందేహమున్నదా ?

హేమాం : లేదు—లేదు—ఇప్పటికి నా ప్రాణములు కుదుటc బడినవి. స్వామీ ! నాయపరాధమును క్షమింపుము ! అబలను ! విద్యావిహీనురాలను, మీసహధర్మిణిని—అగునన్నుc బ్రేమపూర్వకముగా క్షమింపవలయును.

అశ్రుధారలచే సంసిక్తం బై యున్న హేమాంగిముఖకమలము నప్పుడు సతీశచంద్రుడు తన రెండు చేతులతోడను బైకెత్తి పరమానంద ప్రేమావేశముచేc జుంబనము గావించెను. కొంతసేపటివఱకు నయ్యిరువురకునుగూడ నేమిమాటాడుటకును శక్తియే లేకపోయెను. తుట్టతుదకు సతీశుcడే తెలివి తెచ్చుకొని "హేమా ! ఈదినముననే యిట నుండి వెడలిపోవుట కేర్పాటు గావించితివా ?" అని ప్రశ్నించెను.

హేమాం : ఔను—ఈరాత్రిబండిమీcదనే బయలుదేఱి పోవుటకు నిశ్చయించితిని. నామానంతయును మూటలుగట్టుట యైనది.

సతీ : వలదు—నీశరీరమునం దింకను బాగుగ నారోగ్యము గలుగలేదు. మఱికొన్నిదినము లిచ్చటనే యున్నచో నీకు మంచి యారోగ్యము గలుగును. తరువాత మనము కలకత్తాకుc బోవచ్చును— ఏమందువు ?

హేమాం : మీయిష్టము. నాయభ్యంతర మేమియునులేదు— నాకిప్పు డీప్రపంచమునందలి ప్రతిప్రదేశమునుగూడ స్వర్గమువలెనే యగపడుచున్నది. ఏమందురా ? నాకు మరలc బవిత్రప్రేమమయ మగు నాస్వామివక్షమునందు సుస్థిరమగు నాశ్రయము లభించినది!— మీరు వినలేదు గాcబోలును ! నాకీనడుమ నెంతటివికారజ్వరము తగిలినదనుకొన్నారు !

సతీ : ఔను — నేనంతయు నెఱుంగుదును. నీశరీరమునం దెట్లున్నదో నాకుc బ్రతిదినమును కబురు తెలియుచునే యుండెను.

హేమాం : (ఆశ్చర్యముతో) మీకీవర్తమాన మెట్లు తెలియుచున్నది ? మీపేర నుత్తరమే వ్రాయలేదని పిన్ని చెప్పినదే !

సతీ : డాక్టరుబాబు దినదినమును నాకు జాబువ్రాయుచునే యున్నాఁడు. నీకంతజబ్బుగా నున్నచో నేనప్పుడే బయలు దేఱి వచ్చియుందును. కాని నీకుఁ జేసినజబ్బు అపాయకరమైన దేయనియు, అయినను దైవానుగ్రహమువలన నెమ్మదిపడవచ్చుననియు, అంత తొందరపడి మీరు రానక్కఱ లేదనియు డాక్టరుబాబెప్పటికప్పుడు వ్రాయుచుండెడివాఁడు. అందుచే నేనురాలేదు—నీవేమనుకొంటివి ? కేవలము నేను నిన్ను మఱచిపోయితి ననియే భావించుకొంటివి గాఁబోలును !

హేమాం : లేదు — లేదు — నేనట్లెన్నఁటికిని సందేహించు దానను గాను. కాని యప్పటిహృదయావస్థను మీ రెఱుంగరు ! ప్రాణపదమగు నాస్వామి, నాప్రత్యక్షదైవతము నిరంతరమును నివసింపఁదగిన నాహృదయపీఠమునం దప్పుడు కేవలమును రక్తధారలను వర్షింపఁజేయు ఘోరనరహంతకుఁ డధిష్ఠించి యుండెను !—పవిత్రదేవతామందిర మప్పుడు పైశాచికక్రీడారంగమైపోయినది ! అప్పటి నాహృదయ సంక్షోభ మెంతభీషణమైనదో చెప్పుటకుఁ దగినమాట లేమున్నవి ?— ఏమైననేమి ! పాపదూషితము లగు నట్టిమాటలవలన నిప్పు డెట్టిప్రయోజనమును లేదు. కర్మఫల మందఱు ననుభవింపవలసినదే గదా—అట్లే నేనుగూడ ననుభవించితిని—కాని మీరుమాత్రము నావిషయమునం దన్యాయముగా ననుమానపడితిరి.

సతీ : ఔను—ఆమాట నేను, మనఃపూర్వకముగా నంగీకరించెదను. కాని యిప్పుడుమాత్ర మట్టియనుమానమంతయు నొక్కసారిగా వదలిపోయినది. ఈయనుమానపిశాచము మరల నెప్పటికైన నాహృదయమునఁ బ్రవేశింపఁజాలు నేమోయని సంశయించుటకుఁ గూడ నిఁక నెట్టిఅవకాశమును లేదు. ఇదిగో! చూడుము! భార్యాభర్తలిరువురు

నేకశరీరులు—వారిహృదయము లభిన్నములైనవి. సుఖదుఃఖముల యందును, సంపద్విపత్తులయందును దంపతులు సమభాగులు గదా—అట్టి భార్యాభర్తలకుఁ బ్రత్యేకధర్మములును, ప్రత్యేకాలోచనలును లేవు. ఈసంగతి నాశరీరమునందలి ప్రత్యణువునకును నవగతమైనవిష యమే—ఈప్రపంచమునందు దంపతులలోఁ బరస్పరమును స్వరహస్య గోపనము గావించుకొనుటవలననే సంసారమునందు హాలాహలము పుట్టు చున్నది—ఆహాలాహలమువలననే సంసారమంతయు నచిరకాలమున నశించిపోవుచున్నది !— నీవు నాధర్మపత్నివి — ఇహపరలోకముల యందును నాయర్ధాంగివి—మఱియు నాకు సహధర్మిణివి—అట్టి నీ విషయమున ననుమానించుచుండుటచేతనే నాకు సర్వనాశనమై పోవు చుండెను—అందుచేతనే యతిప్రయత్నముతోఁ గాపాడుకొనుచున్న బంగారువంటి నాసంసారము నంతను నేను నాచేతులారఁ బాడుచేసు కొంటిని !

హేమాం : మీరిట్లు జరిగినదానికై విచారింపవలదు—విధి విధానము నెవ్వరు తప్పించుకొనఁగలుగుదురు ?

సతీ : మఱియొకమాట—ఈయైదువేలరూపాయలు ననెంత ! ఎట్లయిన మనరమేంద్రబాబు జీవించి మరల వచ్చుట కవకాశమే యున్నచో నట్టిప్రయత్నమునకై నాభూసంపత్తియంతయును గూడ విని యోగించుటకు నేను సిద్ధముగా నున్నాఁడను.

హేమాం : మీరారాత్రి చూచినసంగతు లన్నియును పోలీసు వారికిని, దక్కినవా రందఱికిని సవిస్తరముగాఁ దెలియఁజేసితిరా ?

సతీ : లేదు—హేమా ! ఒకవేళ నీగొడవ యంతయును వారికిఁ జెప్పినను లాభ మేమియును లేదు. పోలీసువారిచేఁ బట్టువడిన హంతకుఁడే నిశ్చయముగా రమేంద్రబాబును జంపినవాఁడని నేను ప్రమా ణము చేసి చెప్పఁజాలను—కలకత్తాపోలీసువారితో నేనెలసంగతులను

జెప్పి యుంటిని. ఇచ్చటివారికిఁ గూడఁ జెప్పి గొడవలు పెంచుట వలనఁ బ్రయోజన మెంతమాత్రమును లేదు. సత్యమంతయును మనము తెలిసికొనఁగలిగితిమి. ఇంతే చాలును. ఈ సంగతు లితరులు తెలిసికొనవలసినంత యావశ్యక మేమియును లేదు.

ఈ సమయమునఁ జిన్నబాబు పరుగుపరుగున నచ్చటికి వచ్చి "బాబా! బాబా! అనుచు సతీశచంద్రుని కౌఁగిలించుకొనియెను. సతీశుఁడు చటాలునఁ గుమారు నెత్తుకొని యొడిలోఁ గూర్చుండఁ జేసి ముద్దు పెట్టుకొనియెను.

ఇంతలోఁ బెద్దదాసి యచ్చటికిఁ బరుగెత్తుకొని వచ్చెను. ఈ సమయమున సతీశబా బిచ్చటికి వచ్చునని యామె యూహించుకొన్నైన లేదు. అందుచే నామె సతీశునిం గాంచి పరమాశ్చర్యావిష్ట హృదయముతో నూరక నిలువఁబడి చూడఁదొడంగెను!

అప్పుడు హేమాంగి పరమానందముతో "ఓసీ! నేఁటి మన ప్రయాణమునుగూర్చి బాబుగారు—"

అనుచుండఁగనే సతీశుఁ డామెమాట కడ్డము వచ్చి "ఔను— ఈమెకింకను నీరసముగనే యున్నది. కొన్నాళ్లవఱకు నిచ్చటనే యుండుట మంచిది. షామ్మ్రు—సామానంతయు నెప్పటియట్ల సరుదుకొనుము!" అనియెను.

# ఉపసంహారము

ఆ దినమున సతీశ బాబుమందిర మంతయును మహోత్సాహమయముగానుండెను. హేమాంగికి సంపూర్ణారోగ్యము గలుగుటచే బంధుమిత్రుల కందఱకును విందులు గావించుట కేర్పాటు గావింపఁ బడియెను. సతీశుఁ డామధుపురమునందుఁ దానెఱింగినవారిని, బంధువులను, మిత్రులను నందఱినిగూడ బంధుమిత్రపరివారముగాఁ దన యింటికి విందునకు రావలయునని యాహ్వానించెను. సాయంకాలము ప్రీతిభోజనము జరుగఁగలదు. రైల్వేస్టేషనునందలి యుద్యోగస్థులను, కలకత్తానుండి వచ్చి రమేంద్రుని హంతకుని బట్టుకొని శిక్షింపఁ జేసిన సుప్రసిద్ధుఁడగు నా పోలీసు పత్తేదారునిగూడ సతీశచంద్రుఁ డతి గౌరవముతో నాహ్వానించెను. హేమాంగి కింకను సంపూర్ణముగా నారోగ్యము గలిగెనని చెప్పుట కవకాశము లేదు; జబ్బువదలిపోయినది గాని యామె శరీర మింకను దుర్బలముగనే యుండెను. అయినను బరమానందావేశముచే నామె యిఁక మంచముపై నూరక పరుండి యుండఁజాలక పోయెను. పిన్నతల్లియు, సునాంశుఁడును నుత్సాహముతోఁ గావించుచున్న ప్రయత్నముల కన్నిటికిని హేమాంగి యనేక విధముల నుపదేశరూపమునఁ దోడుపడుచుండెను. నేఁడామె నేత్రము లుత్సాహపూరితములై యుండెను; హృదయకమలమానందవికసిత మయ్యెను; సుందరముఖమండలము శరచ్చంద్రమండలముంబోలి మందహాసచంద్రికావిలసితమై యుండెను. నడుమనడుమ నించుక యాయాసము తోఁచినప్పుడుమాత్ర మామె యొకసారి సోఫాపైఁ బరుండి విశ్రాంతినందుచుండెను.

క్రమముగా సాయంకాల మయ్యెను. అప్పుడే సతీశచంద్రుఁడు గావించిన యేర్పాటు ప్రకారము మందిరమంతయును వినిర్మలదీప

కాంతులచే విరాజితం బగుచుండెను. వాస్తవముగా నప్పు డామందిరము సుందరాలంకారములచేతను, పుష్పమాలికలచేతను దివ్యవైజయంతముం బోలి శోభిల్లుచుండెను. సతీశ్‌బాబు నింటిలోనివారందఱును చాల దినములనుండి యానందోత్సాహముతో మందిరమునంతను సిక్కిరిగా నలంకరించి యుండిరి. ఆ భవనమునందలి పరివారజనుల హృదయము లన్నియును బరమానందమయములై యుండెను. వారివదనకమలములు ప్రేమరసతరంగితములై యుండెను. గదిలో హేమాంగి యొంటరిగాఁ గూర్చుండి యుండుటం గాంచి సతీశుఁ డామె చెంతకుఁ బోయి కూర్చుండెను. అప్పు డాతని హృదయమంతయును ప్రేమరసభరితమై యున్నట్లును, నయనము లానందాశ్రుపూరితములై యున్నట్లును, ముఖమండలము మందహాస సుధామయమైయున్నట్లును జూచినంతనే యెల్లవారికిని దోఁచుచుండెను.

సతీశుఁ డప్పుడు సతీముఖం గాంచి "హేమా! ఇది చాల నానందమయమగు దినము! ఇప్పుడు మరల మనకుఁ బుష్పశయ్యా దినము వచ్చినటున్నది గాదా! కాని—"

ఆ మాట ముగియకుండఁగనే హేమాంగి యాత్రముతో "కాని"—అనుచున్నా రేమి? ఇఁక నేమియు మఱియొకమాట చెప్పవలదు. నా మనసులో నెట్లున్నదనుకొన్నారు! ఇదివఱకొకసారి యీ 'కాని' అనుమాటవలననే మీయొద్ద నొకమాట దాఁపఁబడి దాని మూలమున నేనెంతటిభయంకరశిక్ష ననుభవించితి ననుకొన్నారు?" అనియెను.

సతీ: సత్యము చెప్పితివి హేమా! నీనాయెడల దాఁపవలసిన విషయ మేదియును లేదు. అట్లు దాఁచుటవలననే యమృతమయమగు దాంపత్యము కేవలము హాలాహలమయమై పోఁగలదు! నేనిప్పు డంతయుఁ బ్రాణపణముగఁ బ్రయత్నించి యనుభవపూర్వకముగా గ్రహింపఁగలిగితిని. నేనిప్పుడు "కాని—" అనుమాట మఱియొక

యభిప్రాయముతో ననియుండలేదు. నా మనసులోని యొకమాటను జెప్పదలంచి యట్లంటిని. ఈ ప్రీతిభోజన మహోత్సవసమయమునందు మన డాక్టరు రమేంద్రబాబుకూడ నున్నచో నెంతయానందముగా నుండును! రమేంద్రబాబు మన కెంతయో మహోపకారము గావించి యున్నాఁడు. ఆతఁ డంతప్రాణపణముగా నిస్స్వార్థపరుఁడై చికిత్సయే గావింపకున్నచో మనము మనచిన్నబాబును మరలఁ బడయఁ గలుగుదుమా? నేను కేవలము ననుమానపిశాచావేశముచే నంధ ప్రాయుఁడనై యాతఁడు గావించిన సత్కార్యము లన్నింటియందును దోషములనే యారోపించుకొంటిని. అప్పు డాతని పవిత్రహృదయ మునకుఁ గూర్చి యెన్నియో పాపపుఁ దలంపులఁ దలంచితిని. అట్లు నేను స్వయముగాఁ జేసికొన్న మహాపాపమునకుఁ దగినశిక్షనే యనుభవించితిని.

హేమాంగి యాకస్మికముగా నివ్వెఱపడి చూచుచు భయ భ్రాంతంబగు గద్గదస్వరముతో నొక్కకేక వైచి "ఎవరు?—ఎవరు?—నీవెవ్వరు?—నీవు—ర—" అనుచు సోఫాపై మూర్ఛితయై పడిపోయెను.

సతీసచంద్రుఁడు విభ్రాంతుఁడై తడఁబడిపోవుచు రెండుచేతుల తోడను జల్లనినీటి నామె మొగముపైఁ జిలికి విసనకఱ్ఱతోఁ జల్లగ విసరఁదొడంగెను. ఆకస్మికముగా హేమాంగి యిట్లు మూర్ఛిల్లి పడిపోవుటం గాంచి సతీశుఁడు చాల భయపడిపోయెను. ఆతనిదృష్టి యంతయు నామె మొగముమీఁదనే పడియుండెను. ఇతరమేమియు నాతని కగపడుటలేదు.

ఆహా! ఏమియాశ్చర్యము! నిశ్చయముగా రమేంద్రనాథుఁ డప్పు డాగదిలోఁ బ్రవేశించి యుండెను! రమేంద్రుఁడు మెల్లమెల్లఁగా నడుగులు వైచుచు ముందటికి వచ్చి నాడినిఁ బరీక్షించుటకై హేమాంగి కరపల్లవమును దనచేతులతో నెత్తి పట్టుకొనియెను. ఆకస్మికముగా సతీశునిదృష్టి యాతనిపైఁ బడియెను! భయమును,

విస్మయమును, ఆనందమునుగూడ నొక్కసారిగా నాతనిహృదయమును నిండిపోవుటచే నప్పు డాతనినోటినుండి యొక్కమాటయైనను వెలువడుట కవకాశమే లేకపోయెను !

అది యంతయును రమేంద్రనాథుఁడు గ్రహించి " మిత్రమా ! నేను మరణింపలేదు. జీవించియే యున్నాఁడను. ఇప్పుడు మీయింట జరుగుచున్న యుత్సవమును దర్శింపవలయునను కుతూహలమును మనసు నందే యడంచుకొనఁజాలక యిన్నగా నిచ్చటికి వచ్చి యుంటిని. సతీశ బాబూ ! భయపడి మనసు చెదరఁగొట్టుకొనవలదు. నీసతీమణిగూడ నింకొకనిమిషములో స్వస్థత నందఁగలదు !" అనియెను.

సతీశుఁ డానందావేశముతో " నిన్ను నేనిప్పు డేమని సంబోధింప వలయునో నిశ్చయించుకొనఁజాలకున్నాను. నేనిదివఱకు నీయెడల మహాపచారమును గావించియుంటిని. అయినను అసాధారణ మగు సౌభాగ్యముచే మరల నిట్లు నిన్ను వీక్షింపఁగలిగితిని. భగవద్విలాసము ధన్యమైనది ! అందుచే నిప్పుడు నాజీవితము ధన్యమైనది !" అనియెను.

రమేం : అదియేమియును గాదు సతీశబాబూ ! అంతయును బొరపాటువలన జరిగిపోయినది—నీవును, నేనును, నీభార్యయుఁగూడ నీవిషయమునందుఁ గేవలమును బొరపాటుపడిపోయితిమి. అందుచేతనే మనమందఱమునుగూడ దానికిఁ దగినఫలము ననుభవించితిమి. ఇప్పటికి మనభ్రాంతు లన్నియును వదలిపోయినవి. ఇఁక మనమందఱమును మరల సుఖవంతులము గాఁగలమని యాశించుచున్నాను.

సతీ : నేను కేవలమును, అవివేకముంబగు భ్రాంతిలో మునిఁగి పోయితి నని స్పష్టముగాఁ దెలిసికొనఁగలిగితిని. నాశరీరమునందలి సకల ప్రాణువులునుగూడ నీవిషయము ననుభవపూర్వకముగా గ్రహింపఁగలిగి నవి. హేమకూడఁ బొరపాటుపడెననియే చెప్పవచ్చును—కాని డాక్టరు బాబూ ! నీవు గూడఁ బొరపడితివా ?

రమేం : పొరపాటు లేకుండుటకు నేనుమాత్రము దేవుఁడ నను కొంటివా ? అతివిషమంబగు నట్టిసంశయము నాకుఁ గలుగుటచేతనే నిష్కారణముగా మీకును, మధుపురమునందలి పెద్దమనుష్యులకుఁ గూడ నింతటి మనఃకష్టమును గల్పించితిని—ఆరాత్రి నా వెనుకనుండి యెవ్వఁడో కొట్టిన కఱ్ఱదెబ్బచే నప్పుడే చైతన్యము దప్పి పడిపోయితిని. తరువాతఁ గొంతసేపటికే నాకు తెలివివచ్చినది. కన్ను దెఱచి చూచి నంతనే నీవు నాకగపడితివి. ఇఁక నేనప్పుడు ఏమియు మాటాడక చచ్చినట్లే పడియుంటిని. నీవే నన్నట్లు కఱ్ఱతోఁ గొట్టియుంటివనియు, నట్లే కాకున్నచో నట్టిదురవస్థలోఁ బడియున్న నన్నటు దిగవిడిచి యేల పాఱిపోవుదు వనియు భావించితిని. ఆకస్మికముగా నీవట్టిపాపకృత్యము నేలచేసియుందువో యాక్షణమునందే నేనూహించుకొనఁజాలకపోయి తిని. కాని నీవటనుండి వెడలిపోయినతరువాత నీవివాహమునకుఁ బూర్వము జరిగిన సకలవృత్తాంతములును వరుగా నాకు స్మృతికి రా నారంభించెను. అందుచే నీవు నాయెడలం గలిగిన యీర్ష్యావేశముచే నన్నుఁ జంపివేయవలయు ననుదుద్దేశముతో నిట్టిదారుణకృత్యమును గావించియుందువని భావించుకొంటిని. నాకప్పు డట్టియూహ తోఁచి నంతనే యీప్రపంచమునందు కేవలమును వైరాగ్యము గలిగెను. సతీశ బాబూ ! నాపొరపాటుతలంపునకు క్షమింపుము ! అప్పుడు నీయెడల నాకెంతయో యసహ్యాభావము గలిగినది. ఏమనిన—నీవు నీభార్య నెంతప్రాణపదముగాఁ జూచుకొనుచుంటివో నేనెఱుంగుదును. ఎవ్వఁడు తనభార్యను దనప్రాణములకంటె నధికముగఁ బ్రేమించుచుండునో యట్టి నిర్మలప్రేమగల యాతఁడు తనభార్యపరపురుషాసక్తురాలై యుండు నేమో యని యెన్నఁటికైనను సందేహింపఁగలఁడా ? కేవల కామాసక్తి యెన్నఁటికిని నిర్మలప్రేమ గానేరదు. నిర్మలప్రేమమయంబగు హృదయమునందు సందేహమునకుఁగాని, యీర్ష్యకుఁగాని యించుకంత యును జోటులభింపదు. కావుననే నాకు నీయెడలం గలిగిన యసహ్యా భావమును నాహృదయమునందు దృఢపఱచుకొంటిని—

సతీశుఁ డామాట కడ్డమువచ్చి "రమేంద్రబాబూ ! నీకుఁ దోఁచినయూహ యసత్యము గాదు—నేను మొట్టమొదట హేమను మనఃపూర్వకముగాఁ బ్రేమింపలేదు. ఆమె సౌందర్యమునం దడలి మోహముచేతనే నేను ముగ్ధుఁడనై పోయితిని. అందుచేతనే నాహృదయమునందు మాటిమాటికిని, ఈర్ష్య, సందేహము, ద్వేషభావమును గలుగుచు నప్పుడప్పుడు నన్నుఁ బశుప్రకంఠెను నధమాధమునిగాఁ జేసినైచుచుండెను. డాక్టరుబాబూ! ఇన్నిమాట లెందులకు? దాంపత్యమన నేమో, సహధర్మిణి యనిన నెట్టిదియో నాకదినము కెంతమాత్రమును దెలియనే తెలియదు. కేవలకామాసక్తిచేతనే భోగపరాయణుఁడనై యల్లాడిపోవుచుంటిని—ఇన్నాళ్ళ కిప్పుడు నాకన్నులు తెఱవఁబడినవి—సహధర్మిణి యన నేమియో సంపూర్ణముగా గ్రహింపఁగలిగితిని—రమేంద్రబాబూ ! చెప్పుము ! తరువాత నేమిజరిగినది ?" అనియెను.

రమేం : నాకప్పు డొకయూహ తోఁచినది. నేనిఁక మరల నీకంటికి కగపడినచో నీయనుమానము కేవలక్రోధముగాఁ బరిణమించి హింసకుఁ గారణము గాఁగలదనియు, అట్లు తటస్థించినచో సాధ్వీమణి యగు హేమాంగికష్టమునకును, అశాంతికిని భారమే లేకుండఁబోవునసియు భావించితిని. మీరు మధుపురమునం దున్నంతకాలమును నేను మీకంటి కగపడకుండ నెందైనఁ గాలక్షేపము చేసికొన్నచో నిశ్చయముగా నేను మరణించితి ననియే భావించుటవలన నీవు నిశ్చింతుఁడవై యుండుదువు, నీభార్య కెట్టియశాంతియును లేకుండు ననియు నిశ్చయించుకొంటిని. కాని నేను పలాయితుఁడనై పోయినచో నిచ్చటి ప్రజలలో ననేకసంశయములు పుట్టుట కవకాశముండు ననియు, అందువలన హేమాంగికిఁ గూడ నెట్టియపవాదము తటస్థించునో యనియు నాకు సంశయము గలిగెను. అందుచే నేనప్పుడు మరణించితి ననియే లోకవిశ్వాసము గలిగింపవలయు నని యెంచి నాజేబులోనున్న.

రూపాయలసంచిలోని పదిరూపాయలనోటునుమాత్రము దీసికొని (ఇంకను చాలధన మున్నది) నాదుస్తుల నన్నిటి నచ్చటనే విప్పిపాఱ వైచి యొక వస్త్రఖండమునుమాత్రము ధరించి గిరిధీమార్గమునుబట్టి బయలుదేఱి పోయితిని.

సతీ: అదియేమి యట్లనుచున్నావు? నీమృతకళేబరమును మధుపురమునందలి ప్రజలెల్లరునుగూడఁ గన్నులారఁ జూచియున్నారు గాదా! పోలీసువారుగూడఁ బరీక్షచేసినతరువాతనే నీ దేహము శ్మశానమునకుఁ గొనిపోఁబడి సంస్కారము చేయఁబడినది—నీమాట చాలవింతగానున్నదే!

రమేం: ఔను. అట్లు జరిగినమాట సత్యమే—సతీశబాబూ! ఆశ్చర్యములో మునిఁగిపోకుము!—ఈసందర్భమునందుఁ గాకతాళీయముగా నొకయద్భుతసంఘటనము జరిగినది!

సతీ: అది యెట్లు? ఏమిదిడాక్టరుబాబూ! అతిగంభీరమగు రహస్యయవనికను క్రమక్రమముగా దొలఁగించుచున్నావే!

ఇట్లు వారుసంభాషించుకొనుచుండఁగా నాక్షణమునందే కలకత్తా నగరమునందు సుప్రసిద్ధుఁడగు నొకపత్తేదారు గదిలోపలఁ బ్రవేశించెను. అతఁడు నేఁటివిందున కాహ్వానింపఁబడి వచ్చియుండెను. ఆపత్తేదారు రమేంద్రబాబును జూచినంతనే తనజేబులోనుండి యొకఛాయాపటమును బైకిఁ దీసి కొంతసేపటివఱకును దానివంకఁ జూచుచుఁ దరువాత రమేంద్రబాబుం గాంచి "ఓహో రేంద్రవిశ్వాసా! శిక్షాస్మృతి ననుసరించి నీవపరాధివి. బాగుబజారునందు నివసించుచున్న శ్రీమతి విలాసవతిని వధించిన యపరాధముక్రింద నేను నిన్నుఁబట్టుకొనుచున్నాను" అని చెప్పుచు రమేంద్రునికుడిచేతిని గట్టిగఁ బట్టుకొని "సతీశబాబూ! నీయింటికి వచ్చినయతిథిని దొరతనమువారి యాజ్ఞానుసారముగాఁ బట్టుకొన్నందులకు క్షమింపుము!" అనియెను.

సతీశుం డాకస్మికముగ నిర్విణ్ణుడైపోయెను. రమేంద్రుం డేమియును మాటాడలేదు. ఆ సమయమునందు హేమాంగికి సంపూర్ణముగాం దెలివి వచ్చినది. ప్రఫుల్లబాబు మొదలగు నతిథులందఱును లోపలం బ్రవేశించిరి. చాలసేపటినుండి సతీశుండుగాని హేమాంగిగాని యగపడకుండుటచేం గారణ మేమైయుండునని సంశయముతో సుధాంశుండును, ఆతనితల్లియుం గూడ వారిని వెదకుకొనుచు నచ్చటికి వచ్చిరి. అందఱు నొక్కసారిగా నెదుటనున్న రమేంద్రబాబుం గాంచి భయవిస్మయానంద పరవశులై యేమియు మాటాడక యట్లే నిలువంబడి చూచుచుండిరి. మఱియు రమేంద్రనాథుని దక్షిణహస్తము పత్తేదారుచేతులయందు బంధింపంబడి యుండుటం గాంచుటచే వారి యాశ్చర్యమునకుం బరిమితియే లేకపోయెను. ఈ వ్యాపారమంతయు నేమో తెలిసికొనవలయునను కుతూహలముతో నందఱును రమేంద్రనాథుని మొగమువంకం దదేకదృష్టిం గాంచుచు నిలిచి యుండిరి.

అప్పుడు రమేంద్రుండు పత్తేదారుం గాంచి "అయ్యా! మీరు తొందరపడవలదు. ఈ గంభీరరహస్యమును మీరు భేదింపంజాలరు. చెప్పెదను వినుండు—ఆ రాత్రి యందఱునుగూడ నాయింటియొద్దం బడియున్న మృతకళేబరము నాదిగనే నిశ్చయించిరి. పోలీసువారు కూడ నట్లే భావించి సత్కారమున కాజ్ఞ యొసంగిరి. సత్కారము గూడ జరగిపోయినది. ఎవ్వరికిని సంశయము గలుగకపోవుట నాకుం జాల నాశ్చర్యముగా నుండెను. ఇట్లు జరుగుటకు గారణమేమని నేను బాగుగ నాలోచించి ప్రయత్నించి యెట్లో కారణమును గ్రహింపం గలిగితిని. ఈ ఘటనాపరంపరలన్నియును బహురహస్యమయములై యుండెను. ఆ యింటియొద్దకు వచ్చి యా రాత్రి నా సేవకుండు చూచునప్పటికి సరిగా నా పోలికనే గలిగియున్న యొకవ్యక్తిమృతకళేబరము నా దుస్తులచేతనే యలంకరింపంబడి ద్వారపార్శ్వమునం బడియుండెను. దానిం గాంచి నా సేవకుండు నేనే యట్లుచచ్చి పడిపోయితినని

భావించెను. ఆ మృతదేహమునందు మొగమంతయును రక్తపూరితమై మట్టిచే నట్టగట్టుకొనిపోయెను. అప్పటి దేహము నా యాకారమునే కలిగియున్న యాన్యక్తి యింకొక వ్యక్తియో యైయుండునని సంశయించుట కెవ్వరికి నవకాశము లేకపోయినది—

అని యింకను జెప్పఁబోవుచుండఁగా సతీశచంద్రుఁ డడ్డమువచ్చి "రమేంద్రబాబూ! నీవిప్పు డేదియో యశ్రుతపూర్వంబగు నొక చిత్రకథను జెప్పుచున్న ట్లగపడుచున్నావే! ఇట్టియద్భుతవ్యాపార మపరాధపరిశోధక నవలలలోఁగూడ నే నెన్నఁడును జదివి యుండ లేదు!" అనియెను.

రమేం: ఈ సంఘటనము స్వాభావముగా జరగినదే యైనను అద్భుత కల్పనామయంబులగు నవలలవలెనే యున్నదనుమాట సత్యమే. ఈ సత్యమును నే నెంతయో ప్రయత్నము చేసి తెలిసికొంటిని. హరేంద్ర విశ్వాసుఁ డనువాఁ డొకఁడు కేవలము నా పోలిక గలవాఁ డున్నాఁడు. అతఁడు విశేషాలంకారములు గలిగినవిధవ నొకదానిని మోహపెట్టి యామెను వెంటఁబెట్టుకొనిపోయి కలకత్తాబాగుబజారు నందు నివసించుచుండెను. వారిరువురును జాలకాలమువఱకు నచ్చట భార్యాభర్తలవలెనే మెలంగుచుఁ గాపురము చేయుచుండిరి. ఆకస్మికముగా నేకారణముచేతనో గాని వారిలో వారికిఁ గలహము పుట్టుటయు హత్యలు జరగిన యానాఁడే సాయంకాలమునందు దాతఁడు తనప్రియురాలిని జంపివైచి యామె వస్తువులను, ఆమె యొద్దనున్న సొమ్మును గూడఁ దీసికొని చేలగట్ల త్రోవనుబడి నఘుపురమునకు వచ్చుచుండఁగా దొంగలువెంబడించి వచ్చి యాతనిఁ జంపివైచి ధనమునంతను దోఁచుకొనిపోయిరి. అచ్చటనుండి యా దొంగలు మరల నాయింటియొద్ద నన్నుఁ గొట్టిన చోటికి వచ్చి చూడఁగా నేను వారి కగపడనైతిని. ఇంటిగుమ్మమునొద్ద నా దుస్తులుమాత్రము చెదరిపడి యుండెను. అప్పుడు వారాదుస్తులను దీసికొనిపోయి ఆ హరేంద్రవిశ్వాసుని మృతకళేబరమున కలంకరించి మా శవమును మా యింటిగుమ్మము కడఁ బాఱవైచి పోయిరి.

సతీ : ఏమి! ఈ కథ చాల నద్భుతముగా నున్నదే! అరేబియా కథలనుగూడ మించిపోయినది! సరేకాని యా శవమునకు నీ గుడ్డలు కట్టి నీ యింటికడఁ బారవైచుటకు దొంగలయుద్దేశ మేమైయుండును?

రమేం : దొంగలిట్లే యెన్నియో కపటతంత్రములను గావించుట యందు మిగుల నేర్పరులై యుందురు. పోలీసువారికన్నులలో దుమ్ము గొట్టవలయునను నుద్దేశముతోనే వారిట్లు గావించియున్నారు. వారప్పుడు నా శవము నెవ్వరో యవ్వలికిఁ దీసికొనిపోయి పారవైచి యుందురనియు, ఆ క్రొత్తశవముగూడఁ గేవలము నా పోలికనే యున్నదనియు భావించి యా మృతకళేబరమునకు నా దుస్తులనుదొడిగి తీసికొని వచ్చి నా యింటియొద్దఁబడవైచి పోయిరి. ఆ వ్యక్తి విదేశస్థుఁడగుటచే నాతనింగూర్చిన విచారణమేదియును రాదనియు, ఈ మృతకళేబరము నాదనియే యెల్లవారును విశ్వసింతురనియు, ఇందువలన రెండుహత్యలు చేసినను, ఒకహత్యగనే భావింపఁబడి రెండవహత్యం గూర్చిన ప్రసక్తియే లేకుండఁబోవుననియు వారూహించుకొని యుందురు. తుదకట్లే జరగినది. ఆ రాత్రి నేనుగూడఁ జచ్చియే యున్నచో మూఁడుహత్యలగును గదా! ఇట్టి స్థితిలో లోకమునకుఁ దెలిసినది రెండుహత్యలను గూర్చియేనా?—

ఇది యంతయు నాలకించి పత్తేదారు కేవలమును లజ్జితుండై రమేంద్రనాథునిచేయి వదలివైచి తప్పు క్షమింపవలయునని యాతని ననేకవిధములఁ బ్రార్థింపఁదొడంగెను. తుట్టతుద కాపత్తేదారు మృదుస్వరముతో "అయ్యా! నేనిదివఱకతిరహస్యమయములగు ననేకహత్యలం గూర్చి యనుసంధానము చేసి హంతకులను బట్టుకొని యున్నాను. కాని నా జీవితకాలములో నిట్టి ప్రమాదము నాకెన్నఁడును గలుగలేదు. నేనిప్పుడు చాల తప్పుపని చేసితిని. దానికిఁ దగినశిక్షగా నేనింతటినుండి నా పత్తేదారుపనిని త్యజించివైచుచున్నాను!" అని చెప్పెను.

ఆనాఁడు రమేంద్రనాథుఁ డగపడిన తనమిత్రుల కందఱకును గూడఁ దనచరిత్రమును వేఱువేఱుగాఁ జెప్పియుండెనని వేఱుగ

యనక్కఱలేదు. ఆతఁడు తుట్టతుదకు ఏకాంతస్థలమునందు హేమాంగీ సతీశులను గలిసికొని వారిహృదయమునందలి సంశయాంధకము నంతను దూరీకృతముగాఁ జేసివైచెను. ఆ దినమునం డచ్చటికిఁ ప్రీతిభోజనమునకై వచ్చిన యందఱిసంశయములును వదలిపోయెను. ప్రీతిభోజన మానాఁడందఱకును సంపూర్ణ ప్రీతిదాయక మయ్యెను.

హేమాంగి మిక్కుల సుత్సాహముతోడను, ఆనందముతోడను, ...వముతోడను అచిరకాలములోనే ప్రఫుల్లబాబుతనయను రమేంద్రనున కిచ్చునట్లేర్పాటు చేసి మహాసమారోహముతో వివాహమహోత్సవమును జరిపించెను. ఆ కల్యాణమహోత్సవ సమయమునందుఁ పెండ్లికూఁతురగు సుశీలకు హేమాంగి యొక మణిపుష్పహారమును బహుమానముగా నొసంగెను. ఆ రత్నాలపేరునందుఁ దనపేరుగా :—

"ఇహపరంబులయం దెందు ♦ నింతులకును
పతులకంటెను నితరదే ♦ వతలు లేరు."

ను సువర్ణాక్షరములను జెక్కించి యుంచెను.

పెండ్లికుమారుఁడగు రమేంద్రునకుఁగూడ సతీశచంద్రుఁడు బహుమానముగా నొక బంగారుగొలుసు నొసంగెను. దానిపై ...తఁడు :—

"అర్ధంభార్యా మనుష్యస్య
భార్యా శ్రేష్ఠతమస్సఖా"

ను వాక్యము నక్షరరూపమునఁ జిత్రింపఁజేసెను.

రమేంద్రనాథునితల్లి యప్పుడు నూతనదంపతుల నాశీర్వదించుచు హృదయాంతరాళమున నానందము పొంగిపొరలిపోవుచుండుటచే హేమాంగిచెంతకుం బోయి "అమ్మా! నీవు పతిసహధర్మిణివై ...ంపుము!" అని యాశీర్వదించెను.

సంపూర్ణము.

శ్రీ రాజేశ్వరిప్రెస్, రాజమండ్రి—1956